

వింద్యాల ఫణి శేఖర్ రెడ్డి సమర్పించు
సత్యం ఎంటర్‌టైన్‌మెంట్
FROM THE DIRECTOR OF SHOW
నీలకంఠ
మిస్సమ్మ
she is the BOSS
DIGITAL dts SOUND
నిర్మాత: బి.సత్యనారాయణ
కథ స్క్రీన్‌ప్లే మాటలు : నీలకంఠ
సంగీతం : వందేమాతరం శ్రీనివాస్
కెమెరా : జవహర్ రెడ్డి
ఆర్ట్ : కె.వి రమణ
ఎడిటింగ్ : నాగిరెడ్డి
SUJEETH

హాసం

హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

55

**Also available on net:**
**www.haasam.com**



**ముఖచిత్రం**

'అంజి' లో
చిరంజీవి

## హాస్యం



'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల పుస్తకం













## సంగీతం



పాటల
ప్రత్యేకం



69,70,71,
72,73,74
పేజీల్లో

# మీ జనవాక్యం

డిసెంబర్ నెల ద్వితీయ పక్ష 'హాసం'లోని 66వ పేజీలో ప్రచురించిన "కళ్లు తెరువరా నరుడా" అనే పాట చూశాను. చదివినంతసేపూ బాల్యస్మృతులు ఒక్కసారిగా గుర్తువచ్చాయి. ఆటల సమయంలో కాలికి దెబ్బలు తగిలించుకుని, ఇంటికి వచ్చి ఈ పాటలోని చరణాన్ని పాడుతూ తెలియజేయటం, రాయికి కాలు తగల్లేదు కాలే రాయికి తగిలిందని ఒకసారి, మరోసారి కాలికి రాయి తగల్లేదు రాయే కాలికి తగిలిందని తికమక చేసి చెప్పటం గుర్తుకు వచ్చింది. ఈ పాటలో 'కమలనాభుని పద కమలములే కలుష జలధికి చేతుమురా' అని ప్రచురించారు. కాని అది వాస్తవంగా "కమలనాభుని పదకమలములే కలుష జలధికి సేతువురా" అని చాలాసార్లు పాడుకున్నట్టు గుర్తు. కర్మలకు కర్త, విధాత అయిన కమలనాభుడు ఈ కలుష భవ జలధిని దాటించగల సేతువని భావం. ఎందుకంటే ఈ పాటలోని వేదాంత సారం చాలా నిగూఢమైనది. బుద్ధ్యానుసారే కర్మ కర్మానుసారే బుద్ధి ఆధారంగా బలీయమైన కర్మ ప్రవర్తించే, ప్రవర్తింపచేసే విధానం పై చరణంలోని 'కాలికి రాయి, రాయికి కాలుగా' తికమకగా ఉంటుంది. మనసుకి బుద్ధి, కర్మ అను నానార్థాలుండుట వలన వాటి మర్మ మెరిగిన మనసుకవి ఆత్రేయ గారు వ్రాసిన ఈ పాటలో వేదాంత హెచ్చరిక అంతర్లీనంగా గోచరిస్తుంది. వాటిని పరిశీలిస్తే ఆ కమలనాభుని పదకమలములు అఖిల జగతికి మూలమని తెలియవస్తుంది.

మననం, శ్రవణం, పఠనం, ఎంత మధురమో తెలియచేసే మంచి మంచి పాటలను ముఖ్యంగా స్వర్ణయుగం నాటి మధుర గీతాలనందిస్తున్న మీకు అభినందనలు తెలియజేస్తూ....

**-వై. శివరామప్రసాద్, సంగీత విభాగం, ఉషాకిరణ్‌మూవీస్, రామోజీ ఫిలింసిటీ, హైదరాబాద్.**

నేను 'హాసం' పత్రిక అందుకోగానే ముందుగా చూసేది సంగీతం శీర్షికలో పాత పాటల కోసం. వెతుక్కుని ఆ పాటలన్నీ నెమరు వేసుకుంటానికి ప్రయత్నించి, నా పాత జ్ఞాపకాలు గుర్తుకు తెచ్చుకుంటాను. నా మనసు పూర్తిగా నా బాల్యంలోకి వెళ్ళి చాలా సంతోషాన్ని నింపుతుంది. ముఖ్యంగా ఘంటసాల, కిశోర్ కుమార్ గార్లు, లతాజీ పడిన కష్టాలు మనసుకు బాధ నుకలిగించాయి. ఆ పాతపాటలు పాడుకుంటూవుంటే నన్ను నేను మరచిపోయి ఎంతో ఆనందాన్ని పొందుతున్నాను. యిందుకు మీ పత్రికకు చాలా కృతజ్ఞుడను.

**- ధర్మాల సుబ్రహ్మణ్యం, మల్కాజ్‌గిరి.**

నేను 'హాసం'కు వీరాభిమానిని అని సగర్వంగా చెప్పుకుంటున్నాను. ఒకనాటి "విజయచిత్ర" ప్రచురణ ఆగిపోయిన తరువాత అటువంటి మంచిపుస్తకం వస్తుందా అని ఎదురుచూస్తున్న సమయంలో అంతకు మించిన మంచి శీర్షికలతో ఆద్యంతం ఆహ్లాదభరితంగా వసంతమాసంలో విరబూసిన పారిజాత వనంలా 'హాసం' మా ముంగిళ్ళలోకి వచ్చింది. సంవత్సర కాలంగా 'హాసం'ను క్రమం తప్పకుండా చదివి నలగకుండా బైండ్ చేయించుకుంటున్నాను. 'హాసం'లో 'ఆపాటమధురం, బాపూరమణీయం, హాస్యధారావాహికలు, కొమ్మకొమ్మకో సన్నాయి, లతా, కిషోర్‌ల జీవితచరిత్రలు, నిక్షిప్తచిత్రాలు నాకెంతో యిష్టం. ఏడుపుగొట్టు డబ్బింగ్ సీరియల్స్‌తో హోరెత్తిస్తున్న మన "తెలుగు" ఛానళ్ళ జోరులో, యూత్ చిత్రాల హోరులో, శ్రావ్యమైన శివరంజని,మోహన,శంకరాభరణ రాగాలాపనలా పాఠకుల పాలిటి వరప్రసాదం ఈ 'హాసం'.

**-కిషోర్ కుమార్,ఆచంట**

మధ్యమధ్య కొన్ని సంచికలు 'మిస్' అయినా 'హాసం' రెగ్యులర్‌గా చదువుతున్నాను. 'హాసా'నిది విజయహాసమే. సున్నితమైన హాస్యంతో పాటు సంగీత పరిజ్ఞానాన్ని సాహితీ విలువలను స్పృశిస్తూ ఒకపత్రికవుందంటే బాగుండేదని నేను అనుకుంటూ ఉండేవాడిని. ఆ కొరతను ఇప్పుడు మన 'హాసం' తీరుస్తున్నది.

**-పర్వాసుదేవరావు,దేవరకొండ,నల్గొండజిల్లా**

ఎన్నో సంవత్సరాలుగా కార్టూన్లు వేస్తున్న నాకు కార్టూన్లు వాపసు రావడం తెలుసు గానీ ఎడిటర్ గారి సలహాతో వాపసురావడం ఆశ్చర్యానందాల్ని కలిగించింది. గతంలో ఇలా స్వాతి బలరాం గారు సలహా ఇచ్చారు. ఆ తర్వాత మీరే!

**-కళాధర్,కార్టూనిస్ట్,గుంతకల్లు**

1-15 డిసెంబర్ 2003 పత్రికలో శ్రీబాలాంత్రపు రజనీకాంతరావు గారు మీరు ప్రచురించిన సినిమాలో ప్రార్థనా శ్లోకంలోని తప్పుకు మీరు సంతోషించిన తీరు మీ 'హాసం' పాఠకులైన మాకు మహదానందం. అటువంటి గొప్ప మేధావుల దీవెనలు మీకు - అలాగే మీ పాఠకులమైన మాకు - సదా కావాలని కోరుకుంటున్నాము. ఇక సంపాదకీయంలో పేర్కొన్న బాలల చలనచిత్రోత్సవ ప్రారంభోత్సవ సందర్భముగా జరిగిన సంఘటనలకు మీరు ఇచ్చిన సూచనలు అద్భుతం అమోఘం. మీరు చూపించిన రీతిగా పాఠశాలలో చర్చనీయాంశం కావాలి. "వాళ్ళంతే అదో వెరైటీ!" కథ చదవడానికి చాలా బాధకలిగింది... కారణం నవ్వుకోలేక! సూరేపల్లి విజయగార్కి హాస్యాభివందనాలు తెలుపుకుంటున్నాను. ఘంటసాలగారి జయంతి సందర్భంగా నాకు కావాల్సిన పాటలని ప్రచురించినందుకు 'హాసం' సంపాదకీయ వర్గానికి నా అభినందన మందారం.

**-ముత్యాల భాస్కరరావు, రామరాజులంక**

'హాసం' పత్రిక అధినేతలకు నమస్సుమాంజలి. 'హాసం' మొట్టమొదటి సారిగా చూడగానే మొదటి సంచిక నుంచి చూడాలని పించి, మా స్నేహితులతో చర్చించి పాతకాపీల గురించి వెతికివెతికి సంపాదించాను. ఎన్నో విషయాలు చదివి తెలుసుకొని ఆనందించాను. నేను మద్రాసులో 15సం॥ల పాటు సినీ పరిశ్రమలో ఉన్నాను. పబ్లిసిటీ ఆర్టిస్టుగా "అనుపోజుబ్రదర్స్" పేరుతో చాలా సినిమాలు వర్క్ చేసినాము. ఎక్కువగా, డబ్బింగ్ చిత్రాలు చేసినాము. వంశీగారి చిత్రాలు - లింగబాబు లవ్‌స్టోరీ, w/oవరప్రసాద్, శ్రీవారంటే మావారే - మొ॥ స్ట్రెయిట్ పిక్చర్స్ చేసాం. ఇన్నాళ్లుగా సినీ పరిశ్రమలో వున్నా పాత సినిమాల విశేషాలు మాకు తెలియవు. ఇప్పుడు 'హాసం' పత్రికతో చాలా తెలుసుకున్నాను. ఎవరూ సేకరించలేని విషయాలు మీ 'హాసం' ద్వారా తెలుసుకున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. ఈ విషయంలో 'హాసం' పత్రికకు అభినందనలు తప్పవు. ఈ నాటి సినిమాపత్రికలలో మీ 'హాసం' పత్రిక బంగారంతో సమానం అందుకే మీ 'మా' 'హాసం' పత్రిక మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లాలి అని కోరుకుంటున్నాను.

**-అనుపోజు భాస్కరరావు, ఏలూరు.**

గత కొద్దికాలంగా పత్రిక చదవడం మానేసిన వేము 'హాసం'తో సెకండ్ ఇన్నింగ్స్ ఆరంభించాము. ఎలుకవచ్చె ఇల్లు భద్రం కడుపుబ్బ నవ్విస్తున్నది. అక్కడక్కడ అతిశయోక్తులు దొర్లుతున్నప్పటికీ ఏమో ఇదీ నిజం కావచ్చునేమో అనిపిస్తున్నది. మా చిన్నతనంలో అనకాపల్లిలో రూపాయికి పదహారు ఇడ్లీలు ఇచ్చేవారు. నేడు ఈ దిక్కుమాలిన భాగ్యనగరంలో పదిరూపాయలిచ్చి రెండు తింటున్నాము. రచయిత ఊహించిన రేట్లు భవిష్యత్తులో మేము చూసినా ఆశ్చర్యం లేదు. చివర ఇస్తున్న పాటల పుస్తకాలు బైండు చేసుకుంటున్నాను.

**- డా॥హృదయరంజన్, హైదరాబాద్.**

16-31 డిసెంబర్ సంచికలోని సంపాదకీయంలో చెప్పినట్లు ఉత్తర ప్రత్యుత్తరాలు తగ్గిపోవటం చాలా చాలా బాధాకరమైన విషయం. ఫోన్‌లో 'హేపీ న్యూ ఇయర్' చెబుతూ వుంటే అదొక మెకానికల్ అబ్లిగేషన్‌లా వుంటుంది తప్ప ఏ విధమైన పర్సనల్ టచ్ వుండు. 'డాక్టర్ చక్రవర్తి తెరవెనుక కథ ద్వారా చాలా విషయాలు తెలుసుకున్నాను. ఈ సినిమాలోని 'మనసున మనసై బ్రతుకున బ్రతుకై' ఇదే సంచికలో పేరడీ(మనసున ముల్లై బ్రతుకున బండై)'గా రావటం వాట్ ఏ వండర్‌ఫుల్ కో-యిన్సిడెన్స్!

-బి.శ్రీనివాసరావు, హైదరాబాద్

(అది కో-యిన్సిడెన్స్ కాదు. కావాలని ప్లాన్ చేసిందే. - ఎడిటర్)

సంపుటి: 3 సంచిక: 7

**1-15 జనవరి 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

55


మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ


కొత్త సంవత్సరం. కొత్త ఆలోచనలు. కొత్త ఊహలు. 'కొత్త' పదంపై మన మోజుని గుర్తించారు మార్కెటింగ్ నిపుణులు. అందుకే పాత సబ్బునే, పాత టూత్ పేస్టునే, పాత వాషింగ్‌పౌడర్‌నే 'కొత్త' అని చెప్పి విక్రయిస్తారు. ఓ మూల "కొత్త' అనే మాటను ఏటవాలుగా ముద్రించి దీనిలో ఫలానా పదార్ధం అదనంగా చేర్చాం అని రాస్తే చాలు. అసలు ఆ పదార్ధం చేర్చడం వల్లన నాణ్యత ఏ మేరకు పెరుగుతుందో మనకు తెలియదు, వాళ్లూ సరిగ్గా ఛెప్పరు.

'కొత్తొక వింత, పాతొక రోత' అన్న సామెతను అవసరానికి మించి నమ్మడం వల్లనే మార్కెట్‌లో ఈ 'కొత్త' పదం ఇంత రాజ్యమేలుతోందనిపిస్తుంది. నిజానికి కొత్త అంటే మోజుతోబాటు సంశయం కూడా ఉంటుంది. అది ఏ మేరకు మనకు నచ్చుతుంది, ఏ మేరకు నప్పుతుంది అన్న మీమాంస ఉంటుంది. అందువల్ల పాత రుచులకు కొత్త తాలింపు పెట్టి వడ్డిస్తేనే బాగుంటోంది. ఆస్వాదనకు వచ్చేసరికి మళ్లీ మనం మన రుచులను వదిలిపెట్టడం లేదు. ఇక రుచులనుండి అభిరుచులకు వస్తే ముందునుండీ మనలో నలుగుతున్న, మదిలో మెదులుతున్న బాణీలను కొత్త బీట్‌తో, కొత్త తరహాలో అందిస్తే విని ఆనందిస్తున్నాం.

ఈ విషయాన్ని మన సినిమావారు బాగా గ్రహించినట్టు కనబడుతోంది. పవన్‌కళ్యాణ్ వంటి సరికొత్తతరం హీరో నటించిన 'ఖుషీ' లో 50 ఏళ్లక్రితం నాటి 'మిస్సమ్మ' లోని 'ఆడువారి మాటలకు అర్ధాలు వేరులే' పాట ఉపయోగించారు. జనాలు మెస్మరైజ్ అయిపోయారు. తర్వాత వచ్చిన 'జానీ' లో 'ఈ రేయి తీయనిది' పాటని, 'విష్ణు'లో 'రావోయిచందమామ' పాట వరసని పెట్టారు. లేటెస్టుగా వచ్చిన 'మిస్సమ్మ' ఆడియోక్యాసెట్లో 'బృందావనమది అందరిది' పాట ట్యూన్‌లో థీమ్ సాంగ్ వినబడుతోంది.

ఇది సినిమాలకే పరిమితం కావటంలేదు. సంగీత ప్రపంచంలో వస్తున్న రీమిక్స్ ప్రభంజనానికి పునాది కూడా ఇదే కదా. ఈనాటి వారికి నచ్చే కొత్తతరం దుస్తులతో, కొత్త హావభావాలతో, కొత్తహంగులతో పాత పాటలను ఈ తరానికి అందించడం జరుగుతోంది. అంటే పాతతరం నాయికా నాయకుల వేషభాషలు, రూపలావణ్యాలు ఈ తరానికి సరిపడవేమోనని భావిస్తూనే - పాతపాటల్లోని మెలోడీకి మాత్రం నిత్యనూతన లక్షణం ఉరదని అంగీకరించినట్టయింది.

ఇక్కడ గమనించవలసిన అంశం ఇదే. ఫాషన్ మారవచ్చు. కానీ అది పైపై మార్పే. అంతరాత్మ మాత్రం స్పందిస్తున్నది మెలోడీకే, సంగీత మాధుర్యానికే. అది ఎప్పుడూ సజీవమే. సచేతనమే.

రీమిక్స్ విజయం హిందీ రంగానికే పరిమితం కాదని తెలుగునాట తెరతీసిన 'మసక మసక...' ఆల్బమ్ నిరూపించింది. ఒక్కసారిగా అలనాటి గాయనీమణులు, సంగీతకారులు అందరికీ గుర్తుకు వచ్చారు. ఇటువంటి ప్రయోగాలు చాలా వస్తాయని సులభంగా ఊహించవచ్చు. హాస్యనటుడు, తన ఛలోక్తుల ద్వారా విఖ్యాతుడైన కోట శ్రీనివాసరావు అంటూ ఉంటారు - 'ఓల్డ్ ఈజ్ గోల్డ్ బట్ గోల్డ్ ఈజ్ నెవర్ ఓల్డ్' అని. అవును, బంగారం ఎప్పుడూ పాతబడదు. దానిపై మోజు ఎన్నటికీ తరగదు.

అలాగని 60 యేళ్లక్రితం నాటి పాటలన్నీ పునర్దర్శనం ఇస్తే ఇక కొత్తకు ఛాన్సెక్కడ? అని గాబరా పడవద్దు. పై ఛలోక్తిలో గ్రహించవలసినది ఒకటుంది. మేలిమి బంగారం మాత్రమే పాతబడదు. కాకి బంగారాన్ని ఎవరూ పట్టించుకోరు. పాతదంతా మంచిదని, గతమంతా ఘనత అని భావిస్తే అంతకంటే పొరబాటు మరోటి ఉండదు. భావికి పునాది గతంలో ఉంటుందని, కొత్త చిగుళ్లు పుట్టడానికి పాత మొదళ్లు ఉండాలని గుర్తిస్తే చాలు.

పాతని పాతర తవ్వినప్పుడు ఇప్పటికీ మణిమాణిక్యాలలా మెరిసే వాటినే శిరసున ధరిస్తారు. తక్కినవాటిని విస్మరిస్తారు. కొన్ని దశాబ్దాల తర్వాతకూడా వెలుగులు జిమ్మే స్థాయిలో మనం ఈనాటి పాటలను మలచగలిగినపుడు పైతరం వారు మనలను అభినందించడం జరుగుతుంది. లేకపోతే సృజనాత్మకత కరువైన తరంగా మన తరం చరిత్రపుటలలో నమోదవుతుంది. గీతసంగీత నిర్మాణంలో నిమగ్నమయిన వారందరూ ఈ విషయాన్ని గుర్తెరిగి నూతనసంవత్సర సందర్భంగా సముచితమైన నిర్ణయాన్ని తీసుకుంటారని 'హాసం' ఆశిస్తున్నది.


HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

ఇది పెద్ద కథ... అయినా సరదా కథ...!

# రావోయి చందమామ... ఈ వింత గాథ వినుమా !

- పొత్తూరి విజయలక్ష్మి
('శ్రీ వారికి ప్రేమలేఖ' ఫేమ్)





పొద్దున పదిగంటలు అయింది.

అప్పుడే మేడదిగి వచ్చాడు రామనాథం.

"ఇంకా టిఫిను రెడీకాలేదూ. అవతల మీ అత్తయ్యకి వేళమించిపోతోంది" అన్నాడు.

ఇంతలో వాకిట్లోంచి వచ్చింది రాజ్యం. ఆవిడ చేతిలో నవనలాడుతున్న సొరకాయ.

"మీ బాబాయ్ గారికి సొరకాయ అవబెట్టిన కూరంటే చచ్చేంత ఇష్టం. పాపం తిరిగి తిరిగి వస్తారాయె. ఇంతకీ రైలు వేళకొస్తుందా రాదా. ఫోన్ చేసి కనుక్కో తల్లీ" అంది.

సరే నంటూ ఇద్దరికీ ఒకేసారి తలూపింది రమ. తలలో మాత్రం కోటి ఆలోచనలు ముసురుకుంటున్నాయామెకు.

ఆనందరావుకీ రమకీ ఈ మధ్యనే వివాహం జరిగింది.

'అబ్బాయి రాజాలావుంటాడు. గవర్నమెంటు గెజిటెడ్ ఆఫీసరు. ఒకటి కాదు రెండుకాదు మూడు ఆస్తులకు ఏకైక వారసుడు." గొప్పగా చెప్పేవాడు పెళ్ళిళ్ళ పేరయ్య.

"మనవాళ్ళలో ఒక ఆస్తివుండమే గగనం... అటువంటిది మూడు ఆస్థులంటే మాటలా!. ఈసంబంధం తప్పిపోనీకండి" అన్నాడు రమ తండ్రి.

సంబంధం కుదిరింది. వివాహం జరిగింది.రమ కాపురానికి వచ్చింది. దిట్టంగా కట్టిన రెండతస్తుల మేడ. అత్తగారు లేదు ఆడబిడ్డ పోరు లేదు. కాకపోతే ఇంట్లో మరో ఇద్దరు పెద్దవాళ్ళున్నారు.

ఆనందరావు పినతండ్రి రామనాథం. అత్త రాజ్యలక్ష్మి. ఇద్దరికిద్దరూ చాలా మంచివాళ్ళు. వాళ్ళగోలేమో వాళ్ళదే తప్పించి ఇతరుల విషయాలు పట్టించుకోరు.

రమ కాపురానికి వచ్చిన రోజే ఆనందరావు ఎలక్షన్ డ్యూటీ మీద వెళ్ళాడు. రమతండ్రి పల్లెటూరు మోతుబరి రైతు. సామాన్లు, సరుకులతో పాటు కూతురిని కాపురానికి పంపాడు.

"అమ్మా! కాఫీ ఫలహారాలు భోజనం నాకు మీ అత్తయ్యకీ మేడమీదికే పంపు." అని చెప్పాడు బాబాయ్.

"అమ్మాయ్.. మీ బాబాయ్‌గారు పదిగంటల బండికి వస్తారు. ఉప్మాచేసి వుంచమ్మా, జీడిపప్పులు మరికాసిని వెయ్." అని చెప్పింది రాజ్యం అత్తయ్య.

"అలాగేనండి" అంది రమ బుద్ధిగా.

అన్నట్లే ఆయనకి అన్నం మేడమీదకే పంపింది. వుప్మాకూడా చేసింది. బాబాయ్‌గారు రాలేదు.

"మధ్యాహ్నం బండి కాస్తా రాలేదేమోలే. అల్లం పచ్చడి, వంకాయకూర చేసి కాస్త చారుపెట్టివుంచు" అంది అత్తయ్య.

"వంటకాగానే నాకూ మీ అత్తయ్యకీ కూడా మేడమీదకే పంపు" అన్నాడు బాబాయ్ అలాగే చేసింది రమ.

"బండి అందివుండదు. రాత్రి బండికి వచ్చేస్తారు. పిండి రుబ్బి వుంచితే ఆయనరాగానే ఆవిరికుడుం వెయ్యచ్చు" అంది అత్తయ్య.

"మాకుమాత్రం పెందరాళే పంపించెయ్ అమ్మా ఆలస్యం అయితే మీ అత్తగారు ఆగలేదు" అన్నాడు బాబాయ్.

"అలాగే" అంది రమ.

మర్నాడు తెల్లవారుజామునే బెల్ మోగితే బాబాయ్ గారు వచ్చారేమో అని కంగారుగా తలుపుతీసింది రమ. ఎదురుగా ఆనందరావు.

"మీరా! బాబాయ్ గారు వచ్చారేమో అనుకున్నాను." అంది రమ.

'ఏ బాబాయ్ గారూ?' చిరునవ్వుతో అడిగాడు.

"ఇంకెవరూ పిన్ని గారి బాబాయ్ గారే" అంటూ క్రిందటిరోజు భర్తకోసం ఆవిడ పడిన ఆరాటం వివరించింది.

"మరి మా బాబాయ్ గారేమంటున్నారు?"

"ఆయన అన్నీ పైకే పంపించమన్నారు. 'అవునూ... నాకు తెలియక అడుగుతాను అత్తయ్యగారు పేపెంటా? ఒక్కసారి కూడా కిందికి దిగిరాలేదు పోనీ నన్ను మేడమీదకు పిలవనూలేదు..'' అంది రమ.

బరువుగా నిట్టూర్చాడు ఆనందరావు.

"రమా.. అదో పెద్దకథ... న్యాయంగా నీకు ముందే చెప్పి వుండాల్సింది. కానీ చెప్పొద్దనీ, వాళ్ళు వాళ్ళు మాట్లాడుకుంటామనీ, పెద్దవాళ్ళు నా నోరు కట్టేశారు. ఇక ఇప్పుడు చెప్పక తప్పదు." అంటూ పైకి చూస్తూ.

'ఫ్లాష్ బ్యాక్' మొదలు పెట్టాడు.

ఆనందరావు తండ్రి రామానుజం. ఆయనకి తమ్ముడు రామనాథం, చెల్లెలు రాజ్యలక్ష్మి. బోలెడంత ఆస్తివుంది.

రామనాథం నూనూగుమీసాల వయసులో పాతదేవదాసు సినిమాచూసి సావిత్రిని అభిమానించడం ప్రారంభించాడు. ఆ తర్వాత వరసగా మాయాబజారు, మిస్సమ్మ మొదలైన కళాఖండాలు చూసి పెళ్ళంటూ చేసుకుంటే సావిత్రినే అని భీష్మప్రతిజ్ఞచేశాడు.

ఇంట్లోపెద్దవాళ్ళకు చెప్తే వాళ్ళు మొహం వాచేలా చీవాట్లు పెట్టారు. ఇక ఇలాక్కాదని ఇంట్లో డబ్బులు దొంగతనం చేసి రైలు ఎక్కాడు.

'హాసం' పత్రిక ప్రారంభ సంచిక నుండీ చదువుతూనే వున్నాను. రాయాలని కుతూహలం కలిగినా - అతిరధ మహారధులందరూ రాస్తున్నారు. వారిముందు మనం ఎంత - అని వెనక్కి తగ్గాను.

కానీ... ఎంతోకాలం ఆగలేక ఈ మధ్య హైదరాబాద్‌కి రాగానే ఎడిటర్ రాజాగారికి ఫోన్ చేశాను. నన్ను గుర్తుపట్టి ఎంతో ఆదరంగా మాట్లాడారు. "హాస్యం రాసేవారికి 'హాసం' పత్రిక ఎప్పుడూ స్వాగతం పలుకుతుంది వెంటనే రాసేయండి. వేసేద్దాం" అన్నారు.

ఆమాత్రం ఉత్సాహం ఎడిటర్ అందిస్తే ఉత్సాహం పురకలువేస్తుంది కదా మరి. వెంటనే కథ తయారయింది. పంపించాను. చదవగానే ఈ కథను రెండు కథలుగా చేసుకోవచ్చని చెబుతూ, రెండు కథలకూ రెండు క్లయిమాక్స్‌లను సూచించారు. ఆ ప్రకారం మార్పులు చేసిన మొదటి కథే ఇప్పుడు మీ చేతిలో ఉంది.

అంత శ్రద్ధవున్న వ్యక్తి పత్రికకి ఎడిటర్ కావడం రచయితల అదృష్టం. ఇక నాగురించి కొత్తగా చెప్పేదేముంది? ఇరవైఏళ్ళయింది కలంపట్టి, దాదాపు ఇరవై నవలలు, వందకుపైగా కథలు రాశాను.

నా పేరు వినగానే అందరికీ గుర్తువచ్చే 'శ్రీవారికి ప్రేమలేఖ' సినిమాకు మాతృక అయిన 'ప్రేమలేఖ' నా అభిమాన నవల.

'హాసం'పత్రిక లో కథతోపాటు ఫొటోకూడా వేస్తారుట. పంపించమన్నారు. కానీ నా ఫొటో పంపితే కథ వేసుకోరేమోనని భయం వేసింది. ఎందుకంటే ఎప్పుడు ఫొటో తీయించుకుని చూపించినా "ఎవరీవిడ... ఎక్కడో చూసినట్లుందే?" అంటుంటారు మా శ్రీవారు.

ఈ కథ పాఠకులకు నచ్చితే రెండో కథ ప్రచురించే సమయంలో ఫొటో పంపిస్తాను.

**- పొత్తూరి విజయలక్ష్మి**

మెడ్రాసు సెంట్రల్ స్టేషన్‌లో దిగి వాళ్ళనీ వీళ్ళనీ అడిగి టాక్సీఎక్కి టి.నగర్ వెళ్ళాడు. టాక్సీ దిగి నాలుగడుగులు వేసేసరికి ఒకాయన పలకరించాడు. "ఏ ఊరు! ఏ పనిమీద వచ్చారు?" అని అడిగాడు.

ఊరుగాని ఊళ్ళో తెలుగోడు కనిపించి ఆదరంగా పలకరించేసరికి రామనాధం ప్రాణం లేచివచ్చింది. నెమ్మదిగా తనొచ్చిన పని చెప్పాడు.

సంభ్రమాశ్చర్యాలతో అతనివంక చూశాడు.

"ఇదే దైవనిర్ణయం అంటే! నేనెవరో తెలుసా? సాక్షాత్తూ సావిత్రికి మేనమావని, అమ్మాయికి పెళ్ళిచేయాలి. ఇక్కడంతా అరవగోల. మన ఆంధ్రావైపు వెళ్ళి తగిన కుర్రాడిని వెతికే ఆలోచనలో ఇవ్వాళ సాయంత్రం బండికి బయలుదేరుదామనుకుంటున్నాను. నువ్వెవరు? నీవివరాలేమిటి?"అని అడిగాడు.

రామనాధం పరిస్థితి వర్ణనాతీతం. అమాంతం ఆయన కాళ్ళమీద పడిపోయి వద్దని వారించినా హోటలుకి తీసుకునివెళ్ళి ఫుటుగా టిఫిను పెట్టించి అక్కడవున్న మర్రిచెట్టుసాక్షిగా తన వివరాలన్నీ చెప్పాడు.

"భేష్ ఆస్తీ అంతస్తూ వున్న మంచి సంబంధం. నాకు నచ్చింది." అన్నాడాయన.

"మరి పెళ్ళి చూపులు ఏర్పాటు చేస్తారా? నేను ఆవిడని చూడనక్కర్లేదనుకోండి. కానీ ఆవిడ నన్నుచూసి సరే అనాలికదా!" అని అడిగాడు రామనాధం.

"చేసే వాడినే. కానీ అమ్మాయి ఔట్‌డోర్ షూటింగ్‌కి వెళ్ళింది. అయినా నేను సరే అంటే అది కాదనదు. కాకపోతే ఓ మాట ముందే చెప్పేస్తున్నాను. నువ్వే అమ్మాయిని చూశాక కాదనకూడదు. సావిత్రి రంగు కొంచెం తక్కువే" అన్నాడు.

"ఎంతమాట ఎంతమాట... నలుపు నారాయణుడి స్వరూపం" అన్నాడు రామనాధం.

"అయితే ఖాయం చేసుకుందాం. అమ్మాయి రాగానే దానివీలు కనుక్కుని ముహూర్తం పెట్టించి మీకు తెలియజేస్తాను. ఈలోగా మీరు మీపెద్దవాళ్ళని ఒప్పించి సిద్ధంగా ఉండండి. శుభస్యశీఘ్రం. వచ్చే మాసంలోనే వివాహం" అన్నాడా మేనమావ.

చీకటి వడేదాకా పెళ్ళిమాటలే మాట్లాడుకున్నారు. వివాహం నిశ్చయం అయిన సందర్భంలో అబ్బాయి అమ్మాయికి కానుకలివ్వటం ఆనవాయితీ, కాబట్టి రామనాధం దగ్గరున్న డబ్బులూ గొలుసూ ఉంగరం కానుకలనిమిత్తం తీసుకున్నాడా మేనమామ. హోటలుకి తీసుకెళ్ళి విందు భోజనం పెట్టించి స్టేషనుకొచ్చి టికెట్టుకొని రైలెక్కించాడు. రామనాధం అడ్రెస్ తీసుకుని, తన అడ్రెస్ ఇచ్చి కాఫీకోసం రూపాయి జేబులో పెట్టి రైలు కదిలేదాకా వుండి మరీ వెళ్ళాడు.

సంబరంగా ఇంటికి వచ్చి జరిగినదంతా ఇంట్లోవాళ్ళకి చెప్పాడు రామనాధం. వాళ్ళు ఎవ్వరూ నమ్మలేదు. 'ఎవడో నిన్ను వెర్రి వెంగళప్పని చేసి టోపీ పెట్టాడు' అన్నారు ఎగతాళిగా.

"ఇప్పుడిలాగే అంటారు ఓ పదిరోజులాగితే మీకే తెలుస్తుంది" అన్నాడు రామనాధం నిబ్బరంగా.

పదిరోజులు గడిచాయి. ఎవరికీ ఏమీ తెలియలేదు. మరోవారం ఆగి ఒక కార్డు తీసుకుని

మహారాజశ్రీ బాబాయ్‌ గారికి నమస్కారములు.

ఉభయకుశలోపరి. పదిహేను రోజుల క్రిందట నేను చెన్నపట్టణము వచ్చి మిమ్ములను కలుసుకున్న సందర్భములో మీరు నాకు నున్నూ, చి॥సౌ సావిత్రికి న్నూ వివాహము జరిపించెదననియూ, ముహూర్తములు నిర్ణయించి తెలియజేసెదననియూ తెలిపినారు. అటు పిమ్మట మీవద్దనుండి ఎటువంటి సమాచారమూ రాలేదు.

మీరు పనులయందు నిమగ్నులై అశ్రద్ధ చేసినారని భావించుచున్నాను.

ఈ ఉత్తరము అందిన వెంటనే ఏ విషయమూ తెలియజేయగలరు. చి॥సౌ॥సావిత్రిని అడిగినాయనియు ఆశీస్సులనియు తెలియజేయగలరు.

ఇట్లు,
మీ విధేయుడు
రామనాథం.

అని రాసి ఆయన చెప్పిన అడ్రసుకి పోస్టు చేశాడు.

పదిరోజులు ఎదురుచూసి మరో ఉత్తరం రాశాడు.

అలా ఒకటికాదు రెండుకాదు పదిహేను సంవత్సరాల పాటు ఉత్తరాలు రాశాడు.

శ్రేయోభిలాషులందరూ చెవినిల్లు కట్టుకు పోరారు. నయానా భయానా చెప్పిచూశారు. ఇదంతా మోసం అనీ, సావిత్రికి పెళ్ళై పిల్లలతల్లి కూడా అయిందనీ చెప్పారు.

అవేవీ వినలేదు రామనాథం. "మీరెన్ని చెప్పినా నా మనసు మారదు. సావిత్రే నా భార్య" అన్నాడు.

ఇక విసుగేసి వూరుకున్నారు.

చివరికి సావిత్రి మరణించిందనే విషాదవార్తను పేపర్లో చూపించారు. హతాశుడయ్యాడు రామనాథం.




వైలపట్టి నదీస్నానం చేశాడు. తిలోదకాలు వదిలాడు.

"ఏంచేస్తాం. శేషజీవితం కూడా ఆవిడ జ్ఞాపకాలతో గడిపేస్తాను" అని తన ఆస్తిని అన్నకొడుకైన ఆనందరావుకి రాసేసి అతనిదగ్గరకి చేరాడు.

మేడమీద ఓ గది తనకొరకు కేటాయించుకుని సావిత్రి బొమ్మలంటిం చుకుని అహోరాత్రులు అందులోనే కాలక్షేపం చేస్తాడు. కాఫీ టిఫిన్లు భోజనాలు నైవేద్యం పెడతాడు. సుప్రభాతం మొదలు పవళింపుసేవదాకా అన్నీ ప్రేమతో జరుపుతాడు.

ఎవరింటికీ వెళ్ళడు. ఎవరొచ్చినా మాట్లాడడు. ఆయనదో ప్రపంచం. అదంతే!! అంతే!!

ఇక పోతే రాజ్యలక్ష్మి అత్తయ్య.

ఆవిడకి పదిహేనవ ఏటనే పెళ్ళి అయింది. కాపురానికి వెళ్ళింది. మొగుడూ పెళ్ళాలకి క్షణం పడేదికాదు. ఆమాట అంటే ఆవిడ ఒప్పుకోదు "అదేంకాదు... ఆయన అవునంటే నేను కాదనేదాన్ని ఆయన కాదన్నదాన్ని నేను ఔననేదాన్ని.. అంతకు మించి మరేంలేదు" అంటుంది.

పదేళ్ళపాటు కాపురం చేశాక విసుగూ విరక్తీ చెంది ఆయన ఓ శుభముహూర్తాన చెప్పాపెట్టకుండా ఇల్లు వదిలి వెళ్ళిపోయాడు. ఆయన ఎదురుగా వున్నంత కాలం వేపుకుతిన్నా - వెళ్ళాకా బోలెడంత పశ్చాత్తాపం కలిగింది ఆవిడకి. 'ఛ పాపం వెళ్ళేడేగాని నన్నొదిలి వుండలేడు. వచ్చేస్తాడు. వచ్చేస్తే పువ్వుల్లోపెట్టి చూసుకోవాలి' అనుకుంది.

'ఇంతకాలం గడిచింది ఇంకేంవస్తాడు' అనిఎవరు చెప్పినా గయ్‌మని లేచేది. తల్లీ తండ్రీ ఉన్నంతకాలం వాళ్ళదగ్గర వుంది. వాళ్ళు పోయాకా అన్నగారిదగ్గరవుంది. ఆయన తరువాత మేనల్లుడిదగ్గరకి చేరింది.

"ఇహ ఇప్పుడు ఆయన తిరిగొచ్చినా నేనేం కనగలా పెంచగలనా కొడుకైనా మేనల్లుడైనా వీడేగా" అని తన ఆస్తినంతా ఆనందరావు పేర రాసేసింది.




ఆనందరావు చెప్పిన కథ విని నీరసపడిపోయింది రమ.

"మీ చాదస్తం దొంగలెత్తుకెళ్లా! ఇదేం అన్యాయమండీ, ఇద్దర్నీ కూర్చోబెట్టి బ్రెయిన్‌వాష్ చెయ్యాలిగానీ వాళ్ళ ఖర్మానికి వాళ్ళని వదిలేస్తారా?ఆయనకి అదుగోఇదిగో అంటూ డబ్భైఏళ్ళు వస్తున్నాయి. ఆవిడకీ తక్కువ వయసేంలేదు. బ్రతికినంతకాలం ఇలా భ్రమల్లో బ్రతకాలా? ఊహల్లోంచి బయటకి రప్పించి వాస్తవం తెలియజేస్తే అందరు పెద్దాళ్ళలాగా వీళ్ళుకూడా ఏదో రామాకృష్ణా అంటూ గౌరవంగా కాలక్షేపం చేస్తారు." అంది ఆవేశంగా

"అదికాదు రమా!" ఏదో చెప్పబోయిన భర్తని వారించింది.

"మీరేం మాట్లాడకండి. వాళ్ళని ఓదారికి తెచ్చే బాధ్యత నాది"అంది ధీమాగా.

మర్నాడు పొద్దున్న లేవగానే ఎదురయ్యింది రాజ్యం అత్తయ్య.

"రమా లేచావా? మీ బాబయ్యగారు వచ్చేవేళ అయింది. ఫిల్టరువెయ్యమ్మా డికాషను కలవనిదయితే ఆయనకాఫీ తాగరు"అంది.

ఆవిడవంక ఎగాదిగా చూసి "చూడండి పిన్నిగారూ. ఎప్పుడో నలభై ఏళ్ళ క్రిందట ఇల్లువదిలి వెళ్ళినాయన ఇంకేం వస్తారు? వచ్చేవారైతే ఏనాడో వచ్చేవారు. ప్రతిరోజూ ఆయన వస్తారని మీరు ఆరాటపడి హడావిడి చెయ్యడం అనవసరం. నామాటవినండి. ఇక ఆయనరారు. అశుభం పలకకూడదనుకోండి అసలాయన వున్నారో కాలంచేశారో!"

ధబ్ మని శబ్దం వినిపించటంతో ఆగిపోయింది రమ.

రాజ్యం అత్తయ్య నేలమీదపడి కొట్టుకుంటోంది.

రమ పై ప్రాణం పైకే పోయింది.

'ఏవండీ!' మిమ్మల్నే.. రండీ." అని గావుకేక పెట్టింది.

బ్రష్ నోట్లో పెట్టుకున్న ఆనందరావు తాపీగావచ్చి అత్తయ్య నోట్లో చెంచానీ, గుప్పిట్లో తాళంచెవుల గుత్తినీ పెట్టాడు.

ఏడుస్తున్న రమని చూసి "ఏం కంగారులేదు.. మావయ్యరాడు అని ఎవరైనా అంటే అత్తయ్య ఇలాగే పడిపోతుంది". అన్నాడు.

కాసేపటికి లేచికూర్చుంది అత్తయ్య.

ఏమీ ఎరగనట్లే "రమా డికాషను వేశావా.. అ చేత్తోనే కాసిని మినపప్పు నానబొయ్యి. గారెలొండుదాం. మీ బాబాయ్‌గారికి గారెలంటే ఇష్టం" అంది.

రమ నిరాశపడలేదు. మరోసారి ప్రయత్నించి చూద్దాం అని పొద్దున్న పదకొండుగంటల వేళప్పుడు"మీ బాబాయ్ గారికోసంపళ్ళరసం తీస్తా "అంటూ వంటింట్లోకి వచ్చిన అత్తయ్యతో

"చూడండి పిన్నిగారూ" అని హితబోధ చెయ్యసాగింది.

మళ్ళీ దభీమని పడిపోయిందావిడ.

ఆవిడ నోట్లో పులుసుగరిటా, చేతిలో పట్టకారూ పెట్టి చికిత్సచేసింది రమ.

ఆవేళంతా అదే తంతు. రమ ఆ ప్రసక్తి తీనుకు రావడమూ, ఆవిడ ధబీమని పడిపోవడమూ...

ఇక లాభం లేదని టెలిఫోన్ డైరెక్టరీ తీసి ఎల్లో పేజెస్ వెతికి ఒక డాక్టరుతో మాట్లాడి ఎపాయింట్‌మెంట్ తీసుకుంది.

సాయంత్రం తను తయారై, ఆవిడని పిలిచి "పిన్నిగారూ మనం డాక్టరు గారి దగ్గరకి వెళదాం. ఆయన బాబాయ్‌గారి విషయం మీకు నచ్చచెప్తారు." అన్నదోలేదో మళ్ళీ దభీ!!

ఎదురురుగావున్న టూల్‌కిట్టు తీసి ఆవిడనోట్లో స్క్రూడ్రైవరూ చేతిలో కటింగు ప్లేయరూ పెట్టి చికిత్సచేసింది.

ఆవిడకి తెలివి వచ్చి కూర్చుని "రమా... గుమ్మడి వడియాలు వేయించావా బాబాయ్‌గారికి ఇష్టం" అనగానే

"ఇదిగో బయటకి వెళ్ళి వచ్చి వేడివేడిగా వేయిస్తా'' అనిచెప్పి బయటపడింది. డాక్టరుదగ్గరికి వెళ్ళింది. ఆయన కేసు హిస్టరీ విన్నాడు.

"ఓమైగాడ్.. ఫార్టీ ఇయర్స్ ఈజ్ టూమచ్...



ఇటీజ్ క్రానిక్ కేస్ బట్ యాజ్ ఏ డాక్టర్ ఎనివే ఐ విల్ ట్రైమైబెస్ట్. నేను ఓ ఆర్నెల్లు ట్రీట్‌మెంట్ ఇస్తాను. ముందేచెప్తున్నాను నాఫీజు డెబ్భైవేలదాకా వుంటుంది. ముందేచెప్పటం మంచిదికదా! ఏజ్ ఏ సైక్రియాటిస్ట్ ఐ నో ది సైకాలజీ ఆఫ్ పీపుల్. తీరా ట్రీట్ మెంట్ మొదలు పెట్టాక 'ఫీజు ఇంత' అంటే బేర్ మంటారు. నాట్రీట్‌మెంటుతో తగ్గక పోతే ఐవిల్ రిఫర్ ద కేస్‌టు న్యూరో సర్జన్. ఆయన స్కానింగుచేసి చూసి అవసరం అయితే సర్జరీ చేస్తారు. ముందే చెప్తున్నాను. బాగానే ఖర్చవుతుంది. దాదాపు నాలుగు లక్షలువేసుకోండి. అప్పటికీ తగ్గకపోతే ఐనో వన్ డాక్టర్ ఇన్ కేరళ. హి ఈజ్ వేరీ ఎక్స్‌పీరియన్స్డ్. కేసునిబట్టి నలభై, అరవైరోజులు తైలధారా వైద్యం చేస్తారు. దటీజ్ అల్ట్రాప్రెటీ ఎక్స్‌పెన్సివ్ ట్రీట్‌మెంట్. ఎంత తక్కువగా చూసుకున్నా లక్ష దాటుతుంది. అప్పటికీ తగ్గలేదనుకోండి ఇక ఆ భగవంతుడిదే భారం మీరు మీ హజ్‌బెండ్‌తో డిస్కస్ చేసి డెసిషన్ తీసుకురండి. ఇప్పటికే చాలా డిలే చేశారు. కాబట్టి ఇటీజ్ బెటర్ ఇఫ్ యూ స్టార్ట్ ఇమ్మీడియట్లీ" అన్నాడు.

ఆయన ఫీజు రెండొందల యాభైచెల్లించి నీరసంగా ఇంటికొచ్చింది. ఇంట్లో భార్యకోసం వెయిట్‌చేస్తున్నాడు ఆనందరావు. అంతావిని 'అదంతేమరి... తగ్గే జబ్బు అయితే మేము ఇంతకాలం వూరుకుంటామా" అన్నాడు జాలిగా.

కానీ ఒక కేసునైనా బాగుచేద్దామని మర్నాడు బాబాయ్‌గారిదగ్గరికి వెళ్లింది. 'చూడండి మావయ్యగారూ' అని ఏదో చెప్పబోతూవుంటే వారించాడు.

"నువ్వు ఏం చెప్పబోతున్నావో నాకు తెలుసు ఇలారా!" అన్నాడు. నాలుగుగోడలకీ రంగులు ఖాళీగా లేకుండా సావిత్రి ఫొటోలు అంటించి వున్నాయి.

వెళ్ళి ఆ ఫొటోలు అంటించినగోడ మీదేవున్న ఒక అలమార తెరిచాడు. "ఇటుచూడు"అన్నాడు. చూసింది రమ.

అందులో నాలుగైదు పురుగుల మందుసీసాలు, చుట్టచుట్టి పెట్టిన నూలుతాడు, మూరెడు పొడవున్న కత్తి, ఒక రివాల్వరు వున్నాయి.

"పిచ్చో వెర్రో నన్ను ఇలా వదిలెయ్. కాదంటే అదుగో ఆ పురుగులమందులన్నీ తాగేసి మెడకి ఆ తాడు కట్టుకుని, ఆ కత్తితో డొక్కలు పొడుచుకుని, ఆ రివాల్వర్‌తో కణతమీద కాల్చుకుని చచ్చిపోతాను. పోతూ పోతూ నా ఆత్మహత్యకి నువ్వే కారణం అని రాసిపెట్టి మరీ




పోతాను."అన్నాడు శాంతంగా,

కాళ్ళల్లోంచి వణుకు పుట్టుకొచ్చింది రమకి. గిర్రున వెనక్కితిరిగి కిందికి పరిగెట్టింది. మెట్లదగ్గరే ఎదురయ్యాడు ఆనందరావు.

"మరందుకే ఆయన జోలికి వెళ్ళనిది!" అన్నాడు మరింత జాలిగా. భర్త ఆఫీసుకి వెళ్ళాక తండ్రికి ఫోన్‌చేసి మండిపడింది రమ.

"మా అమ్మ ...మా తల్లి... నేను చెప్పేది శాంతంగావిను. దుగ్గిరాల దగ్గర పదెకరాల మాగాణి. గుడ్లవల్లేరు దగ్గర పన్నెండెకరాల మాగాణివూరికే వస్తాయా నువ్వే సర్దుకోవాలి, నువ్వుతల్చుకుంటే ఇదేం కష్టంకాదు." అన్నాడాయన.

ఆలోచనల నుంచి తెప్పరిల్లి ఇక తనే పరిష్కరించుకోవాలనుకుని పదిరోజుల పాటు 'బుర్రకి పదును' పెట్టింది, మంచి ఆలోచన తట్టింది, అమల్లో పెట్టింది.

ముందుగా బాబాయ్ దగ్గరికి వెళ్ళింది. "మావయ్యగారూ... నేను మీతో అత్తయ్యగారి గురించి మాట్లాడాలని వచ్చాను" అంది.

ఆయన వెంటనే లేచి 'ఆత్మహత్యా పరికరాలువున్న అలమారు' తెరిచాడు.

"అబ్బెబ్బే... నేను మిమ్మల్ని కాదనటంలేదు ముందా అలమారు మూసెయ్యండి" అంది. ఆయన మూసేసాడు. సీరియస్‌గా వచ్చి కూర్చున్నాడు.

"మావయ్యగారూ... అత్తయ్యగారి పట్ల మీ ఆరాధనని చూసి నేను ముగ్ధురాలినైపోయాను. కానీ ఏంలాభం? మీ ఆరాధనని చూసినవారంతా అర్థం చేసుకోలేక ఎగతాళిచేస్తున్నారు. ఇదంతా నాకు బాధగాఉంది. మా ఊళ్ళో నాకు మామిడితోటవుంది. అందులో అత్తయ్యగారికి గుడికట్టిద్దాం. సినీతారలకు గుళ్ళు కట్టించటం మన సంప్రదాయమేకదా! లక్షణంగా గుడికట్టించి ఓ పూజారిని పెడితే పొద్దునపూట పులిహోర దద్దోజనం, సాయంత్ర పానకం వడపప్పు నైవేద్యం పెట్టి ప్రసాదాలిస్తారు" అంది ఆదరంగా.

ఆయన మొహం దివిటీలా వెలిగింది అంతలోనే ఆరిపోయింది.

"నువ్వు చెప్పింది కూడా నిజమే అనుకోఅమ్మా. కానీ నా సావిత్రిని ఎవరుపడితే వాళ్ళు ఎప్పుడుపడితే అప్పుడు చూడడాన్ని నేను భరించలేను" అన్నాడు.



"మరైతే ఏంచేద్దాం మావయ్యగారూ! మీ ఆరాధన చూసి కళ్ళలో నిప్పులు పోసుకుంటున్నారు. మిమ్మల్నీ నన్నూ ఆడిపోసుకుంటున్నారు. మనల్నంటే ఫరవాలేదు. చచ్చిస్వర్గానవున్న ఆవిడను అంటుంటే నేను భరించలేకపోతున్నాను" అంది ముక్కు చీదుతూ.

ఆయనకీ దుఃఖంముంచుకు వచ్చింది. "అలాగా అమ్మా.., నాకు తెలియలేదే?" అన్నాడు.

"ఎలా తెలుస్తుంది? ఇరవై నాలుగ్గంటలూ గదిలోనే కూర్చుని అర్చనలూ, అభిషేకాలూ తప్ప బయటప్రపంచం గురించి ఏనాడు పట్టించుకున్నారు కనక?" అంది. అంతేకాదు అందరూ ఎలా ఎగతాళిచేస్తున్నారో చెప్పింది.

అంతావిని నిట్టూర్చాడు ఆయన. "ఇదంతా నాకు తెలియదు కదమ్మా ఇకనించీ నేను మామూలుగా ఉంటాను. ఆవిడకి నాగుండెలోనే గుడికట్టి ఆరాధిస్తాను. కానీ ఇన్నాళ్ళూ అలవాటైన దినచర్య మారడం కష్టంకదమ్మా" అన్నాడు.

"నిజమే... పూర్తిగా మానకండి. అదిగో ఆ పురుగుల మందులు అవీ పెట్టిన అలమారు నిండా ఆవిడ ఫొటోలు పెట్టుకోండి. ఈ గోడలమీద అంటించిన ఫొటోలు తీసెయ్యండి. టి.వి, వీడియో ఇలాగేవుండనివ్వండి. క్లుప్తంగా పూజ ముగించండి. మహానైవేద్యం బదులు అవసరనైవేద్యం పెట్టండి. రోజుకి రెండు సినిమాలు మాత్రం చూసి, అలాబయటకి వచ్చి నలుగురినీ పలకరిస్తూవుండండి" అంది రమ.

"నిజమేలే. మన సంతోషంకోసం మరొకరిని నవ్వులపాలు చెయ్యటం అన్యాయం. పాపం ఇన్నాళ్ళూ ఆవిడ ఆత్మ ఎంతక్షోభించిందో. ఇకనైనా ఆవిడకి మనశ్శాంతి కలిగితే చాలు"- అన్నాడు బాబాయ్.

* * * *

భర్తకి ఇష్టం అని రాజ్యలక్ష్మి అరటిదూట తరుగుతూవుండగా పోస్ట్ అని కేకవినిపించింది. ఇంట్లో ఎవరూ లేరు. ఆవిడే వెళ్ళి ఉత్తరం అందుకుంది. అడ్రసు ఇంగ్లీషులోవుంది. భద్రంగా బల్లమీద పెట్టింది.

కాసేపటికి రమ వచ్చింది.

"అమ్మాయ్ ... ఏదో ఉత్తరం వచ్చింది" అని చెప్పిందావిడ.

తీసి చూసింది రమ. "పిన్నిగారూ ఇది మీకే" అంది.

"నాకా.. నాకెవరు రాస్తారూ!? ఎవరో ఏమిటో చూడు" అందావిడ.

భద్రంగా కవరు తెరిచింది రమ. తెలుగులోనే ఉంది.

"చిరంజీవి సౌభాగ్యవతి రాజ్యలక్ష్మికి నీ భర్త పద్మనాభరావు ఆశీర్వదించి వ్రాయునది."

కీచుమని అరిచింది రమ.

రాజ్యలక్ష్మినిలుగుడ్లేసుకుని వుండిపోయింది.

మళ్ళీ మూర్ఛపోతుందేమోనని చూసింది రమ.

కానీ ఆవిడ మూర్ఛపోలేదు కాసేపు రాయిలాకూర్చునివుంది. రమ కాసిని మంచినీళ్ళు తాగించాక తేరుకుంది.

"రమా... ఏమిటీ మీ బాబయ్యగారే?" అంది.

"అవును పిన్నిగారూ ఆయనే" అంది రమ.

"ఎన్నాళ్ళికెన్నాళ్ళికి? చదువమ్మా ఏంరాశారో?" అంది ఒళ్ళంతా చెవులు చేసుకుని.

మళ్ళీ చదవడం మొదలు పెట్టింది రమ.

"నేనిక్కడ క్షేమం. నువ్వుక్షేమం అనితలుస్తాను. మన పరాత్పరం బాబాయ్ తోడల్లుడి తమ్ముడి మేనమామకి వేలువిడిచిన తమ్ముడు భుజంగం నాకు ఈ మధ్యనే కలిశాడు. అతనిద్వారా మీ క్షేమ సమాచారాలు తెలిశాయి. సంతోషించాను. నేనిప్పుడు తీర్థయాత్రలుచేస్తూ హిమాలయాల దగ్గరవున్నాను. మరికొంత కాలం తరువాత వస్తాను. ప్రస్తుతం దీక్షలోవున్నాను. కాబట్టి వెంటనే రాలేను.

నువ్వు నాకోసం ప్రతీరోజూ వంట చేయించి స్టేషనుకి మనుషులని తరుముతూ హైరానా పడుతున్నావని తెలిసింది. వెర్రిదానా... నామీద నీకెంత అభిమానంవుదో నాకు తెలియదా!. ప్రేమవుంటే మనసులో దాచుకోవాలిగానీ ఇలా బయటపెట్టుకుంటే నలుగురిలోనూ నవ్వుల పాలవుతావు కదా! అందుకని అనవసరంగా వంటలవీ చెయ్యకు. నేను వచ్చేముందు నీకు ఎలాగూ తెలియజేస్తాను కనుక ఆవేళ్టికి వంటచేస్తే చాలు.

మరో ముఖ్యమైన విషయం.నేను దీక్షలో వున్నానని చెప్పానుకదా! నా భార్యవైన నువ్వు కూడా కొన్ని నియమాలు పాటిస్తే నాకు మరింత పుణ్యం అని స్వాములవారు చెప్పారు. కాబట్టి నువ్వు ప్రొద్దున్నే స్నానం, పూజ చేసుకుని ఒక అధ్యాయం భగవద్గీత చదువు. సాయంత్రం గుడికివెళ్ళి కనీసం ఒక గంటసేపు భగవంతుడి సన్నిధిన గడుపు. నామీద నీకున్న అనురాగం నాకు తెలును. నాకోసం ఇవన్నీ క్రమం తప్పకుండా ఆచరిస్తావని ఆశిస్తున్నాను.

ఆశీస్సులతో,

నీభర్త,

పద్మనాభరావు.

చదవడం ముగించింది రమ.

రాజ్యం అత్తయ్య ఆ ఉత్తరాన్ని ఆరాధనగా అందుకుని కళ్ళకద్దుకుంది. పదిసార్లు చదువుకుంది.

"పిన్నిగారూ అరటిదూట నల్లబడిపోతోంది" అంది రమ.

"పడితేపడనీ... మీ మావయ్యగారేంరాశారో చదవలేదూ...!? ఆ అరిటిదూట అవతలపారేసి భగవద్గీత ఇటుపట్రా" అందావిడ.

వారం రోజుల క్యాంపు తరువాత తిరిగివచ్చాడు ఆనందరావు.

తోటపని చేస్తున్న బాబాయ్ ఆదరంగా పలకరించి యోగ క్షేమాలు అడిగాడు. ఆశ్చర్యపోయాడు ఆనందరావు. ఆయనకు సమాధానం చెప్పి హాల్లోకి వచ్చేసరికి మరో అపురూపమైనదృశ్యం - అత్తయ్య పూజగది ముందర భగవద్గీత చదువుకుంటోంది.

"కాఫీ ఇవ్వనా... ఏకంగా భోజనం చేస్తారా" అంటూ వచ్చిన భార్యజడ దొరకబుచ్చుకుని అవతలకి లాక్కెళ్ళాడు ఆనందరావు.

"ఏమిటిది కలయా వైష్ణవమాయా?" అన్నాడు.

"ఏంలేదు మీరు వూరెళ్ళాక..." అంటూ జరిగిందంతా చెప్పింది.

"ఆయన్ని మాటల్తో మార్చేశావు. మరి ఆ ఉత్తరం" అంటూ అనుమానంగా చూశాడు.

"ఏంచేస్తాం శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు" అంది రమ నర్మగర్భంగా నవ్వుతూ.





ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

## పోదామా విల్లిపుత్తూరు

ప॥ పోదామా విల్లిపుత్తూరు- చూదామా పెరియాళ్వారు
శ్రీదయితుని పెండ్లాడేనే మన- చూడి కుడుత నాంచారు ॥పోదామా॥

1.చ॥ బృందారక సందోహముతో-వందారుమౌని బృందముతో
పెందిరువడిపై పెరుమాళ్ళే శ్రీ మందిరమును విడి తరలేనే ॥పోదామా॥

2.చ॥ తులసీవనిలో మొలకయటే-అలహరి కౌగిలి చిలుకయటే
వెలసి నెయ్యమున విష్ణుచిత్తుల-నిలయ దీపమై వెలిగెనటే ॥పోదామా॥

3.చ॥ విరజానది కావేరియటే-పరమపదము శ్రీరంగమటే
వరుడారంగేశ్వరుడె కదా మన సిరి ఆండాళ్ళే వధువు కదా ॥పోదామా॥

**రచన** : కీ॥శే॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి
**సంగీతం** : కీ॥శే॥ మల్లిక్
**తాళం** : ఆది (కర్ణాటక సం॥)
కహరువా (హిందుస్తాని సం॥)

### రాగమాలిక

**1.ఆరభి**
-తాళం:-ఆది(కర్ణాటక సం॥)
-కహరువా(హిందుస్తాని సం॥)
ఆరోహణ:- సరిమపదస
అవరోహణ:- సనిదపమగరిస
షడ్జము, చతుశృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి దైవతం, కాకలినిషాదం ఈ రాగంలోని స్వరాలు

**2.మలయమారుతం**
ఆరోహణ:- సరిగపదనిస
అవరోహణ:- సనిదపగరిస
షడ్జము, శుద్ధరిషభం, అంతర గాంధారం, పంచమం, చతుశృతి దైవతం కైశికి నిషాదం ఈ రాగంలోని స్వరాలు

**3.మోహన**
ఆరోహణ:- సరిగపదస
అవరోహణ:- సదపగరిస
షడ్జము, చతుశృతిరిషభం, అంతర గాంధారం, పంచమం, చతుశృతి దైవతం ఈ రాగంలోని స్వరాలు.

**4. మధ్యమావతి**
ఆరోహణ:- సరిమపనిస
అవరోహణ:- సనిపమరిస
షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధ మధ్యమం, పంచమం, కైశికి నిషాదం ఈ రాగంలోని స్వరాలు.



శ్రీ వైష్ణవ సంప్రదాయానికి అనుగుణంగా కృష్ణశాస్త్రి గారిచే రచింపబడిన యీ భక్తిగీతానికి చక్కని బాణీని మల్లిక్ గారు రాగమాలికగా కూర్చారు. సూర్యుడు ధనురాశిలో ప్రవేశించడం ధనుస్సంక్రమణంగా పరిగణిస్తారు. ఇది డిసెంబరు మాసం 15,16 తేదీలలో ప్రతి సంవత్సరమూ వస్తుంది. అప్పటినుండి ధనుర్మాసం ప్రారంభమవుతుంది.

కృష్ణశాస్త్రి గారు 1940 వ దశకంలో ఆకాశవాణి మద్రాసు కేంద్రానికి 'శ్రీ ఆండాళ్ కల్యాణం' అనే సంగీత రూపకాన్ని రచించగా ఆ కేంద్రం ప్రసారం చేసింది. యస్.వరలక్ష్మి మొదలగువారు ఆ రూపకంలోని పాటలను పాడారు. ఆ తరువాత అదే రూపకాన్ని 1959 లో హైదరాబాద్ కేంద్రంలో కృష్ణశాస్త్రి గారు సాహిత్యశాఖకు ప్రొడ్యూసర్‌గా వున్నప్పుడు మళ్ళీ రికార్డుచేసి ప్రసారం చేశారు. అందులో నేను, పి.బి.శ్రీనివాస్, వక్కలంక సరళ మొదలగు వారమంతా పాడాము. ఆ రూపకంలోని యితివృత్తం శ్రీ ఆండాళ్ గా పిలువబడే గోదాదేవి పరిణయగాధ.

శ్రీమహావిష్ణువు యొక్క అంశావతారాలుగా

ఆరభి

ప॥ సా స్సనిదా | దప మాపద | మా మగరిమ | పా ; | మపదని | దప మాపద | మ్మాగరిస | రి ; |
పో దా . . | మా . వి ల్లి . | పు త్తూ . . . | రు . | చూ . డా . | మా . పె రి . | యా . ళ్వా . | రు . |
స్సనిదా స్సస | రిరి రీ | రీమగ రీ | సరిస్సని దద | దరిస్సని | దప మాపద | మ్మాగ రీ |
త్రీ . . దయి | తుని పెం | డ్లా . . డే | నే . . . మన | చూ . డి కు | డుత నాం . . | చా . . రు |
రిమపామపదరి ॥
. . . . . . . . ॥ పోదామా ॥

మలయమారుతం

1.చ॥ సరిగా | పపదా | దనిసానిద | నీ ; | దని సారిగ | రిసాని | దానిస నిద | పా ; |
శ్యాం . దా | రకత సం | దో . . హము | తో . | వం . దా . . | రుమాని | శ్యం . . దము | తో . |
; దనీసరి | రిరి రీ | ; సరిగరి | స్సా , ద | ని సనీరిసా | నిదపప | గగపాదపా | గసరి ; |
. పెం . దిరు | వడి పై | . పెరుమా . | ళ్లై . శ్రీ | . మం . దిర | మును విడి | . తరలే . | నే . . . ॥
॥ పోదామా ॥



మోహన

2.చ॥ గరిగా | రిసరి | సరిగరి | రీ , ప గా | ; గగాపపా | దసదస దపపా | గపదస | దాపా |
తులసీ | వనిలో | మొలకయి | టే . . . | . అలహరి | కా . . . గ . రి | చిలకయి | టే . |
; గగాపదా | స్ససస్స | సారిగసా | , స్సదీదరిదస్స | , దదప | గపదప | గరిసా |
. వెలసి తె | . యమున | విష్ణు . చి | . త్తుల . | నిలయమో | . ప మై . | వెలిసెన | టే . . ॥
॥ పోదామా ॥

మధ్యమావతి

3.చ॥ పని సా , ని | పమరి రిమ | పానిమ | పా ; | రిమరిమ | పపనిమ | పనిస్సని | సా ; |
విరహా . . | న . ది తా . | వే రయి | టే . | పరమప | దమును . | రం . గము | టే . |
పమపని | సారి | రిమరిస | స్సాని పమ | పపరిస స్సాని పమ | పనిస్సని పమ | రిసా |
వరుడా . | రంగ | శ్వరుడై క | దా . . మన | సిరి ఆం . | డా . . ళ్లై . | వ . ఘు . వ క | దా . |
॥ పోదామా ॥

ఆళ్వారులను పరిగణిస్తారు వైష్ణవులు. ఆ పన్నిద్దరు (12మంది) ఆళ్వారులలో పెద్దవాడుగా (పెరియాళ్వార్) విష్ణుచిత్తుడనే శ్రీరంగనాధుని భక్తుని యింట తులసీవనంలో ఒక ఆడ శిశువు దొరుకుతుంది. ఆమెను తన కన్న కూతురుగా అల్లారుముద్దుగా పెంచు కుంటాడు విష్ణుచిత్తుడు. ఆయన ప్రతిదినము శ్రీరంగ నాధునికి తన తులసీ వనంలోని తులసీ దళాలను, పుష్పాలను మాలగా కూర్చి ఉదయాన్నే ఆలయంలోని స్వామి వారికి సమర్పించడం అలవాటు. తన ముద్దు బిడ్డను గోదాదేవి అని ప్రేమతో పిలుచుకునేవాడు. ఆమె చిన్నతనం నుండి శ్రీరంగనాధుని తన భర్తగా భావించేది. ఆమె ప్రతిదినము తులసీ దళాలతోను, పుష్పాలతోను మాల కూర్చి తాను కొప్పున ధరించి తిరిగి తన తండ్రి చేతికిచ్చి ఆలయంలో స్వామికి సమర్పించమనేది. ఈ విషయం తెలియని విష్ణుచిత్తుడు ఒకనాడు తాను స్వామికి సమర్పించే మాలలో తల వెంట్రుకలను చూచి కలవరపడి కూతురిని ప్రశ్నించాడు. ఆమె తాను కొప్పున ధరించి స్వామికి సమర్పణకై యిస్తున్నట్లు తెలిపింది. అది అపచారం కదా అని తండ్రి అడుగగా గోదాదేవి శ్రీరంగ నాధుడే తన పతి అని. ఆయన తాను ధరించి, సమర్పించే మాలను సంతోషంగా స్వీకరిస్తాడని తెల్పుతుంది. ఆమె కొప్పున మాల ధరించి స్వామికి సమర్పించినది కనుక ఆమెను 'ఆముక్త మాల్యద' అని, తమిళ భాషలో 'శూడి కుడుత్తై' అని అంటారు. ఆ పదమే తెలుగులో 'చూడి కుడుత' గా పలుకబడుతున్నది. (ఈ గాధనే "ఆముక్త మాల్యద"అనే ప్రబంధంగా శ్రీకృష్ణదేవ రాయులు రచించాడు) 'శ్రీ గోదా రంగనాధుల కల్యాణం' తో - ఆ రూపకం పరిపూర్ణ మౌతుంది. ఆ కల్యాణ ఘట్టాన్ని వర్ణించే సుందర గీతమిది.



మల్లిక్



శ్రీవైష్ణవ సంప్రదాయానికి సంబంధించిన గ్రంధాలు తమిళభాషలో ఉండడంవలన, తమిళ భాషలోని పదాలతోనే పూజాది కార్యక్రమాలు కొనసాగుతుంటాయి. కనుక శ్రీ వైష్ణవంలోని తమిళభాషా పదాలను కృష్ణశాస్త్రిగారు తమ పాటలో, చక్కగా వాడుకున్నారు. భగవంతుని 'పెరుమాళ్' అని, శ్రీ శబ్దానికి 'తిరు' అని తమిళంలో అంటారు.

శ్రీ గోదాదేవి ధనుర్మాసంలో 'శ్రీవ్రత'మును ఆచరించింది. 'తిరుప్పావై' అని 30

పాటలతో(వీటిని 'పాశురములు' అంటారు) ఆమె వ్రత నియమాలను, పాటించవలసిన విధానాలను భక్తజనావళికి తెలిపినది. పరమ పవిత్రమైన ఈ ధనుర్మాసాన్ని 'తిరుప్పావై' లోని 30 పాశురాలను ప్రతి దినమూ పారాయణగా చేస్తూ శ్రీవైష్ణవులంతా భక్తిశ్రద్ధలతో ఈ వ్రతాన్ని ఆచరిస్తారు. ఆవిధంగా వ్రతాన్ని జరుపుకుని భోగినాడు శ్రీ గోదా శ్రీ రంగనాధుల కళ్యాణం నిర్వహించి వ్రతసమాప్తి గావించుకుంటారు. అర్ధశతాబ్దికి పైగా ఆకాశవాణిలో ధనుర్మాస పర్వదినాలనుద్దేశించి ప్రతిసంవత్సరమూ వ్యాఖ్యాన సహిత తిరుప్పావై పాశురములు, శ్రీ గోదాస్తుతి శ్లోకాలు, శ్రీ మహావిష్ణువుకు సంబంధించిన (శ్రీకృష్ణ, శ్రీరామ, నరసింహ మొ॥లగు దశావతారాలకు) స్తుతి గీతాలతో ప్రతిరోజూ 'భక్తిరంజని' కార్యక్రమాలు ప్రసారమౌతుంటాయి.

శ్రీగోదాదేవి రచించిన 'తిరుప్పావై' పాశురాలను ముద్దుపళని అనే కవయిత్రి తెలుగులో అనువదించినది. తరువాత యింకా అనేకమంది అనువాదం చేశారు. కృష్ణశాస్త్రి గారు 30 పాశురాలను 30 పాటలుగా వ్రాసారు. వీటిని కొంతకాలం క్రితం శ్రీమతి అమృతవల్లి సుందరం, శ్రీమతి ఛాయాదేవి, శ్రీమతి వేదవతి ప్రభాకర్ రావు మొదలగువారు గానం చేయగా ఆకాశవాణిలో ప్రసారమయినాయి. తరువాత శ్రీ అచ్చివేణుగోపాలాచార్యులు పాటలుగాను, శ్రీమతి డా॥ఎం. పద్మినీదేవి పద్యాలుగాను అనువాదం గావించారు. ●

చలన చిత్రాలలో కొన్ని రాగమాలికాగీతాలను చిత్రగీతాలను "హాసం" ఫిబ్రవరి 1-15, 2002 సంచికలో పేర్కొనడం జరిగింది.

## వినతి

తెలుగు అకాడమీ కథానిలయం సంయుక్త నిర్వహణలో "కథాకోశం" పేర తెలుగు కథకు రిఫరెన్స్ బుక్ తేవడానికి 1 సెప్టెంబర్ 2003 నుండీ కృషి జరుగుతోంది.

పదుగురు సలహా సభ్యుల సూచన మేరకు ఒక్కొక్క ఆరోపంలో కథ, కథానిక లేక గల్పికలు, రాసిన కథకుల పూర్తి పేరు, కలంపేరు, పుట్టినతేదీ, స్వస్థలం, విద్య, ఉద్యోగం లేదా వృత్తి, చిరునామా, ప్రచురించిన కథాసంపుటాల పేర్లు, ప్రచురణ వివరాలు, కథలు సంకలనాల్లో వస్తే ఆ సంకలనాల వివరాలు, కథలకు లభించిన ప్రభుత్వ అవార్డులు, (కథా సంపుటాలూ, సంకలనాలలో వచ్చిన మొత్తం కథల పేర్లు) పత్రికల్లో వచ్చిన కథల విషయంలో కథ పేరు, పత్రిక పేరు, ప్రచురించిన తేదీ నమోదవుతాయి.

"కథాకోశం" సాధ్యమైనంత సమగ్రం చేయడానికి కథకులూ, కథాభిమానుల సహకారం అర్థిస్తున్నాం.

ఇదివరకే కథానిలయానికి వివరాలు ఇచ్చినవారు-మారిన చిరునామాలూ, ఇటీవల ప్రచురించిన కథల జిరాక్సులూ ఇంతవరకూ పంపించకపోతే ప్రకటించిన కథా సంపుటాలూ, ఉద్యోగం లేదా వృత్తి వంటి అదనపు సమాచారం, పాస్ పోర్ట్ సైజు ఫొటోతో కథానిలయానికి పంపించగోర్తాము.

ఇంతవరకూ కథానిలయానికి వివరాలివ్వని కథకులు - ఒక కార్డు మీద తమ చిరునామా తెలియజేస్తూ - వివరాలకోసం కథానిలయం ఒక ఫారం పంపుతుంది. కీర్తిశేషులైన కథకుల విషయంలో వారి వారసులు గాని, అభిమానులూ, మిత్రులుగాని ఉత్తరం రాసి ఫారం తెప్పించుకొని సాధ్యమైనన్ని వివరాలు ఇవ్వవచ్చును. **-కథానిలయం ట్రస్ట్**

Kalipatnam Rama Rao, Visakha Bank 'A' Colony, Srikakulam - 532 001, Ph: 08942 - 220069

"మేడమ్! మీవయసెంతో చెబుతారా...?"
"సారీ అంత కరక్టుగా చెప్పలేను"
"మరి... మీ పుట్టినరోజెలా జరుపు కుంటారు?"
"నెలా, తారీఖూ గుర్తుంటాయిగా.."



"రేయ్! నువ్వు ప్రతిరోజూ మీ పక్కింటి అమ్మాయివెంట అదేపనిగా పడేవాడివి కదా! ఈ మధ్య అలా పడటం లేదేం?"
"ఏం లేదు... ఇలా ప్రతిరోజు నా వెంట పడటానికి నీకు సిగ్గుగా లేదూ?... అని అంది. అందుచేత ప్రస్తుతం వారానికి ఒకరోజు మాత్రమే ఆమె వెంట పడుతున్నాను".



"ఎడిటర్ గారు ! మీరు నా కథలు ఎందుకు ప్రచురణకు స్వీకరించడంలేదు" అడిగింది రజని.
"మీ రచనలో స్పార్క్ ఉంది కానీ.... హోమీ పత్రంలో నిజం చాలా తక్కువ ఉంది. అందుకని..." చెప్పాడు ఎడిటర్.



"ఏమోయ్... మీ అబ్బాయి దొంగతనాలకు అలవాటు పడ్డాడన్నావు. ఇప్పుడు అడిగితే అస్సలు చేయటంలేదంటున్నావు అయితే బాగు పడ్డాడన్నమాట"
"చెప్పలేం"
"అదేంటి?"
"ప్రస్తుతానికి జైల్లో ఉన్నాడులే... అందుకనీ.."





"మా డాడీ పేర్లు బాగా పెడతాడు"
"వచ్చేవారం నాకో తమ్ముడు పుడతాట్ట. మంచి పేరుకోసం మీ యింటికి రానా!"
"మా డాడీ పేర్లు పెట్టేది పిల్లలకి కాదు"
"మరి?"
"మా మమ్మీ చేసే వంటలకు..."

**ఈ జోకులను పంపినవారు : బి.వి.యస్.బాబు, గాంధీనగర్,తెనాలి.**

డాక్టర్ దగ్గరకి వెళితే మూడోనెల అని కన్ఫర్మ్ చేసింది. తన భర్తకా విషయం చెప్పి అతన్ని ఆనందంలో ముంచెత్తాలనుకుంది ఓ ఇల్లాలు. అంచేత అతను రాగానే "ఏరా కన్నా... ఆడుకునేందుకు నీకు చెల్లాయికావాలా... తమ్ముడు కావాలా?" అని అడిగిందా యిల్లాలు తన అయిదేళ్ళ కొడుకుని.
"ఎందుకు మమ్మీ! కంప్యూటర్ వుందిగా" అన్నాడా కుర్రాడు కూల్‌గా.



"ఏరా... నిన్నటి పాఠం అప్పచెప్పు"
"గతం గతః అని మీరే కదా టీచర్ చెప్పారు, అందుకే మరిచిపోయా!"



"జ్యోతిష్కులకూ, రాజకీయ నాయకులకూ పోలికేమిటి ?"
"ఇద్దరూ భవిష్యత్తును అందంగానే చూపిస్తారు"






"మా హోటల్‌లో భోజనం చేయండి సార్... మీ ఇంట్లో వున్నట్లుగానే వుంటుంది". అన్నాడు హోటల్ ప్రొప్రైటర్.
"పెట్టేటప్పుడు సణగరుగా" అడిగాడు కస్టమర్ భయంగా.





"చుట్టాలు రాకముందు కాకి అరుస్తుంది,మరి చుట్టాలు వెళ్ళిపోయాక ఎవరు అరుస్తారు?"
"కిరాణాకొట్టు వాడు"

"ఏరా రాముూ! నీకు ఏ సబ్జెక్టులోనూ 35 మార్కులకు మించి రావేంట్రా?"
"దురాశ దుఃఖానికి చేటు అని మీరే కద్సార్ చెప్పారు అందుకనీ..."



ఈ జోకులను పంపినవారు : నివాస్,కొంగరకలాన్(రంగారెడ్డి జిల్లా)

నేతి డబ్బాతో ఒక వ్యక్తిరైలు ఎక్కాడు,దాన్ని చైనుకు వ్రేలాడ దీసాడు.అంతే...రైలు ఆగిపోయింది.వెంటనే సిబ్బంది వచ్చి అతనికి చెప్పారు - రైలెందుకు ఆగిపోయిందో...
"అయితే ఈ నెయ్యి కల్తీ లేనిదని, ఎంతో శక్తివంతమైనదని ఆ కొట్టువాడు చెప్పింది నిజమన్నమాట" అంటూ తెగ సంబరపడి పోయాడావ్యక్తి.



"ఈ రోజు లాభంలేదు.
డాక్టర్ గార్ని కలవాలంటే ఇంకో వారం రోజులాగాల్సిందే"అంది నర్సింగ్‌హోం రిసెప్షనిస్ట్ ఫోన్లో కంగారు పడిపోతున్న పేషెంటుతో
"అమ్మో వారంరోజులా,ఈరోజు కలవకపోతే చచ్చిపోతాను" అన్నాడు పేషెంటుగాభరాగా.
"మరేం పర్వాలేదు మీ ఇంట్లో వాళ్లెవరైనా ఫోన్ చేసి చెప్తే మీ అపాయింట్‌మెంట్ కాన్సిల్ చేసేస్తాం" అందా రిసెప్షనిస్ట్ మహోపకారం చేసేస్తున్న లెవెల్లో.




"డాక్టరుగారూ! మా ఆవిడ పెట్రోల్ తాగి ఇల్లంతా స్పీడ్‌గా తిరుగుతోందండీ.... ఏం చేయమంటారు...?"
"కంగారు పడాల్సిన అవసరం లేదండీ.... ఓ అరగంట ఆగితే పెట్రోల్ అయిపోయి తనే ఆగిపోతుంది" అన్నాడు డాక్టర్ తాపీగా.



ఈ జోకులను పంపినవారు : మామిడి శ్రీలత, పూణే

చెరువులో ఒకతను కాళ్లుచేతులు తెగకొట్టుకుంటున్నాడు,అదిచూసి పోలీసు, "నీకు తెలియదా ఇక్కడ ఈత కొట్టరాదని!"అని గద్దించాడు.
"నే...నే...నేను మునిగిపోతున్నాను" అంటూ అరిచాడావ్యక్తి శక్తినంతా కూడదీసుకుని.
"అయితే సరే, నువ్వింకా ఈత కొడుతున్నావని అనుకున్నా!"అని వెళ్లిపోయాడా పోలీసు నేరమేమీ జరగటంలేదన్న తృప్తితో.



ఈ జోకులను పంపినవారు : జి.బి.లక్ష్మిహైదరాబాద్

BLISS

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన బి.వి.ఎస్.బాబు (తెనాలి), నివాస్ (కొంగరకలాన్), మామిడి శ్రీలత (పూణే), జి.బి.లక్ష్మి (హైదరాబాద్) గార్లకు బ్లిస్ ఆడియో వారు 'ఓరి.. నీ ప్రేమ బంగారంకానూ...' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.





ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

క రాజు కథలు

4

# భజన విజయం



**క** రాజుగారి రాజ్యంలో వున్న ప్రత్యేకతల్లో ఒకటి అక్కడున్న నారనారాయణుల ఆలయాలు. ఇవి రెండు. నగరం ఉత్తరాన నారాయణుడి గుడి వుంటే దక్షిణాన నరుడి గుడి వుంది. ఒకప్పుడు నరనారాయణులకు ఒకే దేవాలయం వుండేదట. అప్పుడున్న ఒక రాజుగారికి నరనారాయణులు స్వప్నంలో కనుపించి ఇచ్చిన అజ్ఞ ప్రకారం నగర క్షేమం కోసం నారాయణునికి వేరేగా, నరుడికి వేరేగా దేవాలయాలు కట్టడం జరిగిందంటారు. ఎలాగైతేనేం, ఇవి అరుదైన ఆలయాలు. కాని రానురాను వీటిని సందర్శించే జనం సన్నగిల్లుతున్నారనేదే కరాజు ఆవేదన. దీనికి ముఖ్యమైన కారణం అక్కడున్న పూజారి బాగా వృద్ధాప్యంలో ఉండడం. పైగా రెండు గుడులూ అతనే చూసుకోవల్సుంది. ఏ గుడికి ఎపుడొస్తాడో తెలీదు. దానికి తోడు ఈ వయస్సులో అతను అర్చన చేస్తూంటే ఎవరికీ వినపడేది కాదు. దీంతో భక్తులకు గుడికెళ్లాలనే ఉత్సాహం అంతగా ఉండేది కాదు.

క రాజు మంత్రిని పిలిపించి తన ఆలోచనని వివరించాడు.

" మంత్రీ! మీరు వెంటనే ఇప్పుడున్న వృద్ధ పురోహితునికి పారితోషికంతో పాటు విశ్రాంతిని జత చేసి ఇప్పించండి. ఆ తర్వాత ఒక సమర్థుడైన వ్యక్తిని ఎంపిక చేసి అతన్ని పెద్దదైన నారాయణస్వామి ఆలయానికి పూజారిగా నియమించండి" అన్నాడు.

"మరి నరుడి గుడికి .........." ఏదో చెప్పబోయాడు మంత్రి.

" అది చిన్న గుడేగా! దాని కెవర్నో చూడమని మన ధనపాలుడికి చెప్తాను లెండి" అన్నాడు కరాజు. మొత్తం పెత్తనం తన చేతికిందే వుండాలని మంత్రి ఇష్టపడ్డా, కరాజు ఆజ్ఞ అయిన తర్వాత ఏమీ మాట్లాడలేక సరేనన్నాడు.

మంత్రి రాజ్యమంతా గాలించి చివరకు కేశవ శర్మను ఎంపిక చేశాడు. కేశవశర్మ సంస్కృతంలో అసమాన పండితుడే కాక వివిధ పూజా వ్రత నిర్వహణలలో ఉద్ధండుడు. అతని కంఠంలోంచి ఖంగుమంటూ సుప్రభాత శ్లోకాలు, సహస్ర నామార్చనలూ దొర్లుతూంటే వాటి ఉచ్చారణా స్వచ్ఛతకు, పవిత్రతకు విజ్ఞులు ముగ్ధులయేవారు. కేశవశర్మ కూడా దీన్ని దైవ కటాక్షంగా ఎంచి ఉద్యోగాన్ని సవినయంగా స్వీకరించాడు.

క రాజు రాజ్యంలో మంత్రికి అనుచరులుగా వివిధ శాఖలకు సంబంధించిన ఉన్నతా

ధికారులున్నారు. ఆర్థిక విషయాలను చూసుకునే ధనపాలుడు, పనివారి క్షేమం చూస్కునే శిశుపాలుడు, ఇంకా గృహపాలుడు, న్యాయ పాలుడు - ఇలా ఎందరో. వీరిలో ధన పాలుడు ముఖ్యుడు. ఎవరేం చేయాలనుకున్నా ధన పాలు॰ అనుగ్రహం తప్పనిసరి. నగరంలోని బాల కవుల॰ ధనపాలుని గురించి

ధనపాలుడు కోపించిన
కనుమరుగే కాసులన్ని క్షణమున మఱియూ
ధనపాలుడే కరుణించిన
కనకపు వర్షములె కురియు గదరా సుమతీ

అంటూ విలాసంగా పాడుకునేవారు. ఈ విషయం కరాజుకు కూడా తెలుసు కనుక, మంత్రిని నొప్పించక ధనపాలుని ఆదరిస్తూ చిన్న గుడికి ఒక పూజారిని చూడమని అతన్ని ఆదేశించాడు.



దీర్ఘంగా ఆలోచించి ధనపాలుడు నారాయణ శర్మ అనే వ్యక్తిని ఎంపిక చేశాడు. ఈ వార్తవిని తెలిసిన వాళ్ళు ఒకరినొకరు ప్రశ్నార్థకంగా చూసుకున్నారు. ఎందుకంటే నారాయణశర్మ పెద్ద యాగాలు, హోమాలు చేయగలిగిన సమర్థుడు కాదు సరికదా, చిన్నప్పుడు స్వల్పకాలం సంస్కృత పాఠశాలలో చదివాడట. అదెప్పుడో మర్చిపోయింటాడు. ఇప్పుడు అతని ముఖ్యమైన వ్యాపకం ఊళ్ళో పండగలు, ఉత్సవాలు వచ్చినపుడు ఇంట్లోనే ప్రసాదాలు తయారు చేసి దేవుడికర్పించి వాటిని అమ్మడం. నారాయణుడి ప్రసాదమన్నా, భక్ష్యాలన్నా జగత్ ప్రఖ్యాతం. అయినా ఒక పూజారిగా ఇతన్ని నియమించడం ఏమిటని కొందరి సందేహం.

ధనపాలుని ఈ నిర్ణయంలో ఒక రహస్యం వుంది. నగరంలోని చిన్న, పెద్ద వ్యాపారస్థులందరూ ప్రతినెలా ధనపాలుడి దర్శనం చేసుకోవడం ఎప్పట్నుంచో వస్తున్న అలవాటు. దీన్ని "ఉభయ కుశలోపరి కార్యక్రమం" అంటూండేవారు. తమ దగ్గరకు వచ్చిన ఒక్కొక్కరినీ ధనపాలుడు "రెండూ రెండూ కూడితే ఎంత?" అని ప్రశ్నించేవాడు. వచ్చిన వారంతా "నాలుగు" అని చెప్పి నాలుగు వరహాలిచ్చి వెళ్ళిపోయేవారు. ఇదే ప్రశ్నను నారాయణ శర్మను మొదట్లో కలిసినప్పుడు కూడా అడిగాడు. నారాయణ శర్మ మాత్రం అందరిలా కాకుండా "కూడితే ఎంతవుండాలని మీకోరిక?" అని అడిగాడు. ఈజవాబు ధనపాలుడికి చాలా నచ్చింది. అప్పట్నుంచీ నారాయణశర్మ ధన పాలుడి నమ్మకస్థులో ఒకడు. ఆ నమ్మకంతోనే ఈనాడు నరుడి గుడికి అతన్ని పూజారిగా నియమించారు.

మంత్రి మాత్రం ఈ వార్తవిని లోలోన సంతోషించాడు. నోట పలుకురాని నారాయణుడు ఎటూ పూజారిగా విఫలుడౌతాడు. దాంతో ధనపాలుడికి ఎనలేని అప్రతిష్ఠ వస్తుంది. ఆ సమయం కోసం వేచి వున్నాడు మంత్రి.

ఒక శుభ ముహూర్తాన కేశవశర్మ నారాయణ గుడిలో పూజలు మొదలెట్టాడు. గంభీరమైన కంఠస్వరంతో కూడుకున్న అతని స్వచ్ఛమైన మంత్రోచ్చారణ గర్భగుడిలో మారుమ్రోగింది. కాని దాన్ని ఆనందించడాన్కి అక్కడ పట్టుమని పదిమంది కూడా లేరు.

అదే సమయంలో నారాయణ శర్మ నరుడి గుడిలో పూజలు ప్రారంభించడానికి సన్నద్ధుడయ్యాడు. అతనికి ఒక ముక్క మంత్రం రాకపోయినా ముఖం మాత్రం సర్వజ్ఞునికున్న మందహాసంతో తొణికిసలాడింది. అప్పుడక్కడున్న ఊళ్ళోని భక్తులు అయిదారుగురే. కాని నారాయణశర్మ వెంటవచ్చిన అనుచరులు పదిమందితో మొత్తం భక్తుల సంఖ్య పదిహేనైంది. ఇప్పుడు నారాయణ శర్మ ఒక కొత్త ప్రక్రియకు నాంది పలుకుతూ తన శిష్య బృందాన్ని ఉద్దేశించి "చూడండి! నేను మంత్రాలు చదువుతూ మీరు యాంత్రికంగా వింటూంటే దానివల్ల భక్తి భావం పుట్టదు. పుణ్య లాభం లభించదు. అందుకని నేను అర్చన మొదలెట్టిన క్షణాన మీరందరూ భక్తిగా

జయ జయదేవా నరదేవా
జయహే జయహే నరదేవా

అంటూ భజన మొదలెట్టండి. అర్చన కొనసాగించినంత సేపూ భజన కూడా కొనసాగాలి. అప్పుడు మీకు నరభగవానుని కటాక్షం సంపూర్ణంగా లభించగలదు" అన్నాడు.

ఈ ఉపదేశం శిష్యులకు ఉద్దేశించినదైనా దాని ప్రభావంవల్ల అక్కడి భక్తులందరిలో ఒక కొత్త చైతన్యం ఆవరించింది. నారాయణశర్మ 'ఓం' అనీ అనగానే అందరూ 'జయ జయ నరదేవా' అంటూ భజనలు మొదలెట్టారు. నారాయణుడు మధ్య మధ్య 'ఓం' అంటూ

ఏదో మంత్రం చెప్పినట్టు పెదిమలు కదిలిస్తున్నాడు. భక్తులిదేం పట్టించుకోలేదు.వాళ్ళ భజనలో వాళ్ళు పూర్తిగా తన్మయులై వున్నారు. పూజ ముగిసింది. భక్తులు ఈ క్రొత్త ప్రక్రియకు ఆనందం వెలిబుచ్చుతుండగా నారాయణుడు లోపల్నుంచి ప్రసాదాలను తెచ్చి అందరికీ పంచిపెట్టాడు. ఇనుమడించిన ఆనందంతో భక్తులు స్వీకరించి, కొంత ప్రసాదాన్ని వారివారి ఇళ్లకు తీసుకుపోయారు.

ఇలా ప్రారంభమైన నరభగవానుని భజన పూజల ఉత్సాహం అతి కొద్దికాలంలో నగరమంతా దావానలంలా పాకింది. రానురాను వందలాది జనం గుడిని సందర్శించి నారాయణ శర్మ 'ఓం' అనగానే 'జయజయ' అంటూ భజన చేసి ప్రసాదాన్ని పుచ్చుకొన్ని వెళ్ళేవారు. నరుడి గుడి ఖ్యాతి ప్రబలి పొరుగూళ్ళనుంచి కూడా జనం రావడం మొదలెట్టారు. ఇప్పుడు నారాయణుడి గుడిని పట్టించుకున్నవారులేరు. ఎవరైనా మనం ఒకసారి నారాయణుడి గుడికి వెళ్ళొచ్చుకదా అంటే "ఎందుకూ నరనారాయణులు (అంటే పూజారి నారాయణుడు) ఇద్దరూ ఇక్కడే వున్నారుకదా!" అని అనుకునేవారు.

నరుడి మహిమ నలుమూలలా వ్యాపించింది. భక్తుల సంఖ్య పెరిగేకొద్దీ ప్రసాదాలతయారీ పెరిగింది. ఇందుకుగాను నారాయణశర్మకు ఒక కొత్త భవనాన్ని ధనపాలుడు తన సంతోషానికి చిహ్నంగా ప్రసాదించాడు. భజన బృందాల చందాలతో గుడిముందు అరవై అడుగుల నరుని విగ్రహం నిర్మించడమే కాక ముఖ్యమైన వీధుల్లో కూడా వీటిని స్థాపించడం జరిగింది. భజన ప్రక్రియలో ఒక విశేషముంది. చిలకగా చిలకగా మజ్జిగ లోంచి వెన్న వచ్చినట్టు భజన చేయగా చేయగా కొందరిలో ఒక వీరావేశం పుట్టుకొస్తుంది. వాళ్ళు క్రమేణా భజనవీరులౌతారు. ఎవరైనా వారి భజనలకు అంక్షలు పెడ్తే అలాంటి వాళ్లిక నరకానికి దారి చూస్కోవలసిందే.

ఇదంతా గమనిస్తున్న మంత్రికి మతి పోయింది. అతని కోపమంతా తను ఏరికోరి ఎంపిక చేసుకున్న కేశవశర్మ మీదికి వెళ్ళింది. వెంటనే నారాయణుడి గుడికి వెళ్ళాడు. అక్కడ భక్తులెవ్వరూ లేరు. గర్భగుడిలో అంతా చీకటిగాఉంది. కాని లోపల్నుంచి 'అష్టోత్తర శత నామార్చన' వినిపిస్తోంది. అది కాగానే కేశవశర్మ బయట వెలుగులోకి వచ్చి మంత్రిని చూసి నమస్కరించాడు. మంత్రి తన కోపాన్ని ఆపుకుంటూ "ఏమిటయ్యా కేశవశర్మా! మహా పండితుడివి! నీవంత చక్కగా దేవతార్చన చేస్తున్నా భక్తులెవ్వరూ రారేమిటి?" అని అడిగాడు.

"అలాగాండీ? నాకు తెలీదే. నేనేదో రోజూవచ్చి పూజా కార్యక్రమాలు ముగించుకొని వెళ్తున్నాను. ఎవరొచ్చేదీ రానిదీ చూడలేదే?" అన్నాడు కేశవశర్మ సవినయంగా.

మంత్రికి తలను గోడకేసి కొట్టుకోవాలనిపించింది. "మరి చీకట్లో పూజలేమిటయ్యా?" మళ్ళీ అడిగాడు మంత్రి. "అదాండీ - మూడు రోజులుగా దీపాలు వెలిగించడానికి నూనె లేదండి" అన్నాడు కేశవశర్మ.

"మరి అడగొచ్చుకదా?"

"అది నాకు తోచ లేదండి" అన్నాడు కేశవశర్మ- ఇందులో పెద్దగా మునిగిపోయిందేముందీ అనుకుంటూ.

ఆ సాయంత్రమే నరభగవాన్ భజనసంఘం నుండి మంత్రికి ఒక ఆహ్వానం వచ్చింది. నరదేవునికి వారంరోజులు నిర్విరామంగా కార్యక్రమాన్ని చేబడుతున్నామని, దాని ప్రారంభోత్సవానికి మంత్రిగారే అధ్యక్ష పీఠాన్ని అలంకరించాలని. ముందు దీన్ని తిరస్కరించాలనుకున్నా భజనవీరుల ఆవేశం గ్రహించగలిగినవాడు కనుక సరేనన్నాడు మంత్రి.

మరుసటిరోజు ఉదయం యథావిధిగా మంత్రి కరాజుగారిని దర్శించుకున్నాడు. మంత్రి ముఖ కవళికలు చూడగానే అతని మనస్సులో ఏముందో అట్టే కనిపెట్టేసిన కరాజుమంత్రి దగ్గరికొచ్చి మృదువుగా ఉపదేశించాడు.

"చూశారా మంత్రీ! అంతపెద్ద గుడిలోవున్న నారాయణుడు ఎక్కడో మారుమూల ఉన్నట్టున్నాడు. చిన్నగుడిలోవున్న నరుడు ప్రఖ్యాతుడైనాడు. దీనికంతాకారణం ఒక్కటే. భజన. భజనచేసే వాళ్ళులేకుంటే ముక్కోటి దేవతలూ మూల కూర్చోవలసిందే. ఈ నరుడే కాదు, ఏ నరుడైనా సరే. ఈ పరమసత్యాన్ని గ్రహించి మీ తదుపరి కార్యక్రమాన్ని నిర్వర్తిస్తే ఐశ్వర్యం కన్నా ముఖ్యమైన ఆరోగ్యం మిమ్మల్ని వరిస్తుంది" అనిచెప్పి కరాజు వెళ్ళిపోయాడు.

కరాజు ఉపదేశంలోని తత్వం మంత్రికి అర్థమయింది.

నరస్తుతి ప్రారంభోత్సవం రోజు మంత్రికి ఘనంగా స్వాగతం పలికి అధ్యక్షపీఠం మీద కూర్చోబెట్టారు. మంత్రి ప్రజలనుద్దేశించి ప్రసంగిస్తూ "ఈరోజు ఈ నరభగవానుని విశ్వరూపమేమిటో మనకు తెలిసేటట్టు చేసిన శ్రీ నారాయణశర్మను అభినందిస్తూ అతనికి 'భజనసార్వభౌముడ'నే బిరుదును ప్రసాదించవలసిందిగా మహారాజును అర్థిస్తున్నాను" అన్నాడు. ఉద్రేకపూరితమైన భక్తుల చప్పట్లు నలుమూలలా మారుమ్రోగిపోయాయి.

"ఇప్పుడు నేను మంత్రినికాను. భక్తుణ్ణి. భజన సంఘంలోని ఒక సభ్యుణ్ణి" అంటూ మంత్రి 'జయ జయ జయహే నరదేవా' అంటూ భజన మొదలెట్టాడు. వెంటనే భక్తులంతా ఆవేశంతో 'జయ జయ జయహే నరదేవా' అంటూ గొంతులు కలిపారు. ●



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
**డా॥ పి.బి.శ్రీనివాస్**
'హాసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

"బహూబేగం" అనే చిత్రానికి సంగీత దర్శకులు రోషన్. "దునియాకరే సవాల్" అనే గజల్‌కి లాజవాబ్ తరజ్ (ధున్) తయారు చేశారు. స్పెషల్‌గా సాహిర్ లూధియాన్వీ రాసిన లిరిక్కుకి రోషన్ చాలా సముచితమైన, నిర్దుష్టమైన ట్యూన్ కట్టారు. లతకి 'రోశన్' మంచి మిత్రులు. లతా తీద్దామనుకున్న 'భైరవి' అనే సినిమాకు రోషన్‌నే సంగీతదర్శకుడిగా ఎంచుకుంది. బొంబాయికి వచ్చిన కొత్తలో రోశన్ తన భార్య "ఇరా రోశన్"తో ఒక గేరేజ్‌లో వుండేవారట. అక్కడే నేటి నట చిత్ర నిర్మాత రాకేశ్ రోషన్ జన్మించారు.

'మమతా' చిత్రానికై "రహేఁన రహేఁ హం" అనే గీతమూ "నూర్‌జహాన్" చిత్రానికై "రాత్‌కీ మెహ్‌ఫిల్ సూనీసూనీ" అనే గీతమూ లతకి చాలా నచ్చిన రోషన్ స్వరసృజనలట. నాకు నచ్చిన లత పాడిన రోషన్ సృజనలలో, "సారీసారీ రాత్, నీంద్ ..." అనే పాట. "జోవాదా కియా వో నిభానా పడేగా" అని రఫీతో లత పాడిన పాటా చాలా ముఖ్యమైనవి. రెండోపాట ఎవ్వరికీ ఏనాటికీ మఱపురాని, మఱవదగని ప్రేమగీతం; ఈ పాట పల్లవి రోషన్ విశాల కపోల కల్పనా ప్రావీణ్యానికి సజీవ నిదర్శనం.

పల్లవిని గాంధారంలో కొన్ని మాత్రల పరిమాణం వఱకూ, నిలిపి, ముందుకి సాగి రిషభంలో ఆపటం, తరువాత షడ్జమంలో ఆపటం, ఒక ఆర్టిస్టిక్ స్కల్ప్చర్ అనక తప్పదు. నౌషాద్ లాగే చిన్న పల్లవులకి పొడుగాటి ట్యూన్‌లు చేయడంలో రోషన్ కూడా సిద్ధహస్తులు. దీనికి మఱొక నిదర్శనం, రోషన్ ముకేశ్ చేత పాడించిన సుదీర్ఘ మకుటం, "దిల్ తుఝే దియా థా రఖ్‌నేకో, తూనే దిల్‌కొ జలాకే రాఖ్ కర్‌దియా ..." - ఫ్లూట్ బిట్ కుదర్చటంలో కూడా రోషన్ బహునేర్పరులు.

1972లో"పాకీజా" చిత్రం కమాల్‌అమ్‌రోహీ (మీనాకుమారి భర్త) దర్శకత్వం నిర్వహించిన మెగా హిట్. పాటలన్నీ చాలా చాలా పాప్యులర్. నౌషాద్ వద్ద డోలక్ విద్వాంసుడుగా పేరొందిన గులాం మహమ్మద్ సంగీతం అందించారు. ఈ చిత్ర గీతాల చర్చ వచ్చినప్పుడు లత "నిజానికి, ఈ పాటలు నాకంతగా నచ్చినవి కావనే అనాలి కానీ "చల్‌తే చల్‌తే' 'ఠారే రహియో' 'ఇన్హీఁ లోగోఁనే' గీతాలు మెదడులో సదా మెదిలే మట్లు అనే చెప్పాలి. ఏదో ఆకర్షణ ఉంది వాటిలో." అని చెప్పింది.

పాట నచ్చకపోయినా లతా పాడిన సందర్భాలున్నాయికానీ గొంతు నచ్చకపోతే పాడిన సందర్భాలు లేవు. లతా గురించి 'ఆతీనహీఁ; గాతీ నహీ' అని వింత ప్రచారం సాగేది. మరి ఆఖరి నిమిషంలో గొంతు బాగాలేదనిపించి రికార్డింగు కాన్సిల్ చేస్తే అందరికీ నష్టమూ, కష్టమూ కదాని లతాని అడిగితే - 'గొంతు బాగుందని నా కనిపిస్తే తప్ప నేను ఏ పాటా రికార్డు చేయడానికి అంగీకరించగలిగేదాన్ని కాను. నేను ఒక రికార్డింగు కేన్సల్ చేసినప్పుడల్లా ఒక నూఱుమంది బాధపడతారు అని నాకు తెలుసు. కాని నా గొంతుపై నాకే నమ్మకం సరిగ్గా కుదరని రోజున, రికార్డింగుకి వచ్చి పాడేస్తే విని బాధపడేవాళ్లు వేలలోనూ, లక్షలలోనూ, కోట్లలోనూ వుంటారు అని నా సిన్సియర్ ఫీలింగు " అని జవాబిచ్చింది.

వాదానికి ప్రతివాదం - నిజమే! కాని ఫిలిం

## భైరవిరాగంలో లతా పాటలు

బర్సాత్ మే హమ్ సే మిలే తుమ్ సజన్
(బర్సాత్ - శంకర్-జైకిషన్)
ఖామోశ్ హై ఖేవన్‌హార్ మేరా (అమర్-నౌషాద్)
సావరే సావరే (అనూరాధ - రవిశంకర్)
సునో ఛోటీసీ గుడియా కీ లంబీ కహానీ
(సీమా-శంకర్-జైకిషన్)
తుమ్హారే సంగ్ మై భీ చలూంగీ
(సోహ్నీ మహీవాల్ - నౌషాద్)
కైసే ఆవూ జమునా కే తీర్
(దేవ్‌తా - సి.రామచంద్ర)
కభీ తో ఆ కభీ తో ఆ (పట్‌రాణి - శంకర్-జైకిషన్)
దో హంసోంకో జోడా (గంగా జమునా - నౌషాద్)
జో తుమ్ తోడో పియా
(ఝనక్ ఝనక్ పాయల్ బాజే - వసంత్ దేశాయి)
తేరా జానా (అనాడీ - శంకర్-జైకిషన్)
మే తో ప్యార్ సే తేరే పియా (సాథీ - నౌషాద్)
మోరీ ఛమ్ ఛమ్ బాజే పాయలియా
(ఘూంఘట్ - రవి)
తుమ్హే ఔర్ క్యా దూ
(ఆయీ మిలన్ కీ బేలా - శంకర్-జైకిషన్)
మేరే పాస్ ఆవో (సంఘర్ష్ - నౌషాద్)
నస్ నస్ మే ఆగన్ (జహా ప్యార్ మిలే - శంకర్-జైకిషన్)
-కమ్యూనికేటర్ ఫీచర్స్

# లతా - వసంత్ దేశాయి - వాణీ జయరాం

చిత్రసీమకు కొత్త గాయనీగాయకులను పరిచయం చేయడానికి మెట్రో-మర్ఫీ కాంటెస్ట్ 1957లో జరిగింది. మహేంద్రకపూర్ ఉత్తమ గాయకుడిగా, ఆరతీ ముఖర్జీ ఉత్తమ గాయనిగా ఎన్నికయ్యారు. రఫీకి శిష్యరికం చేసిన మహేంద్రకపూర్ నిలదొక్కుకున్నాడు. బి.ఆర్.చోప్డా, మనోజ్‌కుమార్ వంటివారు నిరంతరం ప్రోత్సహించడంతో బాటు ఓ.పి.నయ్యర్ రఫీచేత పాడించనప్పుడు, రఫీ దిలీప్‌కుమార్‌కు పాడనప్పుడు రఫీస్థానంలో మహేంద్రకపూర్‌కు చాలా పాటలు పాడే అవకాశం వచ్చింది. కానీ ఆరతీ ముఖర్జీకి ఆ భాగ్యం దక్కలేదు. లతా వారసురాలిగా కాదు, అసలు గాయనిగా కూడా స్థానం నిలుపుకోలేకపోయింది.

ఆ పోటీకి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన అయిదుగురు సంగీతదర్శకులు - అనిల్ బిశ్వాస్, నౌషాద్, రామచంద్ర, వసంత్ దేశాయి, మదన్‌మోహన్ - పోటీలో ఎన్నికయినవారికి తాము ఛాన్సులు ఇస్తామని ప్రకటించివున్నారు. తరువాత సి.రామచంద్ర నవ్‌రంగ్‌లో మహేంద్రకపూర్‌కు అవకాశం ఇచ్చినా మహేంద్రకపూర్, ఆరతీ ముఖర్జీ ఇద్దరికీ అవకాశాలు ప్రోత్సహించిన కంపోజర్ వసంత్‌దేశాయి ఒక్కడే.

అది లతాకు నచ్చలేదన్న అనుమానం ఒకటుండగా 'ఆశీర్వాద్'లో ఓ పాట గురించి వసంత్ దేశాయి చేసిన వ్యాఖ్యలు లతాకు కినుక తెప్పించాయి.

హృషీకేశ్ ముఖర్జీ దర్శకత్వంలో వెలువడిన 'ఆశీర్వాద్' (1968) సినిమాకు సంగీతం ఇచ్చినది వసంత్‌దేశాయి. దానిలోని 'ఎక్ థా బచ్‌పన్' అనే పాటలో లతా తను అనుకున్న ఎఫెక్టు తీసుకురాలేదని, కనీసం తీసుకువచ్చే ప్రయత్నం కూడా చేయలేదని వసంత్ దేశాయి బాధపడ్డాడు. పడి వూరుకోకుండా నలుగురివద్దా అన్నాడు. అది లతా చెవులకు చేరింది. 1967నాటి లతా లిస్టులో తన పాటలు లేవన్న అక్కసుతోనే వసంత్ దేశాయి అలా ఫీలవుతున్నాడని లతా భావించింది.

ఆశీర్వాద్ హిట్ కావడంతో హృషీకేశ్ 'గుడ్డీ' (1971) తీస్తూ సంగీతానికై మళ్లీ వసంత్‌దేశాయినే పిలిచాడు. తన పాటలకు లతా న్యాయం చేయటం లేదని అభిప్రాయపడిన వసంత్ దేశాయి ఈ సారి వాణీ జయరాం అనే కొత్తగాయనిని పరిచయం చేశాడు. ఆ సినిమాలో వాణీ చేత స్కూలు ప్రార్థనా గేయం 'హమ్‌కో మన్‌కీ శక్తి దేనా' నుండి 'బోలే రే పపీహరా' వంటి క్లాసికల్ గీతం నుండి 'హరీ బిన్ కైసే జియూ రే' వంటి మీరా భజన్ దాకా అన్నిరకాల పాటలూ వాణీ చేత పాడించి హిట్ చేయించేశాడు.

వాణీజయరాం 'బోలే రే పపీహరా'తో సృష్టించిన సంచలనం అంతా ఇంతా కాదు. ఒక్కసారిగా లతా, ఆశా ఉలిక్కిపడ్డారని ఇండస్ట్రీ అంతా చెప్పుకున్నారు. వాణీ వందకు పైగా పాటలు పాడినా హిందీసీమలో నిలదొక్కుకోకుండా వారు ప్రయత్నించారని పుకార్లు వచ్చాయి. 'సబూత్' సినిమాకై కూర్చిన 'బడా దుఖ్ దైవా పావన్ పుర్‌వయ్యా' పాటను ఓ.పి.నయ్యర్ వాణీచే పాడించాడు. బి.యన్.శర్మ రికార్డింగు స్టూడియోలో అది ఫస్ట్‌టేక్‌లోనే ఓకే అయింది. ఆ విషయం తెలిసిన ఆశా మండిపడి వాణీ చేత పాడించేమాటయితే ఆ స్టూడియోలో రికార్డు చేయనని బెదిరించిందట.

ఓ.పి.నయ్యర్‌తో గొడవ వల్ల ఆశా అలా ప్రవర్తించిందనుకున్నా నౌషాద్ సంగీతం సమకూర్చిన 'ఐనా' సినిమాలో కూడా ఇది రిపీట్ అయింది. 'కహో తో ఆజ్ బోల్ దూ' అనే పాటను ఆశా, వాణీలచే పాడించడానికి నౌషాద్ ప్లాను చేశారు. కలిసిపాడడానికి ఆశా ఒప్పుకోదు కాబట్టి ముందు ఆశాచే పాడించేసి, ఆమె వెళ్లిపోయిన తర్వాత వాణీచే పాడిద్దామని నౌషాద్ ప్లాను. కానీ ఫిలిం సెంటర్‌లో ఆశా పాడేసి వెళ్లిపోయే సమయానికి వాణీ లోపలకి రావడం జరిగింది. దీనికి ఆశా ప్రతిస్పందన ఎలా ఉంటుందో తెలిసిన ఆర్కెస్ట్రా వాణీ పాట రికార్డు చేయకుండా ఉండడానికి ఒక వాదన లేవనెత్తారు. ఆశా పాడిన పాటకు ఇది కంటిన్యూషన్ కాదనీ, అందువల్ల తమకు మళ్లీ కొత్తగా పేమెంటు చేయాలని వారి వాదన. విసుగెత్తిన నౌషాద్ అప్పటికి రికార్డింగు కాన్సిల్ చేసి మెహబూబ్ స్టూడియోలో వాణీచే రికార్డు చేయించాడు. అయితే 'ఐనా' డిస్కులో వాణీ గొంతు వినిపించదు. ఎందుకో మరి!



వాణీ వగుల్జార్ తీసిన 'మీరా' సినిమాకు పాడడానికి లతా నిరాకరించినప్పుడు, సంగీతం అందించిన పండిట్ రవిశంకర్ వాణీ పాటల కాసెట్ విని లతాకు బదులుగా పాడే శక్తి ఆమెకు ఉందని నిర్ణయించాడు. 14 రోజుల్లో 14 పాటలు వరుసలు కట్టి పాడించాడు. సినిమా కమ్మర్షియల్‌గా ఫెయిలయినా గాయనిగా వాణీ ఫిలింఫేర్ అవార్డు గెలుచుకుంది.

ఇంత టాలెంటు వున్నా వాణీ జయరాంకు హిందీరంగంలో పెద్దగా ఛాన్సులు రాలేదు. వంద పై చిలుకు పాటలు పాడినా పౌరాణిక చిత్రాలలోను, దక్షిణాది నుండి డబ్ చేసిన సినిమాలలోనూ ఛాన్సులు వచ్చేవి. విసిగిపోయిన వాణీ దక్షిణాది సినిమాలపైనే తన దృష్టిని కేంద్రీకరించింది.

వాణీ విషయంపై హరీష్ భిమానీ అనే రచయిత లతాను అడగడం జరిగింది - 'ఓ సారి ఓ నిర్మాత నన్ను పాటపాడమన్నాడు. నేను ఊరు వెళుతున్నాను. ఆశా కూడా ఊళ్లో లేదు. నేను వాణీ జయరాం పేరు సూచించాను. వాళ్లు సరేనని ఆమెచే పాట పాడించారు. కానీ నేను ఊరు నుండి తిరిగివచ్చాక ఆమె పాట తమకు నచ్చలేదని చెప్పి నన్ను పాడమన్నారు. నా ఇబ్బంది గమనించండి. నేను పాడాననుకో, వాణీ ఛాన్సు నేను కొట్టేశానని అంటారు. పాడలేదనుకోండి, నా చేత పాడించలేదన్న ఉక్రోషం కొద్దీ నిర్మాతను ఏడిపించానంటారు. ఇదీ నా డైలమా!



అసలు విషయం ఏమిటంటే కొత్త గాయనీగాయకుల గొంతు నచ్చ లేదనుకోండి. ఆ విషయం డైరక్టుగా చెప్పరు. ఈ ఇండస్ట్రీలో ఎవరు ఎప్పుడు పైకొస్తారో చెప్పలేం. ఇప్పుడు తిరస్కరిస్తే రేపు వాళ్లు పేరు తెచ్చుకున్నాక సాధించవచ్చు. అందువల్ల లౌక్యంగా 'నీకు ఛాన్సిస్తే లతా నొచ్చుకుంటుంది' అని నెపం పెడతారు. కెరియర్ ప్రారంభదినాల్లో నేనూ అనుభవించాను ఇవన్నీ.' అని సమాధానం ఇచ్చింది లతా!

- ఎమ్బీస్ ప్రసాద్

# లతా సిల్వర్ జూబిలీ ఎప్పుడు?

గత సంచికలో 1967లో లతా సిల్వర్ జూబిలీ ఫంక్షన్ జరగడంపై రఫీ అభ్యంతరాల గురించి చర్చించారు. ఈ విషయంపై చర్చ జరగడం సహజమే! హిందీ సినిమా ప్లేబ్యాక్ రంగంలో లతా రఫీ కంటె జూనియర్ కాబట్టి రఫీ వాదనలో అర్థముంది.

కానీ లతా మరాఠీ చిత్రసీమలో బాలగాయకిగా, బాల నటీమణిగా కెరియర్ ప్రారంభించిందని మనం గుర్తు పెట్టుకోవాలి. 1942లో అంటే తన 13 వ యేట ఆమె 'పహిలీ మంగళ్‌గౌర్' అనే సినిమాలో చైల్డ్‌స్టార్‌గా నటించింది. అదే సంవత్సరం 'కితీ హసాల్' అనే మరాఠీ సినిమాకై సదాశివ్‌రావ్ నెవ్రేకర్ సంగీతదర్శకత్వంలో లతా 'నాచూ యా గడే ఖేలూ సారీ మానీ హౌస్ భారీ' అనే పాట పాడింది., నటించింది. ఆ లెక్కప్రకారం **1967 నాటికి లతా సిల్వర్‌జూబిలీ, 1992లో గోల్డెన్ జూబిలీ జరుపుకోవడం సమంజసమే!**

దీనిని ఆధారం చేసుకునే 1967లో మహారాష్ట్ర ప్రభుత్వం లతా సిల్వర్ జూబిలీ జరపడానికి నిశ్చయించుకుని ఒక ప్రకటన విడుదల చేసింది.

ప్రభుత్వ ప్రతినిధి విలేఖరుల సమావేశంలో ఈ విషయం ప్రకటిస్తూ చేసిన అధికప్రసంగం వల్ల వివాదం చెలరేగింది. లతా 1942లో 'కితీ హసాల్'లో తనకై తాను పాడిందని చెబుతూనే ఫస్ట్ టైమ్ ప్లేబ్యాక్ 'ఆప్ కీ సేవా మే' అనే హిందీ సినిమాకై 1947లో పాడిందని తెలిపాడు. లతాను జాతీయస్థాయి ప్లేబ్యాక్ సింగర్‌గా సన్మానిస్తున్నామని చెబుతూ న్నప్పుడు 1947ను లెక్కలోకి తీసుకోవాలనీ, అలా అయితే సిల్వర్‌జూబిలీ 1972లో కదా చేయవలసినది అని విలేఖరులు అడిగారు. రఫీ కూడా అదే అడిగాడు.

హిందీ కాదు, మరాఠీ ప్రవేశమే పరిగణనలోకి తీసుకుంటే ప్రభుత్వ చర్య కరక్టే. **అయితే దీనిలో ఇంకో తిరకాసు కూడా ఉంది. లతా పాడిన 'కితీ హసాల్' పాట సినిమాలో నుండి తీసివేయబడింది. మరి అటువంటి సందర్భంలో దానిని లెక్క వేయాలా? వేయకూడదా? ఇది ఎవరు తేల్చాలి?**

**- మంజీర**

ప్రపంచంలో అపప్రచారాలకే తావెక్కువ" అనే మాట కూడా నిజమే మతి! 'వాదం అనే నాణానికి, ఎప్పుడూ రెండు వైపులు వుంటాయి' అనే నిజం కూడా అందఱూ ఎఱిగినదే - ఒప్పుకున్నదే!!

లత ఒక పట్టాన అలసిసొలసిపోయే గాయిక కాదు. కాని కొన్ని సందర్భాలలో ఆమెకు కూడా అలసట కలగడం ఆశ్చర్యజనకం. ఆ అలసట కలిగించిన ఘనత ఆర్.డి.బర్మన్‌కే దక్కింది. 1968లో 'పడోసన్' (అరవంలో అడుత్త వీట్టుప్పెణ్, తెలుగులో పక్కింటి అమ్మాయి) అనే చిత్రంలో 'బాయీబత్తూర్' అనే ఒక పాట కంపోజ్ చేశారు ఆర్.డి.బి. - అది చాలా సులభగీతమే కాని, ఆలాపనలలో కొన్ని క్లిష్టమైన అంశాలు చోటుచేసుకోవడం వల్ల, రికార్డింగు చాలా గంటల సేపు పట్టింది. రికార్డింగు ముగిసే టైముకి, లతకి, ఎన్నడూ ఎఱగని అలసట కలగడం, అతి అరుదైన సంభవం!

ఇదే విధంగా "చలో సజ్‌నా జహాఁతక్" (మేరేహందం మేరే దోస్త్) అనే పాట చిత్రగీత ధ్వనిముద్రణ సమయాన చాలా జాగ్రత్త వహించి పాడవలసి వచ్చింది. చాలా సీధాసాదా ట్యూనే అయినా, కష్టసాధ్యమైన ఫణితి. సాధారణంగా, అధికంగా నోరు మెదపని 'ప్యారేలాల్' కూడా ఆ రోజున, లతకి ఆ గీతంలోని కొన్ని పంక్తులు పాడే విధానంలో పనికొచ్చే కొన్ని సూక్తులు ఇచ్చి సహాయపడ్డారట. లత శ్రద్ధగా విని గ్రహించి పాడిన పిదప పాట ఓ.కే. అయింది.

"నేను ఆ పాట ఏ మాత్రం అజాగ్రత్తగా పాడి వుండినా, మొత్తం పాటే పాడైపోయివుండేది" అని లత వంటి మహామేధావి అన్నారంటే, ఆ గీత స్వరరచన ఎంతటిదో మనం ఊహించుకోవచ్చు.

పాటల సాహిత్య సన్నివేశాల పట్ల లతకి కొన్ని నిర్ణీత అభిప్రాయాలున్నాయి. కేబరే సాంగులు పాడడం లతకి ఇష్టం లేదు. ఈ విషయం ఒకసారి లక్ష్మీకాంత్‌కి చెప్పినా - "ఇంత్‌కామ్" (పగ) అనే చిత్రంలో హెలెన్ చేసే కేబరే డాన్సుకి పాడడానికామె అంగీకరించడానికి కారణం, సంగీత దర్శకులు ఆ గీతాన్ని లతకి నచ్చేవిధంగా మార్పులు చేసి మలచడమే. ఆ పాట ఆమె పాడిన వైనం అద్భుతం.

సాధారణంగా కేబరే పాటలు చాలామట్టుకు ఆశాభోన్స్లేకి అంకితాలు. ఆ స్టయిలు కూడా తను ఎంత అద్భుతంగా ఆలపించగలరో, లత ప్రత్యేక శ్రద్ధతో పాడి నిరూపించారు. - లత న్యాయం చేకూర్చలేని గీతం జగతిలోనే లేదని అనిపిస్తుంది. - ఆమె సంగీత ప్రగతికి ఎట్టి క్లిష్ట పరిస్థితిలోనూ కించిత్తూ అవరోధమే కలిగే అవకాశం లేదు. ఆమె ప్రతిభా, కృషీ, దైవభక్తీ, ఆత్మవిశ్వాసమూ మొదలైన ఎన్నో సద్గుణాల నిధియే, ఆమె విజయాలకి సదా రక్షా కవచం. ఆమె జననీ జనకుల ఆశీర్వాదం ఆమెకి సర్వథా శ్రీరామరక్ష.- చిత్ర సంగీత చరిత్రలో లతది స్వర్ణాధ్యాయం. గాయనీమణుల శ్రేణిలో ఆమెదే నిస్సందేహంగా అగ్రస్థానం. చిత్ర పరిశ్రమకే కాక, వివిధ సంగీత రసజ్ఞ శేఖరులకీ, లతా మంగేష్కర్ గానం, దైవదత్త విశిష్టవరదానం. సంగీత సాహిత్యాది కళా వైభవం వర్ధిల్లుతున్నంత కాలం మనం లతా గానానికి జోహారులు చెయ్యడం మానం!!!

-(ఇంకా వుంది)

## లతా గానలహరి

**చిత్రం: ఆహ్ (1953)**

**రచన: శైలేంద్ర** **సంగీతం: శంకర్-జైకిషన్**



**ఆ: యే షామ్ కి తన్హాయియాఁ ఐసే మే తేరా ఘమ్ ॥2॥**
**పత్తే కహీ ఖడ్‌కే హవా ఆయే తో చౌకే హమ్ ॥2॥ ॥యే॥**
**జిస్ రాహ్ సే తుమ్ ఆనే కో థే ॥2॥**
**ఉస్‌కే నిషాఁ భీ మిట్‌నే లగే ॥2॥**
**ఆయే న తుమ్ సౌ సౌ దఫా ఆయే గయే మౌసమ్.... ॥2॥ ॥యే॥**
**సీనే సే లగా తెరీ యాద్ కో ॥2॥**
**రోతీ రహీ మై రాత్ కో ॥2॥**
**హాలత్ పె మేరీ చాంద్ తారే రోగయే షబ్‌నమ్ ॥2॥ ॥యే॥**

# హాసం సినీగీతకోశం 2003

## నాగ

విడుదల తేదీ: 10.01.2003 దర్శకత్వం : డి.కె.సురేష్ బ్యానర్: శ్రీ సూర్యా మూవీస్ సంగీతం : విద్యాసాగర్, దేవా (4,5,6) (1,2,3)

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. ఎంత చిన్న ముద్దులోన ఇష్టమున్నదా | ఎ.ఎం.రత్నం | ఉదిత్‌నారాయణ్, శ్రేయఘోషల్ |
| 2. మెకరీనా మెకరీనా సొగసైనా చిన్నదానా | ఎ.ఎం.రత్నం | దేవన్, సౌమ్య,.కోరస్ |
| 3. నాయుడోరి పిల్ల నా యింటికొస్తావా | కులశేఖర్ | మనో, కోరస్ |
| 4. ఒక కొంటె పిల్లనే చూశా... | ఎ.ఎం.రత్నం | కార్తీక్, హరిహరణ్, అనురాధశ్రీరామ్, కోరస్ |
| 5. మేఘం కరిగెను మెరుపై మెరిసెను | ఎ.ఎం.రత్నం | కార్తీక్, చిన్మయి, కోరస్ |
| 6. అనకాపల్లి సెంటర్లోకి ఐశ్వర్యరాయొచ్చిందంటే... ధూల్ | చంద్రబోస్ | మాణిక వినాయగమ్, కార్తీక్, టిప్పు, టిమి, చంద్రన్, వాసు |

## ఎవరే అతగాడు

విడుదల తేదీ: 11.01.2003 దర్శకత్వం : పి.భానుశంకర్ బ్యానర్: ఆనంది ఆర్ట్ క్రియేషన్స్ సంగీతం: ఎం.ఎం.కీరవాణి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. ఎవరమ్మా అతగాడు | వేటూరి | ఎస్.పి.చరణ్, శ్రీవర్ధిని |
| 2. పెళ్ళికొడకా | వేటూరి | కార్తీక్, శ్రీవర్ధిని |
| 3. ఈ జగమే ఒక ఆకాశం | వేటూరి | ఎస్.పి.చరణ్ |
| 4. వానా వానా | వేటూరి | టిప్పు, కల్పన |
| 5. సీతారాముల కళ్యాణం | వేటూరి | కీరవాణి, కల్పన |
| 6. ప్రేమ ఎంత గొప్పదని | వేటూరి | కె.కె., గంగ |
| 7. నాతి చరామి బిలీవ్‌మి ఫాలోమి | వేటూరి | బాలు, చిత్ర |

## ఈ అబ్బాయి చాలా మంచోడు

విడుదల తేదీ:14.01.2003 దర్శకత్వం : అగస్త్యన్ బ్యానర్: శ్రీవెంకటేశ్వర సినీచిత్ర సంగీతం: ఎం.ఎం.కీరవాణి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. ఓసారి నీ చెయ్యేతాకి | చంద్రబోస్ | ఎస్.పి.బాలు, చిత్ర |
| 2. చందమామ కథలో చదివా | చంద్రబోస్ | కళ్యాణ్‌మాలిక్, సునీత |
| 3. ఒక మనసుతో ఒక మనసుకి | చంద్రబోస్ | కీరవాణి, గంగ |
| 4. నవవల్లిక నేనై పూచానోయ్ | చంద్రబోస్ | స్మిత |
| 5. తలకు కొబ్బరి నూనెతో, ఫుల్ హ్యాండ్ షర్టుతో | చంద్రబోస్ | ఎస్.పి.బాలు |
| 6. కనిపించవమ్మా ఓ పూలకొమ్మా వస్తున్నా... | చంద్రబోస్ | ఎస్.పి.చరణ్ |
| 7. ఒలంపిక్ క్రీడల్లో పేకాటకు పెద్ద పీట వేస్తే | చంద్రబోస్ | కీరవాణి, గంగ |

## ఒక్కడు

విడుదల తేదీ: 15-01-2003 దర్శకత్వం : గుణశేఖర్ బ్యానర్: సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్ సంగీతం : మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. రాముణ్ణయినా కృష్ణుణ్ణయినా కీర్తిస్తూ కూర్చుందామా | సిరివెన్నెల | శంకర్‌మహదేవన్ |
| 2. నువ్వేం మాయ చెశావో గాని | సిరివెన్నెల | శ్రియాగోషల్ |
| 3. చెప్పవే చిరుగాలి | సిరివెన్నెల | ఉదిత్‌నారాయణ్, సుజాత |
| 4. నువ్వేం మాయ చేశావో గాని | సిరివెన్నెల | కార్తీక్, చిత్ర |
| 5. సాహసం శ్వాసగా సాగిపో సోదరా | సిరివెన్నెల | మల్లికార్జున్ |
| 6. అత్తారింటికి నిను ఎత్తుకు పోతానుగా | సిరివెన్నెల | హరిహరన్, శ్రియాగోషల్, ప్రియా సిస్టర్స్ |

# పెళ్ళాం ఊరెళితే

విడుదల తేదీ: 15.01.2003 దర్శకత్వం: ఎస్.వి.కృష్ణారెడ్డి బ్యానర్: సిరి మీడియా ఆర్ట్స్ సంగీతం: మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. ఓ మల్లెపువ్వురా జాబిల్లి నవ్వురా | సుద్దాల అశోక్‌తేజ | ఉదిత్‌నారాయణ్, కల్పన |
| 2. మిలమిల మెరిసే మగువా | చిర్రావూరి విజయకుమార్ | బాలు,గోపికాపూర్ణిమ |
| 3. ఝూం బరాబర్ ఝూంషరాబి | భువనచంద్ర | చక్రి, మల్లికార్జున్, గోపికా పూర్ణిమ, ప్రీతి |
| 4. ఉళక్కి్పాపా ॥2॥ కౌసెక్కి ఉన్నదిరా | వేటూరి | కార్తీక్, ఉష |
| 5. దొండపండులాంటి పెదవే నీది | చంద్రబోస్ | హరిహరన్, కల్పన |

# జూనియర్స్

విడుదల తేదీ: 24.01.2003 దర్శకత్వం :జె.పుల్లరావు బ్యానర్:శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రొడక్షన్ సంగీతం: చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. నాగుండెల్లో నిండింది నువ్వే కదా | కందికొండ | చక్రి, కౌసల్య |
| 2. చేసింది ఓకె చేసేది ఓకె | కందికొండ | కె.కె.రవివర్మ, చక్రి |
| 3. ప్రేయసీ మనోహరీ ప్రేమ పూజ చేయనా | మధుపల | హరిహరన్, కౌసల్య |
| 4. హల్లో హల్లో హల్లో అంటూ సెలయేరు పిలిచిందిలా | పోతుల రవికిరణ్ | శంకర్ మహదేవన్, సుధ |
| 5. చెలియా నాలోనా ఏదో జరిగింది | సిరివెన్నెల | శ్రీరామ్, ప్రభు |
| 6. నైటే జోరుగున్నది ఆటే ఆడమన్నది | భాస్కరభట్ల రవికుమార్ | వసుంధరాదాస్, టిప్పు |

# అమ్మాయిలు అబ్బాయిలు

విడుదల తేదీ: 30.01.2003 దర్శకత్వం: రవిబాబు బ్యానర్: ఆనంది ఆర్ట్ క్రియేషన్స్ సంగీతం: చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. నిజం చెప్పమంటే నాకిష్టం నువ్వంటే నాతో నీవు వుంటే | భాస్కరభట్ల | చక్రి, కౌసల్య |
| 2. నీలోని అందాలు చూసానులే తెలిమంచు తెరచాటున | భాస్కరభట్ల | జీన్స్ శ్రీనివాస్, కౌసల్య |
| 3. ఇష్టపడి ఇష్టపడి నిన్నే చేరుకున్నా మనసుపడి | చంద్రబోస్ | జీన్స్‌శ్రీనివాస్, కౌసల్య |
| 4. ప్రేమా ఓ ప్రేమా నువ్వే నా ప్రేమా | పోతుల రవికిరణ్ | రవివర్మ, కౌసల్య |
| 5. నువ్వెప్పుడొచ్చావో అపుడే పుట్టింది ఈ ప్రేమా | చంద్రబోస్ | సందీప్ భౌమిక్, కౌసల్య |
| 6. సుబ్బారావు సుబ్బారావు స్నానం గానీ చేశావా | భాస్కరభట్ల | రవివర్మ, కౌసల్య |

# ఇది మా అశోగ్గాడి లవ్‌స్టోరి

విడుదల తేదీ: 31.01.2003 దర్శకత్వం : సురేష్‌కృష్ణ బ్యానర్: నింబస్ మోషన్ పిక్చర్స్ సంగీతం : ఆనంద్-మిలింద్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. నీకు మనసిస్తా నిన్ను పెనవేస్తా | వేటూరి | అభిజిత్, సాధనానిర్గమ్ |
| 2. మళ్ళీ జన్మిస్తా మళ్ళీ జన్మిస్తా | వేటూరి | కె.కె |
| 3. చలి చలిగా ముసిరిందేదో అనుభవం | వేటూరి | కె.కె, సౌమ్య |
| 4. సీతాకోకచిలుకల ఇది తొలకరి దాహాలా | వేటూరి | అభిజిత్,సాధనానిర్గమ్ |
| 5. వసంతాల ఈ గాలిలో గులాబీల గుబాళింపులు | వేటూరి | అభిజిత్ |

# ఫూల్స్

విడుదల తేదీ: 6-02-2003 దర్శకత్వం: దాసరి నారాయణరావు బ్యానర్: శేషసాయి సినీక్రియేషన్స్ సంగీతం: వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. సౌందర్యమా కలగన్న కాశ్మీరమా | దాసరి నారాయణరావు | కీరవాణి,ఉష |
| 2. బస్సుఎక్కితే కావాలోయ్ బాసు నీకు టిక్కెటు | తైదల బాపు | చక్రి |
| 3. ఆకుచాటు పిందెలం | సుద్దాల అశోక్ తేజ | రాధిక, సుధారాణి |
| 4. తన్నులు తింటే తిన్నానుగానీ | దాసరి నారాయణరావు | దేవిశ్రీప్రసాద్, స్వర్ణలత |
| 5. అడుగు అడుగనీ మనసు అడుగుతుంటే | దాసరి నారాయణరావు | ఆర్పీ పట్నాయక్, నిష్మ |
| 6. ఓయ్...ఏంటోయ్ | దాసరి నారాయణరావు | వందేమాతరం, శ్రీలేఖ |

# భీముడు

విడుదల తేదీ:06.02.2003 దర్శకత్వం : ధవళ సత్యం బ్యానర్: సూర్యం పిక్చర్స్ సంగీతం : వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.వ్యవసాయి..వ్యవసాయి..ఏరువాక పిలిచింది | సుద్దాల అశోక్‌తేజ | వందేమాతరం శ్రీనివాస్ |
| 2.టప టప టప టప చెమటబొట్లు | సుద్దాల అశోక్‌తేజ | వందేమాతరం శ్రీనివాస్ |
| 3.ఎందరో..మరెందరో బలైపోయారు | గోరేటి వెంకన్న | వందేమాతరం శ్రీనివాస్ |
| 4.భయమే మనిషికి పిరికితనం ధైర్యమే తెలుగుజాతి ధనం | సుద్దాల అశోక్‌తేజ | వందేమాతరం శ్రీనివాస్ |
| 5.పచ్చి గోరింటాకు ముద్దగాచేసి... | సుద్దాల అశోక్‌తేజ్ | వందేమాతరం శ్రీనివాస్, ఉష |
| 6.రాయుడా ఓరే రాయుడా మూతిమీద మీసముంటే | గూడా అంజయ్య | వందేమాతరం శ్రీనివాస్ |

# ఉత్సాహం

విడుదల తేదీ: 07.02.2003 దర్శకత్వం : అల్లాణి శ్రీధర్ బ్యానర్:శ్రీవాసవి క్రియేషన్స్ సంగీతం : అనురాగ్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.ఉత్సాహం..ఉత్సాహం | అల్లాణి శ్రీధర్ | శ్రీకాంత్ |
| 2.నా కళ్ళలోన | చంద్రబోస్ | సాయికిరణ్, ఉష |
| 3.ప్రేమా..ప్రేమా | సిరివెన్నెల | ఉన్నికృష్ణన్ |
| 4.జానే..జానే | పోతుల రవికిరణ్ | అనూప్, కౌసల్య |
| 5.మనసంతా వెన్నెల | చంద్రబోస్ | ఎన్.శ్రీనివాస్,ఉష |
| 6.హొట్టి చేపల బుట్ట | గోల్కొండ వీరేంద్ర | చక్రి,లెనినా |

# కబడ్డీ...కబడ్డీ

విడుదల తేదీ: 16.02.2003 దర్శకత్వం : వెంకీ బ్యానర్:మహర్షి సినిమా సంగీతం : చక్రి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.గోరువంక గోదారివంక ఈతకెళదాం వస్తావా | భాస్కరభట్ల | రవివర్మ,కౌసల్య |
| 2.జాబిల్లి బుగ్గను గిల్లి చూడాలి | భాస్కరభట్ల | హరిహరన్, కౌసల్య |
| 3.కోకిల, కోకిల కోకిల కిలకిల గలగల హాయిగా | భాస్కరభట్ల | చక్రి, కోరస్ |
| 4.ప్రేమా ప్రేమా ఓ ప్రేమా ఎక్కడ వుంది ఈ మహిమ | సాయిహర్ష | సందీప్ భౌమిక్, కౌసల్య |
| 5.కబడ్డీ కబడ్డీ... మంత్రం లేనిది ఈ గారడీ | కలువకృష్ణసాయి | రవివర్మ, చక్రి, ప్రవీణ్ |
| 6.కోకిల, కోకిల కోకిల కిలకిల గలగల పాడగా | భాస్కరభట్ల | చక్రి, కౌసల్య |

# ఉగ్రసింహాలు

విడుదల తేదీ: 21.02.2003 దర్శకత్వం: లీలా వి ప్రసాద్ బ్యానర్: జై బాలాజీ ప్రొడక్షన్స్ సంగీతం :వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.మస్తు మస్తు మావయ్యలో మావయ్యలో నను పస్తులుంచొద్దురో | వెలగదాసు సుధాకర్ | సరళ |

# గోల్‌మాల్

విడుదల తేదీ:21.02.2003 దర్శకత్వం: పి.ఎన్.రామచంద్రరావు బ్యానర్: గాయత్రి కళాచిత్ర సంగీతం: వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. నేరేడి కళ్ళంట జారేటి వళ్ళంతా | 'డాడీ' శ్రీనివాస్ | రమణ, నిష్మా |
| 2. ముయ్‌రా టెక్స్ట్ బుక్కు, వెయ్‌రా ఫస్ట్ లుక్కు | 'డాడీ' శ్రీనివాస్ | కార్తీక్, కోరస్ |
| 3. నిజం నిజం నిజం... ఇది నిజం నిజం నిజం | చంద్రబోస్ | కార్తీక్, కోరస్ |
| 4. అమ్మాయిలూ... ప్రేమించ వచ్చారా | వేటూరి | దేవీశ్రీప్రసాద్, సునీత |
| 5. ఒహో ఒహో ఖజురహో... | వేటూరి | ఎస్.పి.బాలు, ఉష |

# ఇందిరమ్మ

విడుదల తేదీ: 28.02.2003 దర్శకత్వం : ఎ.మాధవసాయి బ్యానర్: శ్రీ సర్వసాయి ఫిలింస్ సంగీతం: వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. కోనసీమవు నువ్వేలే కోకిలమ్మవు నువ్వేలే | వేటూరి | వందేమాతరం శ్రీనివాస్, కోరస్ |
| 2. నీలి నీలి ఆకశాన జాబిలీ | తైదలబాపు | మల్లి, ఉష |
| 3. ఓ పోకిరీ... సరసకురామరి | తైదలబాపు | నిష్మా |
| 4. ఆ మాఘమాసం ఈ మల్లెపందిరి | తైదలబాపు | శ్రీరామ్ ప్రభు, ఉష |
| 5. నాంపల్లి నర్సమ్మో నువ్వే నాకు వరసమ్మో | 'డాడీ' శ్రీనివాస్ | కార్తిక్, నిష్మ |

# జోడి నెం.1

విడుదల తేదీ: 07.03.2003 దర్శకత్వం : ప్రతాని రామకృష్ణ గౌడ్ బ్యానర్:ఆర్.కె.ఫిలిమ్స్ సంగీతం : వందేమాతరం శ్రీనివాస్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. నువ్వు నాకు తెలుసు నేను నీకు తెలుసు | చంద్రబోస్ | యస్.పి.చరణ్, సునీత |
| 2. ఇద్దరు కలిసి బీచ్‌కెళ్ళడం | చంద్రబోస్ | దేవీశ్రీప్రసాద్ |
| 3. పిల్లో పిల్లో మరదలుపిల్లో | చంద్రబోస్ | వందేమాతరం శ్రీనివాస్, ఉష |
| 4. నా సహారా దారుల్లో ఎదురై నిలిచిన ఓ ఒయాసిస్ | చంద్రబోస్ | శ్రీరామ్ ప్రభు, ఉష |
| 5. బుగ్గలోని సొట్ట | చంద్రబోస్ | వందేమాతరం శ్రీనివాస్ |
| 6. ఇద్దరు కలిసి బీచ్‌కెళ్ళడం | చంద్రబోస్ | ఉష |

# జిందాబాద్

విడుదల తేదీ: 14.03.2003 దర్శకత్వం : తోటకృష్ణ బ్యానర్: స్వాతిచిత్ర కంబైన్స్ సంగీతం : మార్క్‌జాన్

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1.జిందాబాద్ జిందాబాద్ నా భరతమాత జిందాబాద్ | జంగిరెడ్డి | జంగిరెడ్డి |

# గంగోత్రి

విడుదల తేదీ:28.03.2003 దర్శకత్వం: కె.రాఘవేంద్రరావు బ్యానర్: యునైటెడ్ ప్రొడ్యూసర్స్ సంగీతం: ఎం.ఎం.కీరవాణి

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. నువ్వు నేను కలిసుంటేనే నాకెంతో ఇష్టం | చంద్రబోస్ | ఎస్.పి.బాలు, మాళవిక |
| 2. ఒక తోటలో ఒక కొమ్మలో | చంద్రబోస్ | ఎస్.పి.చరణ్, మాళవిక |
| 3. వల్లంకి పిట్ట వల్లంకి పిట్ట మెల్లగ రమ్మంటా | చంద్రబోస్ | కౌసల్య, డి.ఐశ్వర్య |
| 4. రైలుబండి రైలుబండి కూతలోనే పాట ఉంది | చంద్రబోస్ | ఎస్.పి.చరణ్, శ్రీవర్ధిని, డి.ఐశ్వర్య |
| 5. గలగలగల గంగోత్రి | వేటూరి | కీరవాణి, గంగ, కల్పన, శ్రీవర్ధిని |
| 6. మావయ్యది మొగల్తూరు | చంద్రబోస్ | మనో, సునీత |
| 7. గంగా... నీ ఉరుకులె రాగంగా | చంద్రబోస్ | చరణ్, సునీత |

# రాఘవేంద్ర

విడుదల తేదీ: 28.03.2003 దర్శకత్వం : సురేష్‌కృష్ణ బ్యానర్: శ్రీశ్రీ చిత్ర సంగీతం : మణిశర్మ

| పాట పల్లవి | రచన | గానం |
|---|---|---|
| 1. నమ్మిన నా మది మంత్రాలయమేగా... | వేటూరి | శ్రీయాగోషాల్, కల్పన |
| 2. సారిగామ పదనిసా | వేటూరి | కార్తిక్,కల్పన, ప్రేమ్‌గీ |
| 3. నీ స్టయిలే నాకిష్టం | అశోక్‌తేజ | హరీష్ రాఘవేంద్ర, సుజాత |
| 4. బూతులు తిట్టకురా | వెన్నెలకంటి ✶ | మనో, బృందం |
| 4. అడుగులోన అడుగు వేస్తా | వేటూరి | మల్లికార్జున్, గోపికాపూర్ణిమ |
| 5. కలకత్తా పానేసినా చూసుకో | అశోక్‌తేజ | శంకర్‌మహదేవన్, చిత్ర |

( ✶ ఈ పాట ఆడియో క్యాసెట్‌లో ఉన్న వెర్షన్‌ను తాను రాయలేదని, వేరొక రచయితతో రాయించుకున్నారని 1-15 మే, 2003 'హాసం' సంచికలో వెన్నెలకంటి పేర్కొన్నారు.)

(వచ్చే సంచికలో మరికొంత)




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం
బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల

**11**

నవలీకరణ
ఇంపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన రోజే మేనేజర్ చేసిన మోసం వల్ల క్యాష్‌లో లక్ష రూపాయలు తేడా వస్తుంది. సస్పెండ్ అవుతాడు. ఈ విషయం బయటకు పొక్కి, వేరే ఏ ఉద్యోగమూ దొరకదు. ఝాన్సీ తన కాలేజ్‌మేట్, గోపాల్ కంపెనీలో రికమెండ్ చేస్తానంటుంది. తన కథ తెలిసాక వాళ్లూ పొమ్మంటారంటాడు బాలాజీ. అయితే తనే ఉద్యోగానికివెళతానంటుంది ఝాన్సీ. అలా అయితే తను ఇంటిపని చూసుకుంటానంటాడు బాలాజీ. నష్టాల్లో నడుస్తున్న గోపాల్ కంపెనీ లాభాల బాటలో ప్రయాణించే సూచనలివ్వటంతో ఝాన్సీని తమ కంపెనీలో కీలకమైన స్థానానికి ఎంపికచేసుకుంటారు. ఝాన్సీ ఉద్యోగంలో చేరుతుంది. కృష్ణాష్టమి వేడుకలకు గోపాలకృష్ణ రమ్మన్నాడని బాలాజీతో చెబుతుంది ఝాన్సీ. -(ఇక చదవండి)

"ఎవడా తుత్తిగాడా? నన్ను పిలిచాడా? నేను చచ్చినా రాను." అన్నాడు కోపంగా.

ఇంతలో ఫోన్ మోగింది.

"కావలిస్తే నువ్వెళ్ళు" అన్నాడు ఝాన్సీతో.

"ఏడు గంటలకల్లా లేపండేం" చెప్పింది ఝాన్సీ ఆవులిస్తూ.



ఫోనెత్తాడు బాలాజీ. "యస్... మిసెస్ బాలాజీ గారు పడుకు న్నారండీ... మిస్టర్ బాలాజీగారే వున్నారు..." విసురుగా చెప్పాడు. అంతలోనే పెద్దగా నవ్వి "హల్లో. హల్లో... గోపాలకృష్ణగారా.... నమస్తే నమస్తే నమస్తే.... నా కోసమేనా... నేనే...అఫ్‌కోర్స్...అఫ్‌కోర్స్ ఉట్టి సంబరాలంటే నాకూ చాలా సరదానండీ.. తప్పకుండా వస్తాను. మా వాళ్ళందర్నీ లాక్కొచ్చేస్తాను. థాంక్యూ థాంక్యూ" ఫోన్ పెట్టేశాడు. 'అలా పిలువ్' అనుకున్నాడు గర్వంగా కళ్ళెగరేసి.

* * *

అదో పెద్ద తోట. తోటనిండా రకరకాల ఫలవృక్షాలు, పచ్చిక బయళ్ళు, పూల మొక్కలతో ఆహ్లాదంగా ఉంది. ఆ తోటకు యజమాని గోపాలకృష్ణ.

ఉట్టి సంబరాలకు ఏర్పాట్లు చేయిస్తున్నాడు భజగోవిందం. భోజనాలు, ఫలహారాలకు ఏర్పాట్లు పూర్తయ్యాయి. ఉట్టికట్టడం అయిపోయింది. అందరూ గోపాలకృష్ణ, ఆయన కుటుంబం కోసం ఎదురు చూస్తున్నారు.

వాళ్ళు రానే వచ్చారు. సిబ్బందంతా వారికి ఘనస్వాగం పలికారు. అన్ని ఏర్పాట్లను పరిశీలించి సంతృప్తి వ్యక్తం చేశాడు గోపాల్.



ఇంతలో టూరిస్టుబస్సు రివ్వున వచ్చింది. బస్సులోంచి ఝాన్సీ, బాలాజీ, వారి ఇరుగుపొరుగు వారంతా దిగారు. గోపాల్ ముఖం వికసించింది.

"నమస్కారం రండి... రండి..." స్వాగతం పలికాడు.

అందరూ కుశల ప్రశ్నలు వేసుకుని పలుకరించుకున్నారు. అక్కడే ఉన్న శ్రీకృష్ణుడి గుడిలో గోపాలకృష్ణ దంపతులు పూజలు నిర్వహించారు. స్వామి వారి తీర్థ ప్రసాదాలు అందరికీ పంచారు.

పట్టు ధోవతి, లాల్చీలో పదహారణాల తెలుగు వాడిలా ఉన్నాడు గోపాలకృష్ణ. ఆనాటి హీరో తనేనాయె!

ప్రసాదపు దొన్నెను తీసుకుని ఒక మూలకెళ్ళి బెంచీమీద కూర్చుని తింటున్నాడు బాలాజీ. పతి ఆత్మన్యూనతా భావాన్ని గమనిస్తున్న ఝాన్సీ బాలాజీని వెతుక్కుంటూ వచ్చింది. "ఇక్కడ కూర్చున్నారా? ఈ స్వీట్ కొంచెం తీసుకోండి" అందించింది.



గోపాలకృష్ణ తన భార్యను తీసుకుని వారివద్దకు వచ్చాడు. వారిని చూడగానే బాలాజీ ముఖాన్ని మరోవైపుకు తిప్పుకున్నాడు.

ఝాన్సీని తన భార్యకు పరిచయం చేశాడు. "నేను సివంగీ... సివంగీ అని

చెబుతుంటానే... ఈవిడే... మా ఆవిడ కోమలాదేవి" ఉభయులకూ పరస్పర పరిచయం చేశాడు. ఇరువురూ ఆప్యాయంగా పలుకరించు కున్నారు.

"కాలేజీలో నన్ను లెంపకాయ కొట్టిందని చెప్పానూ.... ఈవిడే. కాస్తుంటే నీ సీట్లో ఉండేది. ఈ విషయం నీకెప్పుడైనా చెప్పానా?" అన్నాడు గోపాలకృష్ణ భార్యతో.



"ఇవ్వటికి తొమ్మిది వందల డెబ్బై రెండుసార్లు చెప్పారు." నవ్వుతూ అని "మీరు మా వారిని ఏ చేత్తో కొట్టారు? లెఫ్టా? రైటా?" అడిగింది కోమలాదేవి ఝాన్సీని సరదాగా.

"లెఫ్ట్ అండ్ రైట్ వాయించేసుంటుంది" అన్నాడు బాలాజీ ఉక్రోషంగా.

ఝాన్సీ నవ్వు తెచ్చుకుని "మా వారు" భర్తను పరిచయం చేసింది కోమలాదేవికి. "నమస్కారమండీ" అన్నది కోమలాదేవి హుందాగా.

"ఊ... ఊ..." అన్నాడు బాలాజీ సింపుల్‌గా.

"ఓహో.. కుడిచేత్తోనే కొట్టి ఉంటారు. లక్కీ....నాది ఎడం చేతివాటం. ఈసారి ఆ కథ చెప్పారో... మీ కుడి దవడకే తంటాలు." అన్నది కోమలాదేవి నవ్వుతూ.

ముగ్గురూ నవ్వుకున్నారు.

"చూశారా ఆ ఫోర్సు! అందుకే ఆ కథ చెప్పా. నాకదో తుత్తి." నవ్వాడు గోపాల్.



బాలాజీ కూడా వెటకారంగా నవ్వాడు.

"రండి రండి ఉట్టి కొట్టడంలో చిన్నప్పటి నుంచీ నేనే ఫస్టు. రండి వెళ్దాం బెనర్జీగారూ" వెళ్ళిపోతూ అన్నాడు గోపాల్ బాలాజీతో.

ఆ పిలుపుకు తెల్లబోయాడు బాలాజీ. తానెప్పుడూ గోపాల్‌ను సరిగ్గా పిలిచిన పాపాన పోలేదింతవరకూ. కావాలనే వంకరటింకర పేర్లతో పిలిచేవాడు. ఇపుడే అదే అనుభవం తనకెదురయ్యేసరికి ఈడ్చి ముఖం మీద గుద్దినట్లైంది.

అందరూ గోపాలకృష్ణ చుట్టూ నిలబడ్డారు బెల్లం చుట్టూ ఈగల్లాగా. అందర్నీ చూసి "మైడియర్ ఫ్రెండ్స్..." ఉపన్యాసం ఆరంభించాడు.

వెంటనే భజగోవిందం అందుకుని 'ఆహా! వాటేవాయిస్... వాటే వాయిస్..." స్తుతించాడు.

అందరూ చప్పట్లు కొట్టారు.

"మీ అందరికీ నా హృదయ పూర్వక కిట్నాట్టమి శుభాకాంక్షలు" అన్నాడు గోపాల్.

భజగోవిందం ఆలస్యం చెయ్యలేదు. "ఆహా! వాటే సింప్లిసిటీ... వాటే సింప్లిసిటీ...." భజన చేశాడు.

మళ్ళీ అందరూ చప్పట్లు! డబ్బున్నవాడు డోక్కున్నా అది జోకులా అనిపిస్తుంది. డబ్బులేనివాడు ఎంత మంచి జోకు చెప్పినా అందరికీ డోకు వస్తుంది. డబ్బులేనివాడు దుబ్బుకు కొరగాడని ఎవరన్నారో కానీ వారికి పాదాభివందనాలు!



"ఇవాళ మనమందరం ఇక్కడ ఎందుకు కలుసుకున్నామో మీకు తెలియంది కాదు. ఇవాళ కిట్నాట్టమి." అన్నాడు గోపాల్.

"ఫెంటాస్టిక్... వాటె మెమొరీ పవర్! వాటే మెమొరీ పవర్!" ఊగిపోయాడు భజగోవిందం.

"నేను పిలవగానే మీరంతా పిల్లా జెల్లతో వచ్చినందుకు నాకెంతో సంతోషంగా" అంటున్నాడు గోపాల్.

యజమాని మాట్లాడే ప్రతి మాటనూ ఏదో విధంగా అభినందించకుండా ఉండలేని భజగోవిందం 'ఆహా! వాటే గొప్ప మనసు!' అని స్తుతిస్తుండగా ఎప్పట్నుంచో భజగోవిందం వాలకాన్ని గమనిస్తున్న బాలాజీ - 'వాటే గొప్పమనసు' అంటూ అతనితో గొంతు కలిపి వెటకారంగా అని గుంపువెనక నక్కాడు.



తన భజనను మరెవరో అనుకరించటం చూసి ఖంగుతిన్నాడు భజగోవిందం. కొత్తగా వినిపించిన స్వరం ఎవరిదా అని గోపాల్ కూడా అటు చూశాడు. ఎవరూ కనిపించలేదు.

మళ్ళీ మొదలెట్టాడు గోపాల్.

"మీరు గమనించే ఉంటారు. సంప్రదాయసిద్ధంగా ఉండాలనే ఐడియాతో ఇవాళ డ్రెస్ కూడా వెరైటీగా వేశా." అంటుండగానే భజగోవిందం అందుకుని "ఆహా! వాటే బ్యూటిఫుల్ ఐడియా" అని పొగిడాడు.

ఇలా తన ప్రతి మాటకూ భజగోవిందం అడ్డుతగులు తుండటం చిరాగ్గానే ఉన్నా. అలవాటైంది కాబోలు, ఒకసారి గుర్రుగా చూసి 'థాంక్స్' అన్నాడు గోపాల్.



పిల్లా పాపా, యువకులు, వృద్ధులు దాదాపు ఏభైమందితో పాటు చేరడంతో వాతావరణమంతా కోలా హలంగా తయారైంది. గోపాలకృష్ణకు భజనచేసి మెప్పుపొందాలని ఆయన భృత్యులంతా తహతహ లాడుతున్నారు.వారిలో అగ్రతాంబూలానికి

అర్హుడైన భజగోవిందం గోపాలకృష్ణ ముందు వాయునందనుడిలా మోకరిల్లి "సార్.. నాదో చిన్న రిక్వస్టు" అన్నాడు "చెప్పండీ". అన్నాడు గోపాలకృష్ణ. "అసలు కృష్ణాష్టమి అంటే ఏమిటో సెలవిచ్చి మా కళ్ళు తెరిపించండి సార్" అడిగాడు భజగోవిందం భక్తిభావంతో ఊగిపోతూ.



"తూర్(ష్యూర్)" అని తల ఊపి "అసలు కిట్నాట్టమి అంటే ఏమిటంటే......" గోపాల్ చెబుతుండగా 'హియర్ హియర్' చప్పట్లు కొట్టాడు బాలాజీ, అతని వంక అదోలా కోపభావంతో చూశాడు గోపాల్.

"సారీ సార్...ప్లీజ్ క్యారీ ఆన్" అన్నాడు బాలాజీ. "నెవ్వర్ మైండ్ .. అసలు కిట్నాట్టమి అంటే ఏమిటంటే".. చెప్పబోతుండగా "చెప్పండి సార్.. చెప్పండి సార్" చప్పట్లు కొట్టి మళ్ళీ భంగం కలిగించాడు బాలాజీ.

అతను కావాలనే అలా డిస్టర్బ్ చేస్తున్నట్టు అర్థమైంది గోపాల్‌కు. కానీ ఏం చెయ్యాలో తోచలేదు. పళ్ళు కొరుక్కుంటూనే 'అసలు కిట్నాట్టమి అంటే ఏమిటంటే.." అనగానే 'నోర్మ్మయ్' అన్నకేక వినిపించింది.

కోపం అణుచుకుంటూ అటు తిరిగాడు గోపాల్. బాలాజీ ఒక పిల్లాడిని ఎత్తుకుని "నోర్మ్మయ్.. నోర్మ్మయ్యమన్నానా" అని మందలిస్తున్నాడు బాలాజీ. గోపాల్ సహనం నశించింది.తన భార్యతో గోపాల్ అతి చనువుగా మాట్లాడటం మరీ ఆత్మీయంగా వ్యవహరించడం బాలాజీకి నచ్చడంలేదు.తన భార్యమీద అతనికి మోజుందనని అపార్థంచేసుకున్నాడు. కానీ బయటపడలేక విజ్ఞత కోల్పోయి ఈ విధంగా ప్రవర్తిస్తున్నాడు.



గోపాల్‌కు కోపం వచ్చిందని అర్థం కాగానే 'సారీసార్' వ్యంగ్యంగానే అన్నాడు బాలాజీ.

ఇక లాభం లేదని గ్రహించి "అసలు కిట్నాట్టమి అంటే కిట్నుడి బత్తడే" అని ఏకబిగిన చెప్పేశాడు గోపాల్.

"అహాహ..ఓహోహో.. వాటే అబ్జర్వేషన్! వాటే బ్రెయిన్!" వెంటనే అన్నాడు భజగోవిందం పాట అందుకుంటూ.

ఇదే అదునుగా భావించి శ్రీకృష్ణుని 'రంకుభాగవతాన్ని పాటగామలిచి పరోక్షంగా గోపాల్ మీర నిందాస్త్రాలను విసురుతూ తాను పాట ఆరంభించాడు బాలాజీ.

**మాయదారి క్రిష్ణయ్యా**
**ఎంతటివాడో ఓరయ్యో**
**నాటకాల బూటకాలనాటుగాడు వాడు ఓరయ్యో**
**ఆడదాన్ని చూసి-ఆగలేడువాడు**
**జంటకోరి వెంటపడతాడు**
**ఆశరేపుతాడు ఊసులాడుతాడు**
**రాసక్రీడలాడు మంత్రగాడు తంత్రగాడు ॥మాయదారి॥**

అందరూ కోరస్ పాడుతున్నారు. కొంతమంది అమ్మలక్కలు స్టెప్పు వెయ్యడానికి రఘూన్నీని రమ్మని పిలిచారు. రఘూన్నీ సిగ్గుపడి కోమలాదేవిని కూడా లాక్కొచ్చింది. ఇద్దరూ కలిసి పాటకు అనుగుణంగా అడుగులు వేయ సాగారు. వారిద్దరినీ పరవశంగా చూశాడు గోపాల్. పావం.. అతని మననులో ఏ కల్మషమూ లేదు. కేవలం ఆనందం! అంతే! బాలాజీ మదిలో మాత్రం ఆ చూపు అనుమానాన్ని రగిలించింది. 'పనిలేనివాడి బుర్ర దెయ్యాల నిలయం' అని ఊరికే అన్నారా?అందుకే శ్లేషగా అన్నాడు:



**పొరుగింటి పాలు-హరిలోరంగ హరి**
**ఇరుగింటి పెరుగు-హరిలోరంగ హరి ॥పొరు॥**
**మరిగినాడు వెన్నదొంగ**
**ఆ పాలకడలి-యజమానుడైనా ॥2॥**
**పరుల పాడి కోరనేల?**

అంటూ కోరగా రఘూన్నీ వైపు చూశాడు...భక్తిమనసుతో పురుగుతొలుస్తున్నదన్న విషయం తెలియని రఘూన్నీ అమాయకంగా అందంగా నవ్వింది.

**ఎంతవారికైన ఎదుటి సొమ్ము తీపి**
**ఏమి దేవుడండి- అన్యులాస్తి మోజు జాస్తి ॥మాయదారికిష్ణయ్య ॥**

బాగా డబ్బున్న, అందమైన భార్య, కావలసినవన్నీ ఉన్నా తన భార్యమీద గోపాల్ మోజుపడుతున్నాడని మనసులో మండిపోతున్నాడు బాలాజీ. గోపాల్ చిన్నపిల్లలతో కోలాటమాడుతున్నాడు. ఇద్దరు పిల్లలు కోలాటపు కొమ్ములు రఘూన్నీకి ఇచ్చారు. గోపాల్ అందరితో కోలటమాడుతూ రఘూన్నీతోకూడా రెండుసార్లు కొమ్ములు కలిపాడు. బాలాజీకి తిక్కరేగింది. అందుకే వ్యంగ్యబాణాలు విసిరాడు.

**పదహారువేల-హరిలోరంగ హరి**
**సతులున్నవాడు-హరిలోరంగ హరి**
**రాధనేల వీడడంట?**
**ఆ మేనయత్త-తొలివలపు ఖాతా**
**మొదటి ప్రేమ మరువడంట**

తన భార్యను కాలేజీలో ప్రేమించిన గోపాల్ ఇంకా ఆవిషయం మర్చిపోలేదని బాలాజీ భావన. కానీ గోపాల్ దృష్టిలో నేడు తన భార్య సోదరి స్థానం పొందిందని బాలాజీకి తెలియదు. అది గ్రహించలేక-



**వాడీ దివ్యలీల- కావ్యగీతమాల**
**చెప్పినాను చాల- పాడుకోండి**
**భక్తులాల ॥మాయదారి॥**
**గోపాలకృష్ణుడు -పక్షి**
**గోవిందకృష్ణుడు-పక్షి ॥గోపాల॥**
**గోపాలకృష్ణుడు పక్షివాహనుడై**
వెడలె

పాట అయిపోగానే ఉట్టి కొట్టడం ఆరంభమయింది. అందీ అందనట్లున్న ఉట్టిని కొట్టడానికి ఎగురుతున్నాడు బాలాజీ. అందరూ మగ్గులతో రంగునీళ్ళు కొడుతున్నారు. అలా అయిదారుసార్లు ఎగిరిన తరువాత బాలాజీ ఉట్టికొడతాడని భయంపట్టుకుందో ఏమో, భజగోవిందం బాలాజీని వెనక్కునెట్టివేసి గోపాల్‌ను తెచ్చాడు. ఎగరడం యజమానికి శ్రమవుతంరిన తలచి ఒక స్టూల్ తెచ్చివేశాడు. గోపాల్‌ను బలవంతంగా ఎక్కించాడు.

గోపాల్‌ను ఉట్టికొట్టనివ్వరాదని పట్టుతో బాలాజీ ఉట్టితాడును లాగుతున్నాడు. ఒక నిముషంపాటు చూసి, యజమాని చేతుట్టికొట్టించి మెప్పుపొందాలని భజగోవిందం బాలాజీని నెట్టివేసి తాడుతానే బాగా లూజుచేసి ఉట్టిని గోపాల్ చేతికి అందుబాటు లోకి తెచ్చి గబగబా కర్రతో తానే కుండపగలగొట్టడం, సిబ్బంది అంతా గోపాల్‌కు జయజయ ధ్వానాలు చేస్తూ భుజాల మీద ఎక్కించుకుని ఊరేగింపుగా తీసుకెళ్ళారు. ఆదృశ్యం చూసిన బాలాజీ గుండె మండింది.



-(ఇంకావుంది)

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



21

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్ చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్ట చెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి ఆండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక ఒప్పుకున్న వెంకట్రావు దంపతులచేత తూతూ మంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడతాడు వెంకట్రావు. ఎంతసేపటికి లైను కదలదు. అక్కడకు వచ్చిన వారందరికి ఆకలి దహించి వేస్తూ వుంటుంది. అయినా పెసర్దోస్ గ్రూపు వారు చెప్పిన ధరలు విని ఎవరూ కొనటానికి సాహించరు.

**(ఇక చదవండి)**

**టైం** పది గంటలయింది. బండివాళ్ళు అక్కడే అటూ ఇటూ బండిని తిప్పుతున్నారు.

"బాబూ... రేట్లేమైనా తగ్గించగలరా?" అడిగాడొకాయన ధైర్యం చేసి.

"సారీ... సర్... అది మా చేతుల్లో లేదు. ఈ రోజు ఈ రేట్లకే అమ్మాలని జర్మనీ నుంచి ఆదేశాలు అందాయి."

"ఆ రేట్లకు భయపడి ఎవ్వరూ కొనకపోతే?"

"కంపెనీకి లాస్. దాన్ని ఎలా పూడ్చుకోవాలో వాళ్ళే చూసుకుంటారు."

"అంత రేట్లు చెబితే ఎవరూ పట్టుకోరా?"

"ఎందుకు పట్టుకుంటారు? మా ఉత్పత్తులు మావి. మా ఇష్టమొచ్చినట్లు అమ్ముకుంటాం. కొని తీరాలని ఎవరినీ బలవంతం చెయ్యడం లేదు కదా."

పది నిముషాలు గడిచాయి. ఆకలికి తట్టుకోలేక కొంతమంది సందిగ్ధంలో పడ్డారు. దానికి తోడు క్యాంటిన్ కుర్రాళ్ళు వీరి ముందే చట్నీలో తిరగమోతలు వేస్తున్నారు. వేసిన పుడల్లా కమ్మని వాసన 'గుప్పు' మని కొడుతున్నది. సాంబారు కలియబెడుతుంటే పప్పు వాసన ముక్కుల్లోకి దూరుతూ పేగుల్ని మెలిబెడుతున్నది. ఇడ్లీ పాత్ర మూతను రెండు నిముషాలకోసారి ఎత్తిపెడుతుంటే ఇడ్లీ ఆవిర్లు లాలాజలాన్ని ఊరిస్తున్నాయి. కాలుతున్న పెనం మీద వేళ్ళతో నీళ్ళు చిలకరిస్తుంటే 'సుయ్ సుయ్' మని శబ్దం వస్తూ నాలుకను రెచ్చగొడుతున్నది. ఉల్లిపాయలు, అల్లం, పచ్చి మిర్చి కసకస శబ్దం చేస్తూ సన్నగా తరుగుతుంటే ఆ వాసనకు అందరూ గుటకలు మింగుతున్నారు. చిక్కని డికాక్షన్‌ను వీరి ముందే గ్లాసులతో నురగలొచ్చేట్లు తిరగబోస్తున్నారు.

జనాన్ని రెచ్చగొట్టడానికి కావాలనే వారు అలా చేస్తున్నారని అందరూ గ్రహించారు. వాటికి లొంగిపోవడానికి ఎవరికీ మనస్కరించడం లేదు.

పదిన్నరయింది. కుర్రాళ్ళు అక్కడ్నుంచి వెళ్ళలేదు. తమ పనులను ఆపలేదు.




"దూరం నుంచి వడలను చూడగానే నోరూరింది. రేటు వినగానే గుండె దడదడలాడింది. నా తరంలో ఇంతింత రేట్లు వింటానని కలలో కూడా అనుకోలేదు." నీరసంగా అన్నాడు. టైపిస్టు.

"నిన్ననే మా ఆవిడ పూరీలు చేసి ప్లేటులో డజను పెట్టిస్తే పూరీలు పొంగలేదని మా ఆవిడ చెంపలు పగలగొట్టాను. ఇప్పుడు తెలుస్తున్నది వాటి విలువ." ఓ నడివయస్కుడు కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

"పావుకిలో ఉల్లిపాయలు తరిగి మా ఆవిడ ఊతప్పం వేసిస్తే ఉల్లిముక్కలు చాలలేదని విసిరి నేలకేసి కొట్టాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు." ఘొల్లుమన్నాడు మరొకాయన.




కనీసం కాఫీ తాగుదామనిపించింది వెంకట్రావుకు.

"కప్పు కాఫీ ఎంత?" అడిగాడు.

"సింగిల్ కాఫీ ముప్పై రూపాయలు. ఫుల్లయితే ఏభై రూపాయలే. టీ సింగిల్ ఇరవై, ఫుల్ నలభై. బ్రూ కాఫీ తొంభై, హార్లిక్స్ నూట ఇరవై రూపాయలు మాత్రమేనండీ..." జవాబిచ్చాడు బండివాడు.

గుండెలు బాదుకున్నారంతా.

"ముప్పై రూపాయలకు పావుకిలో కాఫీ పొడి వస్తుంది."

"నలభై రూపాయలకు అరకిలో టీ పొడి వస్తుంది."

"తొంభై రూపాయలకు నూటాభై గ్రాముల బ్రూ వస్తుంది గదయ్యా."

"నూటరవై రూపాయలకు ముప్పావు కిలో హార్లిక్స్ కొనొచ్చు."

అందరూ కామెంట్లు చేశారు.

"మాట్లాడరేవయ్యా" అరిచాడు వెంకట్రావు.

"సారీ సార్... వాదనలు చెయ్యడం పెసర్డోస్ గ్రూపు రూల్సుకు విరుద్ధం. మేము ఎంతో వినయ విధేయతలతో మెలగాలని మాకు ట్రెయినింగిస్తారు. ఒక వేళ భూమి గుండ్రంగా కాదు నలుచదరంగా ఉంటుంది అని మీలో ఎవరైనా అంటే మేము సరే అంటాం తప్ప అది తప్పని వాదించం. మీరు చెప్పినట్లు అవి ఆయా ధరలకు వస్తే రావచ్చు. దానికి మేము బాధ్యులం కాము." చెప్పాడు బండి మేనేజర్.

"రోజుకు పదిసార్లు కాఫీ తాగేవాడిని. నిన్న మా ఆవిడ కాఫీ ఇచ్చినపుడు డికాక్షన్ పల్చగా ఉందని చావగొట్టి కాఫీని మోరీలో పారబోశాను. హయ్యో.... దాని విలువ ఏభై రూపాయలా? ఘొల్లుమన్నాడో యువకుడు.

క్యూ చాలా మందకొడిగా జరుగుతున్నది. అందరి చూపులూ టిఫిన్ల వైపే ఉన్నాయి. కానీ ఎవ్వరూ సాహసించి ఆర్డరివ్వలేక పోతున్నారు.

బండివాళ్ళు కొత్తిమీర కట్టలు సన్నగా తరుగుతున్నారు. దాంతో వాసన ఘుమాయించి కొడుతున్నది.

వెంకట్రావు అసలే భోజన ప్రియుడు. ఆ దృశ్యం చూసి తట్టుకోలేకపోయాడు. కాసేపు లెక్కలు వేసుకున్నాడు. జేబులోంచి డబ్బులు జారిపోయాయని, పర్సు కొట్టేశారని, ఎవరికైనా దానం చేశానని, దేవుడి హుండీలో వేశానని ఇలా రకరకాలుగా అనుకుని మనస్సును సమాధాన పరుచుకున్నాడు.

'బాబూ... అర ఇడ్లీ, ఒక స్పూను సాంబారు ఇవ్వగలవా?" అడిగాడు గుటకలు మింగుతూ.

"సారీ సార్... మినిమమ్ ఒక్క ఇడ్లీ విత్ టి స్పూన్ సాంబార్, వన్ స్పూన్ ఇడ్లీ. ఇంతకు తక్కువ ఆర్డర్లు తీసుకోవడం పెసర్డోస్ గ్రూప్ రూల్సుకు వ్యతిరేకం." చెప్పాడు బండివాడు.

ఆత్మారాముడు లోపల రంకెలు వేస్తుంటే అందరిలోనూ సహనం చచ్చిపోయింది.

"సింగిల్ పూరీ..."
"సింగిల్ ఇడ్లీ"
"ప్లెయిన్ దోసె"
"సింగిల్ ఉప్మా"
అందరూ అరవసాగారు.

ధృఢ కాయులు పరిగెత్తుకుంటూ వచ్చారు. "సార్... తొందరపడకండి. అందరికీ అన్నీ సప్లై అవుతాయి. ఎవరికి ఏ టిఫిన్ అందకపోయినా వీరి టెండర్ క్యాన్సిల్ చేసి జర్మనీకి తరిమేస్తాం." అన్నారు.

ఇంతలో ఒక కుర్రాడొచ్చాడు.

"సార్... టోకెన్లు తీసుకోండి. సరిపడా చిల్లర ఇచ్చిముందు టోకెన్లు కొనుక్కోండి. టోకెను ఉన్నవారికి టిఫిన్ గ్యారంటీ." అని పుస్తకం తీశాడు.

అందరి దగ్గరా డబ్బులు తీసుకుంటూ టోకెన్లు ఇవ్వసాగాడు.

"బాబూ... ప్లేటిడ్లీ, ప్లేటు వడ, ఒక కాఫీ ఇవ్వు." అన్నాడొక వ్యక్తి.

అందరూ అతని వంక ఆశ్చర్యంగా చూశారు.

"సార్... టాటా బిర్లాలు తమరికేమైనా దగ్గరి బంధువులా?" అడిగాడు వెంకట్రావు అతనిని.

"అదేం అలా అడుగుతున్నారు? నవ్వుతూ అడిగాడా వ్యక్తి.

"లేదు. ఒకేసారి అంత ఖరీదైన టిఫిన్ ఆర్డరిస్తేనూ..."

"ఓహ్ అదా... అంతకాదులెండి ఏదో తాతగారిచ్చిన ఐదారు ఇళ్ళు, ఓ వెయ్యెకరాల పొలం ఉంది. ఏదో పది కార్లు, ఏభై లారీలను అద్దెకు తిప్పుతూ అలా అలా నెట్టుకొస్తున్నాను. అంతే." అన్నాడాయన.

"అబ్బా..." అనుకున్నారందరూ.

"మరి మీకేం తక్కువని వాస్తుకోసం వచ్చారు.?" అన్నాడు వెంకట్రావు ఆశ్చర్యంగా.

"మొన్న రాయల్ భూటాన్ లాటరీ టిక్కెట్లు ఐదు రూపాయలు పెట్టి మూడు కొన్నాను. వాటిలో ఒకదానికి మొదటి బహుమతి ఐదుకోట్లు వచ్చింది. మిగిలిన రెండింటికి ఏమీ రాలేదు. పది రూపాయలు నష్టం వాటిల్లింది. అందుకని ఇంట్లో ఏదో వాస్తులోపం ఉందని అనుమానం.




అది తీర్చుకుందామని వచ్చాను." చెప్పాడతను.

ఆ సమాధానానికి కొందరి బుర్రలు గంటకు లక్ష కిలోమీటర్ల వేగంతో గిర్రున తిరిగి దభీమని పడిపోయారు. వెంకట్రావు గుండె నూటిరవై సెకన్ల పాటు ఆగిపోయింది. మళ్ళీ తిరిగి పనిచెయ్యడం మొదలుపెట్టినా కొంచెం సేపటిదాకా మామూలు మనిషి కాలేకపోయాడు.

పదిహేను నిముషాలలో బండిమీద పదార్థాలన్నీ ఎగిరి పోయాయి. కాట్ల కుక్కల్లా తన్నుకుంటూ ఎగబడి తిన్నారందరూ.

"సార్ అందరూ జాగ్రత్తగా వినండి. ఒంటి గంటకు లంచ్ ఉంటుంది. మీల్స్ కావాల్సిన వాళ్ళు మాత్రం ముందుగానే బుక్ చేసుకోవాలి. స్పాట్ ఆర్డర్స్ ఆర్ నాట్ యాక్సెప్టెడ్" అన్నాడు బండి మేనేజర్.

"చేసుకోక పోతే..." అడిగాడు వెంకట్రావు.

మధ్యాహ్నాం పన్నెండు గంటలకు జర్మనీ ఎక్ఛేంజ్‌లో ట్రేడింగ్ మొదలౌతుంది. ఇండెక్స్ పెరిగితే రేట్లు తారుమారౌతాయి."

"వాట్!... జర్మనీలో స్టాక్ మార్కెట్ ఇండెక్స్‌కి నీవు పెట్టే భోజనానికి లింకు ఏంటయ్యా?"

"స్టాక్ మార్కెట్ దేశ ఆర్థిక వ్యవస్థకు దిక్సూచి. ఒక దేశ ఆర్థిక పరిస్థితులు ఎలా ఉన్నాయో అని మార్కెట్ ఇండెక్స్ తెలియజేస్తుంది. ఆర్థిక వ్యవస్థ పతనమైతే అన్ని వస్తువులకు కొరత ఏర్పడుతుంది. ఉన్న వస్తువుల ధరలు పెరుగుతాయి. డిమాండ్ ఎక్కువగా ఉండి సప్లయ్ తక్కువగా ఉంటే ద్రవ్యోల్బణం పెరుగుతుంది. ద్రవ్యోల్బణం పెరిగితే ప్రజల కొనుగోలు శక్తి తగ్గుతుంది."

"అబ్బ... అది సరేలేవయ్యా... ఆర్థిక మంత్రులకే పాఠాలు చెప్పేట్లున్నావు. ఇపుడీ సోదంతా ఎందుకు?"

"మా విలువైన కస్టమర్స్ క్షేమం కోరే సార్.. ఎందుకంటే ఇపుడు నాలుగొందలున్న ప్లేటు మీల్స్ ఇండెక్స్ పడిపోతే ఆరొందలు కావచ్చు. అందుకని..."

"అంటే... ఇపుడు ప్లేటు మీల్స్ నాలుగొందలంటావా?" గుడ్లు తేలేస్తూ అన్నాడు వెంకట్రావు.

"యస్సర్" వినయంగా అన్నాడు బండివ్యక్తి.

"ప్లేట్ మీల్స్ అంతుంటే మరి మిగతా వాటి మాటేంటి?" అడాగాడొకాయన.

"చెబుతాం సార్.... ఫుల్ మీల్స్ ఆరువందలు. వెజ్ బిర్యానీ ఏడొందలు. చికెన్ బిర్యాని ముడొందలు. మటన్ బిర్యానీ వెయ్యి రూపాయలు. కర్డ్ రైస్ కేవలం మూడొందల నలభై నాలుగు రూపాయలే. బాయిల్డ్ ఎగ్ నూట ఆరవై రూపాయలు. ఆమ్లెట్ రెండొందలు. నాన్‌వెజ్ కర్రీస్ ఏవైనా ఐదువందలే. వెజిటబుల్ కర్రీస్ అయితే మూడొందలే. పెసర్దోస్ స్పెషల్ జర్మన్ మీల్స్ రెండు వేలా రెండువందలే." చెప్పాడు బండివాడు.

హా కృష్ణా, యదు భూషణా! త్వరగా నీ సుదర్శనాన్ని నా మీద ప్రయోగించి నా తల మొండెం నుంచి వేరు చెయ్యవయ్యా."అరిచి విరుచుకు పడి పోయాడో వృద్ధుడు.

-(ఇంకావుంది)




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ 40/-




స్వర్గీయ ఘంటసాల పాడిన సినీ గీతాల నుంచి 16 మత్తు పాటలను ఎన్నుకుని ఒక ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి.వారు తీసుకువచ్చారు. 'మొదటి పెగ్గులో మజా మజా'(శ్రీమంతుడు), 'నేను పుట్టాను ఈ లోకం మెచ్చింది'(ప్రేమనగర్), 'జగమే మాయ' (దేవదాసు), 'నీదాన నన్నదిరా నిన్నే నమ్మిన చిన్నదిరా'(జయభేరి), 'నేను తాగలేదు నాకు నిషా లేదు'(మనుషులు-మమతలు),' పెదవులపైన సంగీతం హృదయములోన పరితాపం' (పుణ్యవతి), 'ఇలా ఇలా జీవితం పోతే పోనీ ఈ క్షణం'(పరువు-ప్రతిష్ట), 'నీ వెవరో నేనెవరో' (నిండుమనసులు), 'ఎందుకుతాగేది' (పెళ్లి సంబంధం), 'ఇనుకోరా ఇనుకోరా ఈ మల్లన్న మాటే ఇనుకోరా' (వంతాలు-పట్టింపులు), 'నీ లేత గులాబి పెదవులతో కమ్మని మధువులు తాగాలి' (మా యింటి దేవత), 'అయిన వారు నాకెవరు ఒహో విను మిస్టర్'(చివరకు మిగిలేది), 'నిజమైన కలయైనా నిరాశలో ఒకటేలే' (మూగనోము), 'టాటా వీడుకోలు గుడ్‌బై ఇంక సెలవు' (బుద్ధిమంతుడు), 'ఈ లోకము మహా మోసము'(ధర్మపత్ని), 'నిషాలేనినాడు ఖుషి లేనే లేదు'( నవరాత్రి) మొదలైన పాటలు- ఆ 16 పాటలు.

ఈ పాటలన్నీ తెలుగువారికి చిరపరిచితాలే. అయినా ఒక కాన్సెప్ట్‌తో రావటం వల్ల ఎప్పుడైనా రిఫర్ చేసుకోవాలంటే వెతుక్కోవలసిన అవసరం లేకుండా సులువుగా దొరికే సౌలభ్యం ఇలాంటి క్యాసెట్ల వలన వుంది!

ఇలా ఇలా జీవితం, నీవెవరో నేనెవరో, ఎందుకు తాగేది, ఇనుకోరా ఇనుకోరా, అయిన వారు నాకెవరు, ఈ లోకము - వంటి పాటలు మార్కెట్‌లో ఏ కాంబినేషన్‌లో చూసినా అంత సులువుగా లభించవు!




విడుదల : సుప్రీమ్
వెల : రూ 40/-




విడుదల : ఆదిత్యా మ్యూజిక్
వెల : రూ 38/-

# ఆంధ్రాబ్యాంక్ ద్వారా

# శ్రీ షిర్డీ సాయిబాబా నిత్య అన్నదాన పథకం



" అన్నదాన సమం దానం త్రిలోకేషు న విద్యతే " - వ్యాస భగవానుడు

## పథకం యొక్క విశేషాంశాలు

- షిర్డీ దర్శించే భక్తులకు ప్రసాద-భోజనం పెట్టబడుతుంది. (మునులు, సాధు సంత్‌లు, పేదలు, బలహీనులందరికీ ఉచితంగా భోజనం పెట్టబడుతుంది)
- ఈ పథకంలో చేరాలంటే కనీసం రూ.1000/- ఇవ్వాలి.
- ఆదాయపన్ను చట్టం సెక్షన్ 80(జి) కింద ఆదాయ పన్ను మినహాయింపు పొందవచ్చు.

ఈ పథకం క్రింద డ్రాఫ్ట్‌లు, ఏ విధమైన బ్యాంక్ ఛార్జీలు లేకుండా ఆంధ్రాబ్యాంక్ యొక్క అన్ని శాఖలలో ఇవ్వబడును. ఏ ఇతర బ్యాంక్‌లో అయినా "ఆంధ్రాబ్యాంక్ A/c, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, శ్రీ సాయిబాబా సంస్థాన్, షిర్డీ" వారి పేర బ్యాంక్ డ్రాఫ్ట్/చెక్ తీసుకొని ఆంధ్రాబ్యాంక్, షిర్డీ శాఖ, అహ్మద్‌నగర్ జిల్లా - 423109, మహారాష్ట్ర" అనే చిరునామాకు పంపవచ్చు. మరిన్ని వివరాలకు మీ సమీపంలోని ఆంధ్రాబ్యాంక్ శాఖను సంప్రదించండి.



శ్రీ సాయిబాబా సంస్థాన్
షిర్డీ, తాలూకా - రహతా,
జిల్లా : అహ్మద్‌నగర్ - 423109, మహారాష్ట్ర
www.shrisaibabasansthan.org
E-mail : saibaba_anr@sancharnet.in







**విడుదల : ఆదిత్యా మ్యూజిక్**
**వెల : రూ 38/-**

నేటి యువతను ఉర్రూతలూగిస్తున్న ఎన్.టి.ఆర్ హీరోగా , వరసవిజయాలతో శంఖం 'పూరి'స్తున్న పూరి జగన్నాథ్ దర్శకుడుగా శ్రీ భారతి ఎంటర్ ప్రైజెస్ నిర్మించిన 'ఆంధ్రావాలా' ఆడియో క్యాసెట్ మార్కెట్లో అద్భుతంగా అమ్ముడుపోతోంది. సక్సెస్‌నిప్పుడు పూర్తి ఊపుతో అందుకున్న చక్రి ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. ఈ చిత్రంలోని ఆరుపాటల్లో నాలుగు డ్యూయెట్లు, రెండు సోలోలు. వీటిని చక్రి, కౌసల్య గానం చేశారు.

మొదటి పాట 'నైరే నైరే నైనైరే బాబా' పాటకు తెరవెనుక కృషీవలులు చక్రి,భాస్కరభట్ల. క్యాసెట్ విడుదలవగానే తారాజువ్వలా పైకెగసిన పాటయిది. ఛానల్స్‌లో కూడా ఈ పాట బిట్టే చూపించటంతో సినిమావిడుదలకు ముందు నుంచీ అందరినోళ్లలోనూ ఇదేపల్లవి ఆడుతోంది. దాంతో ఈ పాట ఓ హాంటింగ్ ట్యూన్ అయిపోయింది. 'నిండిపోయివుంది గుండెల్లో పటాసే - చాచిపెట్టి కొడితే ఎవడైన మటాషే' లాంటి ప్రయోగాలు ప్రస్తుతం ఎన్.టి.ఆర్ కి వున్న ఇమేజ్ దృష్ట్యా అటు ధనాన్నీ, ఇటు ధన్‌ధనాల్నీ ఏకకాలంలో ఇచ్చే 'లక్ష్మీ' బాంబుల్లాంటివి.

కందికొండ రాయగా చక్రి,కౌసల్య పాడిన 'మల్లెతీగరోయ్.....మనసే లాగుతోంది రోయ్' పాటలో ట్యూన్ ఒక ఎత్తు అయితే పాడే పద్ధతి మరొక ఎత్తు. 'ఈ ట్యూన్‌ని ఇలాగే పాడాలి మరోలా పాడితే హిట్ అవదు' అనే లెవెల్లో విజృంభించి పాడారు చక్రి,కౌసల్య. చూడగా చూడగా చక్రిలో అంతర్లీనంగా ఓ మిమిక్రీ ఆర్టిస్ట్ కూడా ఉన్నాడనిపిస్తోంది. ఆ మధ్య 'ఫూల్స్' సినిమాలో 'బస్సుఎక్కితే కావాలోయ్ బాసు నీకో టిక్కెట్టు' పాటలో ఉదిత్‌నారాయణ్‌లా పాడేడు. ఇప్పుడు ఈ పాటలో సురేష్‌పీటర్‌లా పాడేడు. అదీ ఆకర్షణీయంగానేవుంది. ఇదీ ఆకర్షణీయంగానేవుంది. కందికొండ కూడా ఈ ట్యూన్‌కి యువత రియాక్టవాలంటే ఎలా రాయాలో అలాగే రాశాడు.

భాస్కరభట్ల రాయగా, చక్రి ట్యూన్ చేసి పాడిన 'నిప్పుతునకై నిప్పుతునకై నిప్పుతునకై భగభగలాడెయ్ వాయుగుండం అగ్నిగుండం రెండు నువ్వేరా' పాట (ఈ సమీక్ష కుడి దృష్టిలో) హిట్ సాంగ్ ఆఫ్ ది ఆడియోగా చెప్పుకోవాలి. 'ఎన్.టి.ఆర్. టు ఎన్.టి.ఆర్' లెవెల్లో ఉన్న ఇమేజ్‌ని దృష్టిలో పెట్టుకుంటూ ఇలాంటి పాట రాయాలంటే భాస్కరభట్లలాంటి వర్ధమాన రచయితకి మొట్టమొదట తన సామర్ధ్యం మీద ఎంతో ఆత్మవిశ్వాసం వుండాలి. అందుకు తగ్గ స్థాయిలో పైకి రావాలన్న కసి వుండాలి. ఈ రెంటినీ ఏకకాలంలో ఆవిష్కరించే అవకాశానివ్వ గల చక్రిలాంటి వెన్నుతట్టే సంగీత దర్శకుడు వుండాలి. మళ్ళీ అతనికి వెన్నెముకలా నిలిచే పూరిజగన్నాథ్ లాంటి దర్శకుడుండాలి. మళ్ళీ వీళ్ళందరికీ - పేరు చెబితేచాలు మాస్ టూ క్లాస్ లెవెల్లో ఊపేసే ఎన్.టి.ఆర్. లాంటి హీరో వుండాలి. ఇన్ని కలిస్తే గాని ఇలాంటిపాట పుట్టదు.

'ఇన్‌వాల్వ్ అవుతూ ఈ పాట వింటుంటే రక్తంలో వేగం పుంజుకోకపోతే రక్తప్రసారం లో ఎక్కడో ఏదో అడ్డుకుంటోందన్న మాట' అనే అనుమానాన్ని కలిగించేటంత వేగం, ఉద్వేగం ఉన్నాయీ పాటలో. రజనీకాంత్ నటించిన 'నరసింహ' సినిమాలో 'ఎక్కూ తొలిమెట్టూ - కొండను కొట్టూ ఢీ కొట్టూ' అనే పాటను ఏ ఆర్ రెహమాన్ స్వరపరచిన స్థాయిలో ఉంది ఈ పాటకు చక్రి అందించిన ట్యూన్ ! ఈ 'నరసింహ' పాటలో 'పట్టూ పురుగల్లే - పట్టీ వెంటాడే పులివై - టక్కరి శత్రువు తలత్రుంచీ - సాగర నరసింహ' అనే వాక్యాలు రెహమాన్ ట్యూన్‌లో వింటుంటే అప్పుడెంత ఊపొచ్చిందో అంతే ఊపునిచ్చాడు చక్రి ఈ పాటలో. ఆ 'నరసింహ' పాట ట్యూన్‌నీ, సినిమాలో రజనీకాంత్ సాహసకృత్యాలు చేస్తున్న ప్రతీసారి వినిపింపచేసిన థీమ్ మ్యూజిక్‌నీ - ఇప్పటికీ తల్చుకుని తల్చుకుని మురిసి పోయే వాళ్ళున్నారు. తమ సెల్‌ఫోన్స్‌లో రింగ్ టోన్స్‌గా పెట్టుకున్న వాళ్ళూ ఉన్నారు. తిరిగి అదే క్రేజ్‌ని ఈ 'నిప్పుతునకై' సృష్టిస్తే ఆశ్చర్యపడవలసిన అవసరం అవగింజంతైనా లేదనిపిస్తోంది.

భాస్కరభట్ల రాయగా చక్రి, కౌసల్య పాడిన 'ఉంగా ఉంగా ఉంగా ఉంగా ఊరించిపోకే వయ్యారంగా' పాట మాస్ మసాలా సాంగ్ కనక దినుసులన్నీ ఆ పాళ్ళలోనే పడ్డాయి. పాట రెండవ చరణంలో భాస్కరభట్ల చేసిన 'పదవిన్యాసం' గుంభనంగా ఉన్నా, దాగివున్న గుబాళింపుని దాచిపెట్టలేనివిధంగా వుంది. ఈ పాట బొమ్మ అయితే దానికి బొరుసుగా కందికొండ రాయగా చక్రి,కౌసల్య పాడిన 'కొక్కోకోలా మీసా నీ దిల్ లోకివ్వవె వీసా' పాటను, 'గిచ్చి గిచ్చి గిచ్చి చంపుతోంది గ్రీకుసుందరి' పాటను చెప్పుకోవాలి.

టోటల్‌గా ఈ ఆడియో చక్రి, భాస్కరభట్ల రేంజ్‌ని కమర్షియల్‌గా మరింత పెంచే అడియోగా నిలిచి పోతుంది. ■

## మార్కెట్లో ఉన్న ఆడియో క్యాసెట్లు




విడుదల : ఆదిత్యా మ్యూజిక్
వెల : రూ 32/-




విడుదల : ఆదిత్యా మ్యూజిక్
వెల : రూ 35/-


శ్రీమతి భారతి సమర్పించు
శ్రీ భారతి ఎంటర్‌ప్రైజెస్
ఆంధ్రావాలా
పూరి జగన్నాథ్
పాటల ప్రత్యేకం
గీతి
చక్రి
మార్తాండ్ కె. వెంకటేష్
శ్యామ్ కె. నాయుడు

**రచన : భాస్కరభట్ల రవికుమార్ (1) గానం : చక్రి**

ప: నైరే..... బాబా... హే..హే...హే...
నైరే నైరే నైనైరె బాబా....
నైరే నైరే నైరే బాబా
నేనే నేనే దిల్‌దార్ వాలా...
నాలో చూడూ దమ్ముంది చాలా
నిండిపోయివుంది గుండెల్లో పటాసే
చాచిపెట్టి కొడితే ఎవడైన మటాషే
అబ్బో అబ్బోలబోదిబో దుమ్ముదుమారే
కొట్టూ కొట్టూ గల్లాపట్టూ ఘుమ్ము ఘుమారే
రెచ్చిపోయి రంకెలేస్తే యమ్మయమారే.... ॥నైరే నైరే॥
చ : మీరే నా వాళ్ళయ్యా....బాధలో తోడైవుంటానురా
చెయ్యందిస్తానయ్యా....నేరుగా సాయం చేస్తానురా
కాని పనే లేదు అనే మొండిఘటం నేనురా
శత్రువుల గుండెలలో ప్రాణభయం నేనురా
తిడితే తిట్టాలి....
కొడితే కొట్టాలి
బరిలో దిగాకా....
గెలుపు తలుపు తట్టాలి
మనసే పెట్టాలి....చెలిమే కట్టాలి
మనిషై పుట్టాకా....కలిసి మెలిసి వుండాలి.... ॥నైరే నైరే॥
చ: మంచీ చెడ్డేనురా...సృష్టిలో రెండే కులాలురా
రారో నందామయా...మంచితో జోడికడదామురా
కష్టమనీ నష్టమనీ నువ్వు అలా ఆగకా
గుప్పుమనే నిప్పుసెగై ఉప్పెనలా మారవా
ఉరుమైపోవాలి...
మెరుపై రావాలి
పిడుగే పడేలా...
అడుగు ముందుకెయ్యాలి
చిరుతై దూకాలి...
భరతం పట్టాలి
ఎదురే లేదని చెడుగుడాడుకోవాలి.. ॥నైరే నైరే॥

**రచన: భాస్కరభట్ల రవికుమార్ (3) గానం : చక్రి**

ప: నిప్పుతునకై నిప్పుతునకై నిప్పుతునకై భగభగలాడెయ్
వాయుగుండం అగ్నిగుండం రెండు నువ్వేరా
ధిత్తధింతై ధిత్తధింతై ధిత్తధింతై గణగణ మోగెయ్
ధర్మయుద్ధం నువ్వు సిద్ధం ఎవ్వడడ్డంరా
మాకోసం పుట్టినవాడా నువ్వే మా తోడునీడా
తొడగొడితే గడగడలాడాలా
నువు లేస్తే యముడైనా తలదించాలిరా
అడుగేస్తే ఎవడైనా ఇక చావాలిరా
హే... నీ చూపు మెరిసేటి చురకత్తిరా
నీ మాట కెదురింక లేదందిరా.... ॥నిప్పుతునకై॥
చ: నీ గుండెలో వుంది ఉరిమే గుణం
నీ చేతిలో వుంది పంచే గుణం
నీ వెంట సైన్యంలా కదిలే జనం
నీ కోసమిస్తోంది నీరాజనం
నెత్తురూ మా సత్తువూ కడదాక నువ్వు కాదా
ఎన్నడూ తలవంచకా అనుకుంది చెయ్యరా
ధైర్యమే నీకుందిరా గుండెలో యమదండిగా
మొండిగా జగమొండిగా దండెత్త నువ్వురారా
హే....మా గుండెలో నువ్వు కొలువుండగా
ప్రతిరోజూ మాకింక ఒక పండుగా.. ॥నిప్పుతునకై॥
చ: నేరాలు ఘోరాలు వెంటాడగా
మేమంత చేరాము నీచెంతగా
కష్టాలు కన్నీళ్ళు ముంచెత్తగా
చేయూత నిచ్చావు నీ వంతుగా
చీకటే చెలరేగితే నువు సూర్యుడయ్యిరారా
ఏటికే ఎదురీదగా మగధీరుడవ్వరా
శోకమే తొలగించగా దేశమే పులకించగా
లోకమే గర్వించగా యువరాజులాగ రారా
హే......తెలుగోడు తేజాన్ని చూపించగా
ఎవడైన వెనకడుగు వెయ్యాలిగా ॥నిప్పుతునకై॥

**రచన: కందికొండ (2) గానం : చక్రి, కౌసల్య**

ఆ: ఆ ఆ ఆ ... ఆ ఆ ఆ ... ననసా.... నానన
అ: మల్లెతీగరోయ్ మనసే లాగుతోంది రోయ్
పిట్టనడుమురోయ్ పిల్లా చంపుతోంది రోయ్
ఆ: నవ్వమాకురోయ్ కలలే రువ్వమాకురోయ్
నరము నరములో వేడే పెంచమాకురోయ్
అ: అంతో తోనే ట్రై చేస్తా ఎంతో తో రూటుకు తెస్తా
నాతో తో లేపుకుపోతా లిప్‌స్టిక్ పెదవే లాగేస్తోంది
ఆ: ననసా....హే.....హే... నానన.... హే హే హే
ఆ: అల్లుకోకురోయ్ అలలా గిల్లిపోకురోయ్
అగ్గిపుల్లవై నాలో భగ్గుమనకురోయ్
అ: నడక చూడరోయ్... ఆ.... నైలునదిరోయ్
తాకి చూడరోయ్ నాజూకు వెన్నరోయ్
అమ్మతోడు ఆగలేనురోయ్
ఆ: స్పీడు చూడరోయ్ ముంబాయి రైలురోయ్
చూపు చూడరోయ్ గుండెల్లో ముల్లురోయ్
హత్తుకుంటే మత్తులే హోయ్
అ: గుమ్మా గుమ్మా గుమ్మసోకు హెయ్ ఆడేసుకుందునా ఆడసోకు
ఆ: రెమ్మా రెమ్మా తుంచమాకు హెయ్ ఆటాడుకుందాము హోయ్
అ: వాలుకళ్ళ పోరి వద్దకొస్తవా అడ్డుపెట్టకుండా ముద్దులిస్తావా
ఆ: చీకటయ్యనాక ఇంటికొస్తవా
నిన్ను కౌగిట్లో కమ్మేసుకుంటా అ: ॥మల్లెతీగరోయ్॥
ఆ : హే య హో హో యా
అ: హో హో హో హో
ఆ: తళుకు తళుకుల కిలాడి నువ్వురోయ్
చమకు చమకుల గులాబి నేనురోయ్
లిప్పు లిప్పు లింకు చెయ్యరోయ్
అ: పాలబుగ్గలను పట్టేసుకుంట
ముద్దుకుంపటి పెట్టేసుంకుంట
బుగ్గమస్తు రెడ్డుగుందిలే
ఆ: మామా మామా లాగమాకు
నన్ను మొత్తంగ ముగ్గులో దించమాకు
అ: భామా భామా పాలగ్లాసు ఇక పంచేసుకుందాము హోయ్
ఆ: ఓరచూపుతోటి గిల్లమాకురా పంటిగాటులెట్టి చంపమాకురా
అ: నంగనాచి పిల్లా నాడిపట్టనా
నీ సోకంత కాజేసుకోనా ॥మల్లెతీగరోయ్॥
ఆ: every time he turned and he standed right there
I really don't want you and I really don't care
I can't think imagine no not forever
what he has discovered is much more better ya...ya..

రచన: భాస్కరభట్ల రవికుమార్ **4** గానం : చక్రి, కౌసల్య

కో: హో...హుయ్...హ...హో...హుయ్...హ...
లడకి లడకి లడకి లడకి ॥4॥ లాయ్
అ: ఉంగా ఉంగా ఉంగా ఉంగా
ఊరించిపోకే వయ్యారంగా
ఆ: రంగా రంగా రంగా రంగా
చూడొద్దు బాబోయ్ శృంగారంగా
అ: కథాకళి ఎలా మరీ వైభోగంగా
ఆ: సలామనీ సరేననీ సంతోషంగా
అ: పొద్దున వస్తే దుద్దులు ఇస్తా రాతిరికొస్తే ముద్దులు ఇస్తా ॥2॥
ఇంకా ఇంకా ఎన్నో ఇస్తా హరిలోరంగా
ఆ: రంగా రంగా రంగా రంగా
చూడొద్దు బాబోయ్ శృంగారంగా
అ: చూపులో కొంటెతనం మాటలో గడుసుదనం
దొరగా పడుచుదనం నా కోసమా
ఆ: వుందిలే పెంకితనం గుండెలో మొండితనం
వారెవా మూలధనం నీ సొంతమా
అ: రా...రా....రాణిలా నువ్వే మాగాణిలా
నేనేం చేసినా వద్దనకింకా
ఆ: రావోయ్ రాజులా వున్నా విరజాజిలా
మోతే మోగనీ ముద్దుల ఢంకా
అ: చంపకమాలా చెయ్యందిస్తే బంపర్‌గానే అల్లాడిస్తా ॥2॥
ఆ: ఎడాపెడా హడావిడి భలే సుఖంగా...
అ: ఆకులోపచ్చదనం కోకలో వెచ్చదనం
చెయ్యనా దొంగతనం తిలోత్తమా
ఆ: చూసుకో జాణతనం పాడుకో జానపదం
చేరుకో పూలవనం పురుషోత్తమా
అ: తాజా బాలికా తధిగిణితోం కూడికా
చేస్తా చూడికా తస్సాచెక్కా
ఆ: ఆజా ధీటుగా లేజారే చాటుగా
వేసెయ్ ఘాటుగా తకధిమితక్కా
అ: ముందరకొస్తే ముక్కెరఇస్తా తొందరగొస్తే తక్కినవిస్తా ॥2॥
ఆ: అహో ఉహూ అనాలికా ఉల్లాసంగా..... ॥ఉంగా॥

రచన: కందికొండ **6** గానం : చక్రి, కౌసల్య

అ: ఏ..గిచ్చి గిచ్చి గిచ్చి గిచ్చి గిచ్చి గిచ్చి
గిచ్చి గిచ్చి గిచ్చి గిచ్చి చంపుతోంది గ్రీకు సుందరే
చూపుతోటి వైరసేదొ పంపుతున్నదే ॥2॥
ఆ: హేయ్....అందముంది అందుకే అందుకోరా
గాలమేసి లాగుతుంది విందుకేగా
అ: హేయ్...అదిరింది అందాల మేళా ॥గిచ్చి గిచ్చి॥
ఆ: కావేటి రంగా గుడివాడ దొంగా
దోచేసిపోతె ఎట్ట చెప్పరా నాది లేత గుండెరా
అ: రేపల్లె లచ్చిమి ఇచ్చెయ్యి టచ్చిమి
అల్లేస్త నిన్ను కానుకగా ప్రణాళికగా
ఆ: వయసుల భరతం పడదాం పదరా
సుఖాల తీరం తీసుకుపోరా
అ: తొందర పడకే సుందరవదనా
చేద్దాం పద మరి ప్రేమల భజనా
ఆ: కన్నె తారరో హో...కోరుకుందిరో హో....
వియ్యమందరో కంచి పట్టు చీరరో
అ: తేనెటీగరో హో...కుట్టు తుందిరో హో...
కిస్సుపెట్టినా కస్సుమీదవుందిరో
ఆ: మిస్సయితే అందాలు ఏలా ॥గిచ్చి గిచ్చి॥
కో: ఏ...ఆయ...హో...ఆయ...హైహైహై ఆయ ॥4॥
అ: చెప్పేది సూటిగా చెప్పెయ్యి నీటుగా
ఇచ్చేస్త కద కాదనకా నా కన్నె చిలకా
ఆ: నీదేర చిలకా కంగారు పడకా
కానివ్వు కథ తెరవెనుకా వెనకకు వెళ్ళకా
అ: చేసేస్తాలే అబ్రకదబ్రా రుచి చూపిస్తా మగసిరి దెబ్బా
ఆ: నీలో వాటం ఎంతుందబ్బా ఆటాడకుందాం రా హాయ్ రబ్బా
అ: సబ్బుబిళ్ళరో హో...అగ్గిపుల్లరో హో....
తాకుతుందిరో ఒళ్ళు బగ్గుమందిరో
ఆ: ఆడపిల్లరోయ్ హో....హద్దు దాటెరోయ్ హో....
అంతు చూడరోయ్ అబ్బ అగలేనురోయ్
అ: అడేస్త రంగేళి హోళి ॥గిచ్చి గిచ్చి॥

రచన : కందికొండ **5** గానం : చక్రి, కౌసల్య

సాకీ:కొక్కొకోలా మిస్సా
నీ దిల్‌లోకివ్వవే వీసా
కో: రతరత రతరత....రతరత....
ప: కొక్కొకోలా మిస్సా
నా దిల్ లో ఇవ్వనా వీసా
ఊరించకె సమోసా
నా ఫేవరెట్ అనియన్ దోశా
ఆ: చెయ్యర చెయ్యర వీరా మాయలు చెయ్యర శూరా
కసి కసి చూపులు విసిరి జివ్వున లాగర ధీరా
అ: అట్టంటె ఆగను మళ్ళా అసలుకు ఎసరే పడతా ॥కొక్కొ॥
కో: హేయ్..హేయ్...హేయ్...భభనన...భభనన...భభనన...భభ
ఆ: కన్నెకొడతా చిన్నగ లవ్‌లో పడతా కిస్సే పెడతా కిరికిరి చేస్తా
అ: వన్నెల జింకా టెన్షన్ పెంచకె ఇంకా బెండైపోతే కమిటైపోతా
ఆ: ఊపరపచ్చని జెండా మొదలెట్టర సుందరకాండ కథకానియ్ వేగంగా
అ: అంతగ ఓపిక వుందా వచ్చేస్తా ఎందుకు బెంగా మరి వుండవె సిద్దంగా
ఆ: నింగినేలా కలవాలా కొత్తగా ఏదో జరగాలా
అ: హే...అట్టంటె ఆగను మళ్ళా అసలుకు ఎసరే పెడతా ॥కొకొక్కోలా॥
కో: హో ఏయ్....హో ఏయ్....జిగిజిగితాం...జిగిజిగితాం...జిగిజిగి
ఆ: చెయ్యెపెడతా చెంపను గిల్లే పెడతా
ఓవరు చేస్తే నేనే తాళిని కడతా
అ: వద్దే వనజా చెంతకు రాకే గిరిజా పైపై కొస్తే పిల్లా నీపని పడతా
ఆ: ముందర వున్నది రోజా
కుమ్మేసెయ్ వన్నెల రాజా
తినిపించేసెయ్ కాజా
అ: చికుబుకు చికుబుకు రైలా
అరె నీలో ఇంతటి ఫైరా
ఫైరింజన్ తేవాలా
ఆ: కోపాలెందుకు గోపాలా కొంటెగ పిలిచెర మధుబాలా
అ: ఇట్టంటె ఇడవను ఇంకా ఊడును ఇరుకున పెడతా
॥కొక్కొక్కోలా॥



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.




**తారాగణం**

ఎన్.టి.ఆర్., రక్షిత, సంఘవి, నాజర్, శియాజి శిండే, బ్రహ్మానందం, ఎం.ఎస్.నారాయణ, రాహుల్‌దేవ్, బెనర్జీ, జీవీ, పశుపతి, రామరాజు, చిట్టి, దుర్గబాబు, వేణుమాధవ్, రాజీవ్ కనకాల, ఉత్తేజ్, గణేష్, వినోద్‌బాల, రమాప్రభ, పావలా శ్యామల, బాంబే పద్మ


గిరి


పూరీ జగన్నాథ్


చక్రి


భాస్కరభట్ల


కందికొండ

**సాంకేతిక నిపుణులు**

| | |
|---|---|
| మాటలు | : కోన వెంకట్ |
| పాటలు | : భాస్కరభట్ల<br>రవికుమార్,<br>కందికొండ |
| కాస్ట్యూమ్స్ | : అంజిబాబు |
| మేకప్ | : సుద్దాల రాజు |
| ఆర్ట్ డైరెక్టర్ | : చిన్నా |
| కొరియోగ్రఫీ | : లారెన్స్, కృష్ణారెడ్డి, ప్రదీప్ ఆంటోనీ |
| ఫైట్స్ | : విజయ్ |
| పి.ఆర్.ఒ. | : పులగం చిన్నారాయణ |
| పబ్లిసిటీ | : ఏలె ధని |
| స్టిల్స్ | : అన్ను |
| మేనేజర్ | : యుగంధర్‌రెడ్డి |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : రమేష్ చంద్ర, గాంధీ శ్రీనివాస్,<br>పరశురామ్ నాయుడు (బుజ్జి) |
| ప్రొడక్షన్ డిజైనర్స్ | : సి.మాణిక్‌రావు, జి.సత్యనారాయణ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : వి.వి.బద్రి, ఎల్.అశోక్‌కుమార్ |
| కో -డైరెక్టర్ | : వి.వి.ఎస్.రాంప్రసాద్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : ఎ.రఘునాథరెడ్డి |
| ఎడిటింగ్ | : మార్తాండ్ కె.వెంకటేష్ |
| ఫోటోగ్రఫీ | : శ్యామ్.కె.నాయుడు |
| మ్యూజిక్ | : చక్రి |
| ప్రొడ్యూసర్ | : గిరి |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : పూరి జగన్నాథ్ |

# 22 సంవత్సరాలు వాద్యాలు...

## 'ఫర్ ద ఫస్ట్‌టైమ్' రాఘవ్






నాలుగు సంవత్సరాల వయసులో రాఘవ్‌కు - అతని తండ్రి పుట్టినరోజు కానుకగా ఓ హార్మోనికా(మౌతార్గన్)ను కొనిచ్చారు. ఆ సంగీత వాద్యమే రాఘవ్ సచార్ జీవితాన్ని మార్చేసింది. బహుశా ఆ రోజున అతని తండ్రి కూడా తానిచ్చిన వాద్యం తన కొడుకుకో దారి చూపిస్తుందని ఊహించి వుండరు. నాలుగేళ్ళ వయసులోనే సంగీత వాద్యాల మీద మక్కువ పెంచుకున్న రాఘవ్ - అప్పటినుండీ ఒక్కో సంవత్సరం ఒక్కో వాద్యాన్ని బహుమతిగా ఇవ్వాలని తండ్రితో ఒప్పందం ఏర్పరచుకున్నాడు. ఫలితంగా 22 సంవత్సరాల వయసు వచ్చేసరికి 22 వాద్యాలను ఉపయోగించడంలో ప్రావీణ్యం పొందాడు రాఘవ్. అంతేకాదు అతనో గాయకుడు కూడా! విశేషం ఏమంటే ఈ ప్రతిభనంతా రాఘవ్ సచార్ తన తొలి ఆల్బమ్ 'ఫర్ ది ఫస్ట్‌టైమ్' లో కనబరిచే ప్రయత్నం చేశాడు.

మ్యూజిక్ కంపోజిషన్ అండ్ పెర్ఫార్మింగ్ లో డిగ్రీ పట్టాను ఆస్ట్రేలియాలోని మోనష్ యూనివర్సిటీ నుండి పొందిన రాఘవ్ సచార్ అంతకు ముందు ఢిల్లీ స్కూల్ ఆఫ్ మ్యూజిక్ లో రెండు సంవత్సరాల కోర్సు పూర్తిచేశాడు. అయితే తొలి ఆల్బమ్‌కి కంపోజిషన్ అంతా ఆస్ట్రేలియాలో డిగ్రీ చేస్తున్న సమయంలోనే చేశానని రాఘవ్ చెబుతున్నాడు. తనకిష్టమైన వాద్యకారుడు స్టింగ్‌తో కలిసి పనిచేసే అవకాశాన్ని కొద్దిలో కోల్పోయానని చెబుతున్న రాఘవ్,ఈ ఆల్బమ్‌లో స్టింగ్ 'ఏ థౌజండ్ ఇయర్'ను స్ఫూర్తిగా తీసుకుని 'లుకింగ్ బ్యాక్' పేరుతో ఎనిమిది నిమిషాల బిట్ ని కంపోజ్ చేశానన్నాడు. దీనికి హిందీ గీతాల్ని కూడా జతచేశాడు.

సరిగమ సంస్థ విడుదల చేసిన 'రాఘవ్ ఆల్బమ్' వైవిధ్యభరితమైంది. ఎందుకంటే కేవలం వాద్యగోష్ఠిలా కాకుండా శ్రోతలను అలరించేందుకు తెలివిగా రాఘవ్ కొన్ని పాపులర్ హిందీ పాటల్ని తీసుకున్నాడు. దీని గురించి చెబుతూ "విదేశాలలో ఇన్‌స్ట్రుమెంటల్ ఆల్బమ్స్‌కి ఎంతో క్రేజ్‌వుంది. భారతదేశంలో అది బాగా తక్కువ. ఇక్కడ శ్రోతలు రీమిక్స్‌నే ఎక్కువగా ఆదరిస్తున్నారు. గత్యంతరం లేకనే నేను అదే దారిలో అడుగుపెట్టి నా సొంత వ్యక్తిత్వాన్ని నిలుపుకునే ప్రయత్నం చేశాను. పాపులర్ అయిన పాత పాటలతో మొదలుపెట్టి... నిదానంగా నాదైన శైలిని వాళ్ళకి రుచి చూపించేలా చేశాను" అని అన్నాడు.



మొత్తం 22 వాద్యాలపై తనకు పట్టువున్నా అవసరం మేరకే తొలి ఆల్బమ్‌లో తను ఉపయోగించానని చెబుతూ "ఇంత చిన్న వయసులో 22 వాద్యాల మీద పట్టా? - అనే సందేహం రావడం సహజం. నేను అన్నింటిలో నిపుణుడినని చెప్పను. కొన్నింటిలో ప్రవేశంవుంది అంతే. ఈ ఆల్బమ్‌లో మాత్రం దాదాపు పది వాద్యాలను నేను స్వయంగా ఉపయోగించాను. అన్నింటిలో నాకు శాక్సోఫోన్, ఫ్లూట్ అంటే బాగా ఇష్టం. అలానే పాశ్చాత్య సంగీతమన్నా ఎంతో ఆసక్తి. అందువల్లే నేను ఆస్ట్రేలియాకి అధ్యయనం కోసం వెళ్ళాను" అని రాఘవ్ చెబుతున్నాడు.

"అక్కడ నుండి రాగానే సంతాను మొత్రాతో కలిసి పని చేశాను. గాయని శుభాముద్గల్ ఆల్బమ్‌కి, వైవా పాప్‌గ్రూప్‌కీ నా సహకారం అందించాను. సంగీత త్రయం శంకర్, ఈషన్, లాయ్‌తో కలిసి 'కల్ హో నా హో' చిత్రానికి నేపథ్య సంగీతమందించాను. త్వరలో విడుదల కానున్న 'ఖాకీ' చిత్రానికి వర్క్‌చేశాను. దానికి ముందు పెప్సీ, ఎసి బ్లాక్, హోండా తదితర సంస్థలకి జింగిల్స్ చేశాను. అలానే జీ ఇంగ్లీష్ ఛానల్ కి కొన్ని సిగ్నేచర్ ట్యూన్స్ అందించాను. ఈ సమయంలోనే అతుల్ చురామణి పరిచయం అయ్యారు. ఆయన అప్పట్లో వర్జిన్ రికార్డ్స్‌తో వుండేవారు. ఎప్పుడైతే అక్కడినుండి హెచ్‌ఎంవి సరిగమకు వచ్చారో- నాలో ప్రతిభను వెలికి తీసే



- 1981 - జూలై 24న రూర్కెలాలో రాజేందర్‌కుమార్ సచార్, ఉషాసచార్ దంపతులకు మూడవ సంతానంగా రాఘవ్ జన్మించాడు.
- మౌంట్ సెయింట్ మేరీస్ స్కూల్ లో సీనియర్ సెకండరీ ఎడ్యుకేషన్ పూర్తి చేశాడు.
- 1999-2002 లో ఆస్ట్రేలియా, మెల్‌బోర్న్ నుండి మ్యూజిక్‌లో బ్యాచ్‌లర్ డిగ్రీని పొందాడు. శాక్సోఫోన్,ఫ్లూట్ ప్రధాన వాద్యాలుగా మ్యూజిక్ పెర్ఫార్మెన్స్, కంపోజిషన్ లో స్పెషలైజేషన్ చేశాడు.
- 1996 నుండి 2000 వరకూ సొంత బ్యాండ్ 'కంజోనా' తో దేశవ్యాప్తంగా ప్రదర్శనలిచ్చాడు.
- మోనష్ ఇంటర్నేషనల్ ఛాంబర్ తరపున సౌత్ కొరియా, తైవాన్, హాంకాంగ్, సింగపూర్, మలేషియా లలో ప్రదర్శనలిచ్చాడు.
- ఆఫ్రికా, అరేబియా, జపాన్, ఇండోనేషియాలకు చెందిన సంప్రదాయ సంగీతాలలో రీ-మిక్సింగ్ చేసే సామర్థ్యాన్ని పొందాడు.
- కేవలం సంగీతానికి, వేదికలకే పరిమితం కాకుండా టెన్నిస్, స్క్వాష్, బ్యాడ్మింటెన్,గోల్ఫ్ ఆటలలోనూ ప్రవేశం వుంది.
- విస్తృతంగా పర్యటించటం, కొత్తవారితో స్నేహంచేయటం, సంగీతం గురించి భావాలను పంచుకోవటం తద్వారా తనని తాను మెరుగుపరుచుకోవటం ఇష్టమైన విషయాలు.

పని పెట్టుకున్నారు. మొదటి ఆల్బమ్ 'ఫర్ ద ఫస్ట్‌టైమ్'లో నాలోని వైవిధ్యాన్ని శ్రోతలకి తెలియచేయాలన్నది నాలోని ఆలోచన. అందుకనే కేవలం ఇన్‌స్ట్రుమెంటేషన్ కాకుండా పాపులర్ హిందీ పాటల పల్లవులలో నాలుగు బిట్స్‌ను కంపోజ్ చేశాను. చిన్నప్పటినుండీ నేను హిందీ పాటలు బాగావింటూ వుండేవాడిని. ఆర్.డి.బర్మన్ అభిమానిని కూడా. అందువల్ల ఆయన పాటల్నే తీసుకున్నాను.

ఈ ఆల్బమ్‌లో 'ఓ హసీనా....' ,'దిల్‌బర్ దిల్‌సే ప్యార్..', 'రాత్ బాకీ..' 'ఓ మేరే సోనారే...' పాటల్లోని పదాలు వినిపిస్తాయి. అయితే ముందు చెప్పినట్టుగా ఇది రీమిక్స్ కాదు. నాదైన వాయిద్యాలను ఉపయోగించి చేసిన 'ప్రీమిక్స్' అనుకోవచ్చు - మూడు మాత్రం పూర్తిగా నా సొంత రాగాలే వున్నాయి. ఒకటి ''స్ట్రింగ్ ఇన్‌స్పిరేషన్‌తో చేసిన బిట్ ..." అని వివరించాడు. రెండేళ్ళలో మొత్తం మూడు ఆల్బమ్స్ తీసుకు రావాలనే ఒప్పందాన్ని హెచ్ఎంవి తో కుదుర్చు కున్నట్టు రాఘవ్ తెలిపారు.

ఈ కొత్త ఆల్బమ్‌లో కొన్ని పాటల్ని తానే పాడినా - వాద్యకారునిగానే తానెక్కువ సంతృప్తిని పొందానని రాఘవ్ చెబుతూ ''ప్రేక్షకుల సమక్షంలో వేదికపై - నా ప్రతిభను ప్రత్యక్షంగా నిరూపించుకోవడమంటే ఎంతోఇష్టం. వారి స్పందన అప్పటికప్పుడు తెలుసుకుంటూ విభిన్నమైన వాద్యాలను ఉపయోగించటంలో ఎంతో ఆనందం పొందుతాను'' అని అంటున్నాడు. అంతర్జాతీయ వాద్య కళాకారులతో కలిసి ప్రదర్శనఇవ్వడం, తనకుంటూ ఓ అంతర్జాతీయ మ్యూజిక్‌బ్యాండ్‌ను ఏర్పాటు చేసుకోవడం, సినిమాకు సంగీతాన్ని అందించటం తన కోరికలని రాఘవ్ చెబు తున్నాడు.

వివిధ కారణాలవల్ల మూడు సంవత్సరాల కాలవ్యవధిలో దాదాపు 1800 కోట్ల రూపాయల నష్టాన్ని చవిచూసిన భారతీయ సంగీతరంగంలో ఇప్పుడు కొత్తదనాన్ని అందించే ప్రతిభావంతుల్ని ప్రోత్సహించాల్సిన అవసరం ఎంతైనా వున్నదని హెచ్ఎంవికి చెందిన అతుల్ చురామణి అంటున్నారు. అటువంటి ప్రతిభావంతులలో రాఘవ్ 'దేవుడిచ్చిన కానుక' అన్నది ఆయన అభిప్రాయం.

**- వి. అరుణ సత్యవతి**

---

# బాణీ ముత్యాలు

**సేకరణ :**
**పి.గిరి,హైదరాబాద్**


సిరివెన్నెల సీతారామశాస్త్రి

ఆశలు రేపినా అడియాశలు చూపినా
సాగే జీవితం అడుగైనా ఆగదుగా
నిన్నరాత్రి పీడకల నేడు తలుచుకుంటూ నిద్రమానుకోగలమా
ఎంతమంచిస్వప్నమైనా అందులోనేవుంటూ లేవకుండా ఉండగలమా

**చిత్రం :చిరునవ్వుతో**
పాటపల్లవి : సంతోషం సగం బలం


చంద్రబోస్

ఉదయం ముందర చీకట్లు
విజయం ముందర ఇక్కట్లు
రావడమన్నది మామూలు

**చిత్రం :బడ్జెట్ పద్మనాభం**
పాటపల్లవి : ఎవరేమీ అనుకున్నా నువ్వుండే రాజ్యాన


భాస్కరభట్ల రవికుమార్

ఉప్పెనెప్పుడూ చెప్పిరాదురా ఇంటి చుట్టమల్లే
వచ్చినప్పుడే వెన్నుచూపకా ఎదురుతిరుగు నువ్వే
ఊరికొక్కడో నూటికొక్కడో నిప్పులాగ వుంటే
దారుణాలకు అక్రమాలకు దారివుండదంతే
ఆవేశముంటే సరిపోదు కదరా...ఆలోచనే తొలిగెలుపౌనురా
రాజాలాగా నువ్వూ తలవంచకుండాలీ
చచ్చేలోగా ఏదో సాధించెయ్యాలీ
మనిషంటే మానుకాదు చూడరా...సోదరా
మనకేంటి లాభమంటే కాదురా....సోదరా

**చిత్రం :వీడే**
పాటపల్లవి : ఎదురంటూ లేనే లేని మొనగాడు వీడేలే

జనవరి 6 ఎ.ఆర్.రెహమాన్ పుట్టినరోజు సందర్భంగా...





## కొమ్మ కొమ్మకో సన్నాయి...

# రెహమాను స్వరము పట్టు నాదారవిందములకు....



మంచి కథకు తలవంచి నమస్కరించి స్వరకోశాలను వెచ్చించి ఎంచి ఎంచి ఏడు స్వరాలతో సేవ చేసుకోవాలనే 'చిన్నఆశ'కు మరో పేరు, మారుపేరు, మారనిపేరు ఎ.ఆర్.రెహమాన్. తెలుగులో శ్రీ కె.విశ్వనాథ్, తమిళంలో శ్రీ మణిరత్నం అతని అభిమాన చిత్ర కథా శిల్పులు. రికార్డింగు నిన్న, షూటింగ్ మొన్న ఇవాళ కూడా 'ట్యూన్' యివ్వకపోతే ఎలా? మార్కు నిర్మాతలకు, దర్శకులకు, వెరసి చిత్రాలకు అతను అందరాని దూరం - అతనిది అందమైన స్వరయమునాతీరం.

'ఇంతింతై వటుడింతయై' అన్న పద్యానికి తాత్పర్యంగా కళ్లముందు పెరిగి త్రివిక్రముడైన వామనుడు రెహమాన్. ఒకప్పుడు శేఖర్ కొడుకుగా (వాద్య కారుడు శేఖర్ కొన్ని మలయాళ చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించాడు. శాస్త్రీయ, పాశ్చాత్య స్వరజ్ఞానం ఆర్జించినవాడు.) సీనియర్ సంగీత దర్శకులవద్ద వాద్యకారుడుగా రికార్డింగులలో పాల్గొనేవాడు, దిలీప్‌గా ఈ స్వరాల గిజిగాడు విజయోద్యానంలో రోజూవచ్చి వాలి, చక్రవర్తి రికార్డింగుల్లో పాల్గొంటుంటే ముచ్చటపడ్డ వాళ్ళలో నేనూ ఒక్కణ్ణి.



తన వాద్య వాదన విన్నాణంలో 'చాకు' అనిపించుకున్న ఈ బాల చాకచక్యుడు ప్రాక్ పశ్చిమ సినీ సంగీత గగనంలో దివ్య చకోరంగా విహరించగలడని ఆనాడు ఊహించలేదు.

అంతచిన్న వయస్సులోనే నేను ఏ చెట్టు కిందో కూర్చుని పాట రాసుకుంటుంటే వేరుశనక్కాయలు తింటూవచ్చి నాలుగు నా చేతిలోనూ పెట్టి నళినకాంతి, బహుదారి, ఉదయరవిచంద్రిక రాగాలను గురించి, అందులో త్యాగరాజ స్వామి చేసిన కృతుల గురించి అడిగేవాడు. ఎంతో ఆసక్తితో పాడించుకుని వినేవాడు. మనవ్యాలకించరాదటే, అన్న నళినకాంతి కీర్తన త్యాగయ్య గారు స్వర పరుచుకున్న శిల్పానికి పొంగిపోయేవాడు. 'నేను కాదురా... దీని పూర్తి స్వరూపం తెలియాలంటే పూర్ణచందర్‌తో పాడించుకో' అనేవాణ్ని. మరుక్షణమే పూర్ణచందర్‌తో ఆ పాట వింటూ కనిపించేవాడు.

(ఈ పూర్ణచందర్ అనబడే పూర్ణచంద్రరావు గారు మంచి స్వరజ్ఞాని. మృదు మధుర గాయకుడు. రమేష్ నాయుడు, చక్రవర్తి వంటి వారికి సహాయకుడు, వాయులీన విద్వాంసుడు, బాలమురళికి అంతేవాసి - మంచి విమర్శకుడు.)



అటు తర్వాత రాజ్ -కోటి ద్వయం సంగీత దర్శకత్వం చేపట్టాక వారి ఆర్కెస్ట్రాలో కూడా దిలీప్ పనిచేశాడు. చిన్నతనం, చిరాకు, చిరునవ్వు అన్నీవున్న చిచ్చరపిడుగులా ఉండే దిలీప్ నిరంతరం సంగీత మర్మాలను వెతికి వెతికి వేటాడి పట్టుకోవడానికి ఇంటా బయటా కృషి చేస్తూ ఉండేవాడు. అద్దెకు ఏదో మంచి యిల్లు ఖాళీగా వుందని చెబితే నేను దిలీప్ ఇంటికి వెళ్లాను. కీ బోర్డుమీద ఏదో పనిలో మునిగి వున్నాడు తను. వాళ్లనాన్న శేఖర్ 'అడే- వేటూరి సార్ వందారుడా' అంటే నావైపు తలెత్తి శూన్య దృక్కులతో ఒక నిమిషం చూశాడు. చేతులు స్వరప్రస్థానం చేస్తూనే వున్నాయి. 'ఏమిటి ఇలా చూస్తాడు' అనుకుంటుండగా అప్పుడే ఉలిక్కి పడ్డట్టు, నిద్రలేచినట్టు లేచి 'వాంగో వాంగో' అన్నాడు. ఆ క్షణంలో అర్థమైంది అతను సంగీతానికి ఎంత అంకితమై ఉన్నాడో. అది అన్వేషణో, పరిశోధనో, వేదనో కూడా నాటికీ నేటికీ తెలియరాలేదు. 'చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ' అన్న ప్రహ్లాదుడి లాంటి దిలీపుడు నాకు సినీసంగీత రంగంలో ఆనాడు కనిపించాడు. ఏవో చాటు మాటు మెలోడీల కోసం వెతుకుతున్నట్లు నాతో మాట్లాడుతూనే తన పనిలో తాను కొంతసేపు వుండి అప్పుడు నాతో బైటికి వచ్చాడు.

రెహమాన్ అప్పటికీ యిప్పటికీ కూడా ఒక్కలా వున్న కళాపిపాసి. మంచితనం మరుగునపడని ఎదుగుదల అతనిది. ఎప్పుడో మాటల సందర్భంలో 'పక్కా జెంటిల్‌మన్ అతను' అని ఎవరి గురించో అన్నాను. అది పల్లవిగా ఒక పాటనాకు రాసిపెట్టమని, ఆ మాట చాలాబావుందని అడిగాడు. సందర్భం చూసి 'సూపర్ పోలీస్' చిత్రంలో నేను రాశాను. అది నేను రాస్తే తను ట్యూను చేశాడు. అలాగే 'నగుమోము నగ్మా' పాటకూడా.



తెలుగు 'బొంబాయి' చిత్రంలో 'కన్నానులే' పాట అతనికి ఎంతో యిష్టం. అలాగే 'ఇద్దరు'లో 'శశివదనే శశివదనే' పాట అంటే అతనికి విపరీతమైన యిష్టం. ఆ పాటలో 'స్వరనీలాంబరి నీవా' 'అచ్చొచ్చేటి వెన్నెలతో విచ్చందాలు నవ్వగనే గుచ్చెత్తేటి కులుకుసిరి', 'మదనమోహినీ చూపులలో మాండురాగమేలా', 'క్షణానికో తోడిరాగం' వంటి పదప్రయోగాలు అతనికి ఎంతఇష్టమో నాకు ముద్దులతో తప్ప చెప్పని చనువు అతనిది.

'సఖి' చిత్రంలో 'అలైపాంగెరా' అనే గీతం రికార్డింగు జరిగినపుడు అతను, గాయని కళ్యాణి మీనన్ (రాజేష్ మీనన్ తల్లి) ప్రతిపదాన్ని వింటూ తన్మయులైనప్పుడు నాకు కలిగిన ఆనందం చెప్పలేను. 'సుఖి ఎవ్వరో' అన్న త్యాగరాజు కీర్తన స్వరరచన ఆధారంగా తమిళంలో ఊతుకోట వెంకటసుబ్బయ్య

భాగవతుడు రాసిన, బహుళ ప్రచారం పొందిన గీతం 'అలైపాయుదేకణ్ణా ఎన్ మనం మిగ్ ఆనంద మోగన వేణు గాన మదిల్!'ని మణిరత్నం గారు యధాతధంగా 'సఖి' చిత్రంలోకి ('అలైపాయుదే' తమిళంలో) తీసుకున్నారు. ఇలా అనేక త్యాగరాజు కీర్తనలు స్వరకల్పన యధాతధంగా అనుసరించి తమిళ కవులు రాయడం జరిగింది. ఉదాహరణకు నిన్నే నెరనమ్మినానురా - పంతువరాళి కీర్తనను 'ఉన్నె అరుళే అంబలాడువాయే' అన్న మకుటంతో తమిళంలో కచేరీలలో పాడిన సందర్భాలు నేను విన్నాను.

ఈ పాటనే దాదాపు పల్లవి వరకు అనువాదంగా నేను 'సఖి' చిత్రానికి రాశాను. చరణంలో నా ధోరణిలో నేను రాసి మధ్యలో తమిళ భావమైన 'తెలుగు మాటలు వాగ్గేయ సాహిత్యానుగుణంగా చెప్పించాను. ఇది 'కానడ' రాగంలో (సుఖి ఎవ్వరో - కానడ) స్వరపరచిన గీతం - అందుకే - కాదిలి వేణుగానం కానడ పలికె' అని రాయడం జరిగింది. 'కాదిలి' అంటే ప్రియమైన అని అర్థం. కైటభ దైత్యమర్దనుని కాదిలి కోడలా! (పోతన మహాకవి) - ఇది తమిళభావం. నేను కెనడా వెళ్లినప్పుడు ఆంధ్ర సంఘం వారు టోరంటో నగరంలో ఎంతో అద్భుతంగా బాలికలచేత ఈ పాట అభినయింపచేసి నన్ను ముగ్ధుణ్ణి చేశారు.

అయితే పాటంతా రికార్డు చేయించిన మణిరత్నం చిత్రంలో ఆ పాటను పల్లవి వరకే వుంచడం సంగీత రసికులకు కొంత నిరాశ కలిగించింది. అక్కడ కథన వేగాన్ని దృష్టిలో పెట్టుకుని ఆపని చేశారు.

'అమృత' చిత్రంలో కథ విషాదాంతరంగ. దానికి ఎడబాటు మీటు కన్నీటి కడలి జల తరంగాలు కావాలి అక్షరాలు, స్వరాలూ. మణిరత్నం గారు దగ్గర కూర్చుని రెహమాన్‌ని కూర్చోబెట్టుకుని చేయించిన బాణీలవి. కథ,కథతో పాటు మిగతా సాంకేతిక విలువలు జనానికి పట్టలేదు.

ఎక్కువగా రెహమాన్ తెలుగు చిత్రాలకు సంగీతం చెయ్యని కారణంగా (అతను నేరుగా చేసిన సూపర్‌పోలీస్;గ్యాంగ్‌మాస్టర్ ఈ రెండింటికీ నాపాటలే) నేను అనువాద సాహిత్యమే రాయవలసి వచ్చింది.

రెహమాన్ బాణీలకి అధర చలనాధార అనువాదగీతాలు రాయవలసి నప్పుడు పద ప్రయోగాలు కొత్తరీతులు నేర్చుకునేవి.

1. చిత్రాంగీ చిలక రాత్రీ పగలనక ముక్తాయించు నడుమో
2. అది అరబిక్ కడలందం
3. విప్పారే తామరవే
4. కంట్లో వెలిగె మనసు కానీ మనసు బెణికె
5. చిలకాదేవి కన్నుగీటసాగే
6. కురిసే చినుకా ఎల్లువైనావె ఎద వరకు
7. ఒక కంటిగీతం జలపాతమైతే మరుకన్ను నవ్వదమ్మా

- ఇలా ఎన్నో ఉన్నాయి.

ఈ తరంలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన ఎ.అర్.రెహమాన్ నిగర్వి, ముక్కుసూటి మనిషి. ఇతరులను నొప్పించడం అతనికి చేతకాని పని. మిత్రుడు తమిళకవి వాలి అన్నట్లు అతను 'రఘుమాన్'. రెహమాన్ అన్న పేరులో 'హ' అనే అక్షరాన్ని 'ఘ'గా పలకడం తమిళం. అదివారికి సరళం మనకి గరళం. 'ఎందరో మఘానుభావులు' త్యాగయ్యగారిచేత తవ్వించిన తమిళశబ్దవేదిగా వాలి 'రఘుమాన్' అని చమత్కరించాడు. ఇందులో రెహమాన్ దిలీపత్వాన్ని గుర్తుచేయడమూవుంది. రఘువంశానికి మూలపురుషుడుగా దిలీపుణ్ణి చెప్పుకుంటారు.

నిన్నదినాన్ని చిన్నతనాన్ని మరచిపోని రెహమాన్ గుండెలో గుట్టుగా ఒక కోరిక వుంది. ఆ గుట్టును చప్పుడు చేసి ఈ నాలుగు మాటలతో ముగిస్తాను.

**'నాకు తీరనికోరిక ఒకటిఉంది- అది తీరినప్పుడు మళ్ళీ తెలుగు చిత్రానికి స్ట్రెయిట్‌గా మ్యూజిక్ చేస్తాను. అదే కె.విశ్వనాథ్ గారి చిత్రానికి సంగీతం యివ్వాలని. ఆయనంతటి ప్రతిభావంతుడితో పనిచేయాలని వుంది. అది నెరవేరేటట్లు నువ్వే చూడాలి'** అని నాతోనూ, మిత్రులు శ్రీ యు.వి.పాణి గారితోను అతను రెండు ముడుసార్లు అన్నాడు. ఈ విషయం ఇంతవరకూ నేను విశ్వనాథ్ గారితో చెప్పలేదు.

అందుకు తగిన చేతావరణ పరిస్థితులు త్వరలో రాగలవని ఆశిస్తున్నాను - రెహమాన్‌ను ఆశీర్వదిస్తున్నాను'

**-వేటూరి సుందరరామమూర్తి**

**చిత్రం : అలై పాయుదే (సఖి)**
**రచన-సంగీతరచన : ఊతుకాడు వేంకటసుబ్బు అయ్యర్**
**గానం : హరిణి - బృందం**

అలై పాయుదే కణ్ణా
ఎన్‌మనం మిగ అలైపాయుదే
ఉన్ ఆనంద మోగనవేణు గాన మదిల్
అలై పాయుదే కణ్ణా
నిలయ్ పెయురాదు
సిలయ్ పోల నిన్ఱ్
నేరమావదరి యామలె
మిగ వినోదమాన మురళీదరా......ఎన్‌మనం ॥అలైపాయుదే॥
తెలిందనిలవు పట్టపగల్ పోల్ ఎరియుదే
తిక్క్ నోక్కి ఎన్ ఇరుపురువం నెరియుదే
కనింద వున్ వేణుగానం కాట్రిల్ వరుగుదే
కన్‌గళ్ సొరుగి ఒరు విదమాయ్ వరుగిదే
కదిత్త మనత్తిల్ ఉరుత్తి పదత్తయ్
ఎనక్కు అళిత్తి మగిళ్తవా
ఒరుతనిత్త వనత్తిల్ అణైత్తి ఎనక్కు
ఉనర్చి కొడుత్తి ముగుళ్తవా
కణైకడల్ అలయినిల్ కదిరవన్ ఒళియన
ఇనై ఇరు కళలెన కళిత్తవా
కదరి మణ మురిగి నాన్ అడైక్కవో
ఇదర మాదరొడు నీ కళిక్కవో
ఇది తగుమో ఇది మొరయో ఇది దర్మం తానో
కుళలూదిడు పొళుదు ఆడిడుం
పుళైగళ్ పోలవే మనదిల్ వేదనై మిగవొడు ॥అలైపాయుదే॥

**ఈ పాటను శ్రీ మణిరత్నం కో-డైరెక్టర్ అయిన యు.వి.పాణి గారు పాఠకుల కోసం ప్రత్యేకంగా చెన్నై నుంచి పంపించారు. వారికి 'హాసం' కృతజ్ఞతలు తెలుపుకుంటోంది.**

**చిత్రం : సఖి**
**రచన : వేటూరి**
**గానం : కళ్యాణి మీనన్, హరిణి, కల్పన**

ప: అలై పొంగెరా కన్నా మానసమలై పొంగెరా
ఆనంద మోహన వేణుగానమున
ఆలాపనే కన్నా మానసమలై పొంగెరా
నీ నవరస మోహన వేణుగానమది అలై పొంగెరా కన్నా
చ: నిలబడి వింటూనే చిత్తరువైనాను (2)
కాలమాగినది రాదుర ప్రాయమున యమున మురళీధర
యవ్వనమలై పొంగెరా కన్నా... ఆ... ఆ...
చ: కనుల వెన్నెల పట్ట పగల్ పాల్చిలుకగా
కలువ రేకుల మంచు ముత్యాలు వెలిగే
కన్నె మోమున కనుబొమ్మలటు పొంగె
కాదిలి వేణుగానం కానడ పలికే (2)
కన్నె వయసు కళలొలికే వేళలో..కన్నె సొగసు ఒక విధమై ఒరిగెలే
చ: అనంత మనాది వసంత పదాల సరాగసరాల స్వరానివా
నిశాంత మహీజ శకుంతమరందమెడారి గళాన వర్షించవా
చ: ఒక సుగంధ వనాన సుఖాల క్షణాన
వరించి కౌగిళ్ళు బిగించవా (2)
చ: కడలికి అలలకు కథకళి కలలిడు శశికిరణము వలె చలించవా
చిగురు సొగసులను తలిరుటాకులకు రవికిరణాలే రచించవా
చ: కవిత మదిని రగిలె ఆవేదనో ఇతర భామలకు లేని వేదనో (2)
ఇది తగునో ఎద తగవో ఇది ధర్మం ఔనో (2)
కొసరి ఊదు వేణువున వలపులే చిలుకు
మధుర గాయమిది గేయము పలుకగా ॥అలై॥

సీరియల్ 4

# తాతా ధిత్తై తధిగిణతోం



| పాత్రలు | నటీనటుల సజెషన్ |
| --- | --- |
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో

- జీడిగుంట రామచంద్రమూర్తి



**జరిగిన కథ**

రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహద్దూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుసలాడుతుంటాడాయన. వీరభద్రం పెద్దకొడుకు శ్రీరామ్ పట్నంలో చదువుతూంటే చిన్న కొడుకు లక్ష్మణమూర్తి తండ్రి దగ్గరే ఉండి పదోతరగతి చదువుతూ ఉంటాడు. శ్రీరామ్‌ను అశ్వని ప్రేమిస్తూ ఉంటుంది. తనకు బాకీగా ఉన్న కట్నం బాపతు సొమ్మును రెడీగా ఉంచమని మామ వీరభద్రం కు ఉత్తరం రాస్తాడు రాజేంద్ర. ఆ ఉత్తరం చేరిన సమయంలోనే వీరభద్రం బాల్యస్నేహితుడు చిదంబరం వస్తాడు. -(ఇక చదవండి)




"ఏవమ్మా! చెల్లెమ్మా! - అందరూ కులాసాయేగా? మా వీరభద్రుడితో మాట్లాడేకంటే - నీతో యోగక్షేమాలు విచారించటమే ఈజీగా వుంటుంది. ఏడీ?... మా చిన్నవాడు కనిపించడేం?"

"ప్రయివేటు చెప్పించుకోటానికి వెళ్లాడు అన్నయ్యా!"

"పండక్కి హైదరాబాదునించి అమ్మాయీ అల్లుడూ వస్తున్నారా?" - కాఫీ తాగటం పూర్తయ్యాక అడిగాడు మళ్లీ.

"ఇదిగో... ఇప్పుడే అల్లుడి దగ్గర్నించి ఉత్తరం వచ్చింది.. పండక్కి వస్తారట!".

"అయితే పండగ సందడంతా మీ ఇంట్లోనే వుంటుందన్నమాట!"- చిదంబరం అన్నాడు వీరభద్రాన్ని చూస్తూ.

"సందడి సంగతికేమొచ్చెగానీ - ఇప్పుడొక సమస్య వాటిల్లిందిరా చిదంబరం!" వీరభద్రం గొంతులో దిగులు ధ్వనించింది.

"సమస్యా? ఏమిట్రా అదీ?"

"అలనాడు అమ్మాయిపెళ్లిలో - అల్లుడికి నేను - కట్నం కింద ముప్ఫయ్‌వేలు బాకి పడితిని!"

"ఔనౌను! చెప్పేవ్! త్వరలో ఇచ్చేస్తానంటూ అతనికి కాయితం కూడా రాసిచ్చినట్టున్నావ్‌గా?"

"అదే!... ఆ బాకీ తీర్చమని అల్లుడుగారు ఇప్పుడీ ఉత్తరం ద్వారా తాఖీదు పంపించినారు!... వారు పండుగకు వేంచేసినపుడు - నేను రొఖ్ఖము వారి చేతిలో పెట్టుటకు సిద్ధముగా వుండవలయునట!"

"ఓస్..! ఇంతేకదా?... ఎలా అయినా అది ఇవ్వాల్సిందేగా? ఇచ్చెయ్!.. నీకు ఎద్దైనా ఇబ్బందైతే చెప్పు!.. ఇప్పుడే నా రైతు డబ్బిచ్చాడు... దాన్ని నేను నీకు సర్దేస్తాను... నాకు తర్వాత ఇద్దువుగాని!" - అంటూ జేబులోంచి నోట్ల కట్టలు తీయబోయాడు చిదంబరం.

అతని ప్రయత్నాన్ని వారించాడు వీరభద్రం-

"డబ్బు గురించి ప్రాబ్లమ్ లేదురా!... కానీ, కట్నకానుకలు ఇచ్చుటా, పుచ్చుకొనుటా మా మావల సంఘం నిషేధించింది!" చెప్పాడు.

"ఓఁ!... అదా నీ బాధ? ఎవరికీ తెలియకుండా అల్లుడి చేతిలో పెట్టేయ్.. అప్పుడు గొడవ వుండదు!" సలహా ఇచ్చాడు చిదంబరం.

"వీల్లేదు మిత్రమా! అలా చేసి - ఆత్మద్రోహం గావించుకోలేను!"

"అయితే ఆ మాట అల్లుడితో ఖచ్చితంగా చెప్పేయ్!... అయినా నువ్వసలే 'టెర్రర్'వి కదరా?... నీకు ఎదురుపడి అడిగే దమ్ము నీ అల్లుడికి వుండద్దూ?"

"ఆ మాట వాస్తవమే!... కానీ వానివద్ద బ్రహ్మాస్త్రం వుంటుంది కదా?..."

చిదంబరానికి అర్థంకాలేదు.

"బ్రహ్మాస్త్రం ఏమిట్రా?" అడిగేడు.

"అదేరా!.. ఈ మధ్య దినపత్రికల్లో మనం చూస్తూనే వున్నాం కదా?.."

"దినపత్రికల్లోనా?... ఏమిటీ?.. ఏ విషయం...?"

"వరకట్నపు మరణములు!... ఇప్పుడు నేనా బాకీ తీర్చనిచో, నా కుమార్తె మీద అతగాడు పెట్రోలు పోసి తగులబెట్టి - అనంతరం, తన భార్య ఆత్మహత్య చేసుకొన్నదని ప్రకటించునేమోనని అనుమానముగా వుంది!... ఊరంతా నాకు భయపడుతుంటే - నేను మాత్రం ఈ దశమగ్రహానికి తల ఒగ్గవలసిన దుస్థితి ఏర్పడింది" - దిగులు నిండిన స్వరంతో చెప్పాడు వీరభద్రం.

"మరిపుడు ఏం చేద్దామనుకుంటున్నావ్?"

"అదే దిక్కుతోచడం లేదు!.. నీవు వకీలువి కదా?... కీలెరిగి వాతపెట్టగల దిట్టవి... ఏదో ఒక గట్టి సలహానిచ్చి పుణ్యం కట్టుకో!" - అంటూ ఆశగా చిదంబరం చేతులు పట్టుకున్నాడు.

"సలహా అంటే...." - ఆలోచనలో పడ్డాడు చిదంబరం.

"అవును మిత్రమా! ప్రస్తుతం ఈ పండక్కి - గండం గడిచి గట్టెక్కే ఉపాయం ఏదైనా చెప్పు! ఈ మిత్రుని ఆపద దీర్చు!"....

ఆలోచిస్తూనే చిదంబరం రెండు క్షణాలు అటూ ఇటూ పచార్లు చేశాడు.

"ఆ!!.. ఓ పనిచెయ్యి! ముందు సామదానాన్ని ప్రయోగించు! ఈ ఏడు పంటలు బాగా దెబ్బతిన్నాయని చెప్పి - వాయిదా అడుగు!.. ప్రస్తుతానికి గండం గడుస్తుంది... ఒకవేళ నీ అల్లుడు ససేమిరా అంటే - అప్పుడు దండోపాయం వుండనే వుంది!"

"దండోపాయమా? అంటే?" ఆసక్తిగా చూస్తూ అడిగాడు వీరభద్రం.

అతనికి దగ్గరగా వెళ్లి చెవిలో రహస్యంగా చెప్పాడు చిదంబరం.

"ఈ ఉపాయం ఫలిస్తుందంటావా?" - అనుమానంగా అడిగాడు వీరభద్రం.

"లేడీస్ సెంటిమెంట్‌కి తిరుగుండదు... కనుక మీ ఆవిడ దృష్టిలో పడేలా అలా నాటకం ఆడేవంటే - ఇక తక్కిన కథ ఆటోమేటిగ్గా ఆవిడే చూసుకుంటుంది!"



ఇంతలో వంటింట్లోంచి పార్వతమ్మ వచ్చింది.

"భోజనానికి లే అన్నయ్యా!"

"లేదమ్మా!... ఇంతకుముందే మా రైతు మినప సున్నిపెట్టి - కొబ్బరి బొండాలు కొట్టిచ్చాడు. కడుపు 'ఫుల్'గా వుంది... అయినా కారెక్కి కూచుంటే రెండు గంటల్లో ఇంటి దగ్గరుంటాను!" - చెప్పాడు చిదంబరం.

ఆ తర్వాత మరి కాసేపు వీరభద్రంతో పిచ్చాపాటీ మాట్లాడి, వాళ్ళ దగ్గర శలవు తీసుకున్నాడు.

* * *

శ్రీరామ్ సీరియస్‌గా తలవంచుకుని పరీక్ష రాస్తున్నాడు.

అంతలో అతనిపాదాల దగ్గర ఓ కాగితం వుండ వచ్చిపడింది. ఉలిక్కిపడి చూశాడు.

ఆ కాగితం వుండను తీసుకోమంటూ సైగలు చేస్తోంది - పక్క బెంచీమీద కూర్చుని పరీక్ష రాస్తున్న అశ్విని.

శ్రీరామ్‌కి చెమటలు పోస్తున్నాయి.

ఆ దృశ్యాన్ని వాచర్ గమనించాడు... అతని దృష్టి 'కాగితం వుండ' మీద పడింది.

నెమ్మదిగా వచ్చి దాన్ని తీసి చదివేడు. తనలో తనే ముసిముసిగా నవ్వుకున్నాడు. తర్వాత అశ్విని దగ్గరకు వెళ్లేడు.

"ఎవరికివ్వమంటావ్ చిట్టి తల్లీ?" అడిగేడు.

అశ్విని ఖంగారు పడలేదు... శ్రీరామ్‌ని చూపించింది.

"గుడ్!...మంచి సెలక్షనే!"- అంటూ ఆమెవైపు మెచ్చుకోలుగా చూసి, దాన్ని అతనికి అందించాడు - ముసలి వాచరు.

బెదిరిపోతూనే ఆ కాగితం లోకి చూసేడు శ్రీరామ్... అందులోవున్న వాక్యాల్ని తనలో తనే చదువుకున్నాడు-

"ఇవాళ సాయంత్రం అయిదింటికి పార్కులో కలుసుకోవాలి!... చాలా ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి!"

సాయంత్రం పార్కులో ఆమెను కలుసుకుని - తన మనసులో మాట చెప్పేసి - ఇక ముందెప్పుడూ - తనకలా ప్రేమలేఖలు రాసి వేధించద్దని - హెచ్చరించాలనుకున్నాడు..

సరిగ్గా అయిదయ్యేసరికి పార్కుకి చేరుకున్నాడు శ్రీరామ్.

"నాకు తెలుసు నువ్వువస్తావని!... ఎందుకంటే నువ్వు నన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నావ్ కనుక!" - అప్పటికే పార్కుకి చేరుకున్న అశ్విని - ఐస్‌క్రీం తింటూ శ్రీరామ్‌కి ఎదురుగా వచ్చింది.




శ్రీరాం మాట్లాడలేదు. కోపంతో ఉడికిపోతున్నాడు.

"మాట్లాడవేం?.. నువ్వు నన్ను లవ్ చేయటం లేదా?" - రెట్టిస్తూ అడిగిందామె.

"ఈ విషయంలో ఇక మాట్లాడ వలసింది ఏమీలేదని ఇదివరకే చెప్పాను! ఇప్పుడు మళ్లీ ఆఖరుసారిగా చెప్తున్నాను... ఇలా నా వెంట పడి వేధించకు... మా అత్తయ్యకి ఓ కూతురుంది... ఆ పిల్లను నాకిచ్చి చేస్తానంటూ మా అత్తయ్య ఏనాడో మా నాన్నకి చెప్పింది... అప్పుడు మా నాన్న తనకు మాట కూడా ఇచ్చేశాడు... ఆ మాటకు కట్టుబడి నేను మా అత్తయ్య కూతుర్ని చేసుకు తీరాలి!" - పాఠం వప్పచెప్పినట్టు చెప్పేసి - అక్కడున్న సిమెంటు బల్ల మీద కూర్చున్నాడు శ్రీరామ్.

అశ్విని కూడా - అతని పక్కనే వచ్చి కూర్చుంది.

"మహామహా 'కాన్‌స్టిట్యూషన్స్'లోనే మార్పులూ చేర్పులూ చేస్తున్నారు. అలాంటిది - 'మామూలు మాట' మారిస్తే తప్పా?.. అయినా 'మేనరికాలు ' చేసు కుంటే మూగపిల్లలూ, చెవిటిపిల్లలూ పుడతారట... రేడియోవాళ్లూ టీవీవాళ్లూ - గంటకోసారి - గంటకొట్టినట్టు చెప్తున్నారు." అతన్ని దారికి తెచ్చుకోవాలన్న ప్రయత్నం మానలేదామె.

"చూడండి అశ్వినిగారూ! మీరు నన్ను లైన్లో పెట్టుకోవాలని ఎంత ప్రయత్నించినా - కుదిరే వ్యవహారం కాదు... మా నాన్నగారి మాట కాదని, నేను ఎలాంటి నిర్ణయం తీసుకోను...! నేనేకాదు - మా ఇంట్లో, ఆ మాటకొస్తే మా ఊళ్లో కూడా అందరూ మా నాన్నగారికి భయపడి తీరవలసిందే! అసలు ఆయన ముఖంలోకి చూడాలంటేనే అంతా హడలిపోతారు... ఆయనగారి భాష ఎవ్వరూ వినలేరు!"

"ఎందుకనీ?" అడిగింది అశ్విని వెంటనే.

"అడక్కండి!... అదంతే!... ఆయనగారి 'ఫేస్ వేల్యూ, భాష వేల్యూ' అంత గొప్పవి... ఆ మాటకొస్తే - నేను మా నాన్నగారి ఎదుటపడి, మాట్లాడి ఎంతకాలమైందో తెలుసా?"

అశ్విని ప్రశ్నార్థకంగా చూసింది.

ఇంతలో - శ్రీరామ్ చెప్పాడు మళ్లీ-

"ఇక్ష్వాకుల బారసాలనాడో, అశోకుని దండయాత్రనాడో!... నాకే సరిగ్గా గుర్తులేదు... ఆయన్ని మర్చిపోతానేమోనని - అప్పుడప్పుడు - ఇదిగో ఇలా ఆయన ఫొటో చూసుకుంటూం టాను!" అంటూనే జేబులోంచి తన తండ్రి ఫొటో తీసి ఆమెకు చూపించాడు.

ఆ ఫొటోలోకి పరిశీలనగా చూసింది అశ్విని...

"ఆహా! కుచ్చులకిరీటం ఒక్కటి తక్కువైందన్నమాటేగానీ - శ్రీకృష్ణదేవరాయల్లా కనిపిస్తున్నారు మీ నాన్నగారు!"

"అవును!... అందుకే ఆయన భాషకూడా అదే స్థాయిలో వుంటూంటుంది... ఖర్మం చాలక మీరు నన్ను పెళ్ళి చేసుకుని - మా ఇంటికి కాపురానికొచ్చినా ఆయన భాష వినలేక - మూడోనాడే - నానించి విడాకులు తీసుకుంటారు!" చెప్పేడు శ్రీరామ్.

"మొత్తానికి 'శ్రీరామచంద్రమూర్తి' అని పేరు పెట్టినందుకు - పితృభక్తి పరాయణుడివనిపించుకుంటున్నావ్!" నవ్వేసింది అశ్విని.



"భక్తేమిటి - నా బొంద?,.. భయం"

"అయితే నేనంటే నీకు ప్రేమలేదా?" -నిష్ఠూరంగా అడిగింది.

క్షణంసేపు - 'ఏం చెప్పాలా?' అని ఆలోచించి - తర్వాత - తన పక్కనే వున్న 'రావిచెట్టు'ను చూపించి అన్నాడు -

"మీరంటే నాకు ఈ మహావృక్షమంత ప్రేముంది! ఏం లాభం?... పెళ్లికి దారి తీయని ప్రేమ శుద్ధ వేస్టని మా ఫ్రెండు చెప్పాడు... ఆ విషయం తెలిసుండీ ఇంకా ప్రేమించటం మూర్ఖత్వమనిపించుకుంటుంది... నేను మూర్ఖుడ్ని కాలేను అశ్వినిగారూ!"

"వద్దులే!... అయినా మూర్ఖుడివి నువ్వెందుకవుతావ్?... నేను మూర్ఖురాల్ని!... మూర్ఖత్వం నాదీ!... అందుకే నువ్వు నన్ను 'గారూ' అని మన్నించి మాట్లాడుతున్నా - నేను మాత్రం 'నువ్వు' అంటూ ఏకవచన ప్రయోగం చేస్తున్నాను... 'సినీమా హీరో'లా అందంగా వున్నావూ, క్లాసులో ఎప్పుడూ ఫస్టుమార్కులు తెచ్చుకుంటావూ - ఓ అందమైన ఆడపిల్ల వలచివస్తే - 'కాదు'పొమ్మనవులే' - అనుకుని 'ఓవరయ్యా'ను కదా!... అందుకని - నేను మూర్ఖురాల్ని" - అంటూ బెంచీ మీదనించి చివ్వున లేచిపోయింది.

అశ్వినిమనసు నొప్పించినందుకు శ్రీరామ్ బాధపడ్డాడు.

"అశ్వినీ! ప్లీజ్!... నా మనసేమిటో, నా 'బ్యాక్‌గ్రౌండేమిటో తెలుసుకోకుండా చొరవచేసి ప్రేమించిన నేరం నూటికి నూరుపాళ్లూ నీదే!... అయినా నేను క్షమాపణ చెప్పుకుంటున్నాను!.. దయవుంచి నన్ను మర్చిపో" - అన్నాడు, తప్పుచేసిన వాడిలా తలవంచుకుని.

పెల్లుబికి వస్తున్న కన్నీళ్ళను బలవంతాన ఆపుకునే ప్రయత్నం చేస్తూ అక్కణ్ణించి విసవిసా నడిచివెళ్లిపోయింది అశ్విని.

భారంగా నిట్టూర్చాడు శ్రీరామ్!

* * *

ఊరంతా సంక్రాంతి సంబరాలతో కొత్త అందాల్ని సంతరించుకుంది... వీరభద్రం మేస్టారి ఎత్తరుగుల ఇంటిపక్కనే వున్న - కొబ్బరిచెట్టుమీదనించి, లక్షణమూర్తి - దగ్గరే వుండి నారాయణతో కొబ్బరి బొండాలు దింపిస్తున్నాడు.

వీరభద్రం వీధి అరుగుమీద కూర్చుని - పేపరు తిరగేస్తున్నాడు.

దూరంనించి 'గంగిరెద్దు'ను ఆడించే అప్పలస్వామి - సన్నాయి ఊదుతూ వస్తున్నాడు... ఆ ఎత్తరుగుల ఇంటికి చేరుకుంటూండగానే - అప్రయత్నంగా వీరభద్రాన్ని చూసి - సన్నాయిని హఠాత్తుగా ఆపేసి - గబగబా ఆ ఇంటిని దాటి వెళ్ళిపోతున్నాడు.

అయితే ఆ దృశ్యం - వీరభద్రం చూడనే చూశాడు-

"అయ్యా! అప్పలస్వామి గారూ!" పిలిచాడు.

అప్పలస్వామి ఆగిపోయి - భయంగా చూశాడు.

"ఇలా దయచేయండి" - పిలిచాడు వీరభద్రం మళ్లీ.

రానంటూ మొరాయిస్తున్న గంగిరెద్దుని బలవంతంగా - లాక్కుంటూ వచ్చి గుమ్మం ముందు నిలబడ్డాడు అప్పలస్వామి.

"ఏమిటి తమరి ఉద్దేశ్యం?... అందరి ఇళ్ళముందూ నీ వృషభాన్ని ఆడించి - మా ఇంటి ముందు మాత్రం ఆగక - దాటి పోవుచున్నావు... తమరి ఒళ్ళు ఎలా వుందేమిటి?"- అతనిమీద ఉరిమేడు వీరభద్రం.

"చిత్తం!... అయ్యగారు పేపరు చదువుతున్నారు కదా?.. మా సన్నాయి వాద్యం తమరికి ఇబ్బందీ గట్రా అవుతుందనిపించి సడీసప్పుడూ సెయ కుండా ఎల్లిపోదారనుకున్నా!... ఇప్పుడు తమరే పిల్సి ఆడించ మంటున్నారుగా... ఆడిస్తా బాబూ!" - భయంగా చూస్తూ చెప్పాడు.

కొబ్బరిబొండాలు దింపటం పూర్తిచేసిన నారాయణ కూడా అక్కడకు చేసుకున్నాడు.

అప్పలస్వామి తన సన్నాయి సవరించుకుని ఊదటం ప్రారంభించాడు. కానీ గంగిరెద్దులో చలనం లేదు... భయంభయంగా వీరభద్రం వైపు దొంగ చూపులు చూస్తూండిపోయింది...

అప్పలస్వామి ఖంగారు పడ్డాడు.

"పెద్దయ్యగోరు సూత్తారంట!... ఆడరా బసవన్నా!... బాగా ఆడితే పైమీది కండువా ఇస్తారు... నీకు పున్నెం వుంటుంది... ఆడ్రా!" సన్నాయి ఊదటం ఆపి - బుజ్జగించాడు.

అయినా గంగిరెద్దులో చలనం లేదు. -(ఇంకావుంది)

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం: మాయాబజార్
రచన: పింగళి నాగేంద్రరావు
సంగీతం: ఘంటసాల
గానం: ఘంటసాల, లీల
అభినయం: అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రి

చిత్రం: మాయాబజార్
రచన: తంజై రామయ్యదాస్
సంగీతం: ఘంటసాల
గానం: ఘంటసాల, లీల
అభినయం: జెమినీ గణేష్, సావిత్రి

'మాయా బజార్' చిత్రంలోని మధురగీతాలలో 'చూపులు కలసిన శుభవేళ' ఒకటి.

పాండవులు అరణ్యవాసానికి వెళ్లాక శ్రీకృష్ణుడు - సుభద్రను, అభిమన్యుడినీ ద్వారకకు తీసుకువస్తాడు. సుభద్రకూ, అభిమన్యుడికీ రుక్మిణి, శశిరేఖ, సాత్యకి మొదలయినవారంతా ఆనందంగా స్వాగతం పలుకుతారు. కుశలప్రశ్నల మధ్య శశిరేఖ, అభిమన్యుడూ పరస్పరం చూపులతోనే పలకరించుకొన్నారు. ఆ తర్వాత వాళ్ళిద్దరూ ఉద్యానవనంలో ఏకాంతంగా కలుసుకొన్నారు. ఆనందంగా పాడుకున్నారు. ఆ సన్నివేశంలోని పాట - 'చూపులు కలసిన శుభవేళ'. పింగళి రాసిన పాటను ఘంటసాల, లీల గానంచేశారు. ఈ పాటకొరకు రాజేశ్వరరావుగారు స్వర రచన చేసినా - వాద్య సంవిధానం రూపొందించి రికార్డింగ్ చేసినవారు ఘంటసాల. తెలుగు చిత్రంలో ఈ పాట సన్నివేశంలో నాగేశ్వరరావు,సావిత్రి కనిపిస్తారు. 'మాయాబజార్' తమిళచిత్రంలోని పాట సన్నివేశంలో జెమిని గణేష్, సావిత్రి కనిపిస్తారు. తమిళ చిత్రంలోని పాటను తంజై రామయ్యదాస్ రాశారు. తమిళగీతాన్నీ ఘంటసాల, లీల పాడారు.

ముందుగా తెలుగుపాట:

అభిమన్యుడు : చూపులు కలసిన శుభవేళ
ఎందుకు నీకీ కలవరము
ఎందుకు నీకీ కలవరము
ఉల్లాసముగా నేనూహించిన
అందమే నీలో చిందెనులే ॥చూపులు॥

శశిరేఖ : చూపులు కలసిన శుభవేళ
ఎందుకు నీకీ పరవశము
ఎందుకు నీకీ పరవశము
ఏకాంతములో ఆనందించిన
నా కలలే నిజమాయెనులే ॥చూపులు॥

అభిమన్యుడు : ఆలాపనలూ సల్లాపములూ
కలకల కోకిల గీతములే
చెలువములన్నీ చిత్రరచనలే
చలనములో హో నాట్యములే ॥చూపులు॥

శశిరేఖ : శరముల వలెనే చతురోక్తులను
చురుకుగా విసిరే నైజములే
ఉద్యానమున వీరవిహారమే
చెలికడనోహో శౌర్యములే ॥చూపులు॥



అభిమన్యుడూ, శశిరేఖ చాలాకాలం తర్వాత కలుసుకున్నారు. అప్పటికే ఇద్దరిమధ్యా ప్రేమ చిగురించినట్టుంది. బావ - మరదలు గురించి ఊహల్లో విహరిస్తున్నాడు. మరదలు-బావగురించి ఏకాంతంగా ఆనందంగా కలలు కంటూ ఉన్నది. మరదలి మాటలు బావకు కోకిల పాటల్లాగా వినిపిస్తున్నాయి. ఆమె సొగసులు చిత్రరచనలుగానూ ఆమె కదలికలన్నీ నాట్యాలుగానూ కనిపిస్తున్నాయి. ఆ మరదలికేమో తన బావ మేటి విలుకాడని తెలుసు. శరాలు సంధించినట్టుగానే చతురోక్తులనూ.చురుగ్గా విసరటం ఆమె బావకు నైజమట. అయితే తాము ఉన్నది రణరంగంలో కాదు - తోటలో. ఆ తోటలో వీరవిహారం చేస్తున్నాడనీ తన దగ్గర శౌర్యాలు చూపిస్తున్నాడనీ ఆమె బావను పరిహసిస్తున్నది. పింగళి ఈ పాటలో 'ఓహో' అనే మాటను అభిమన్యుడు పరంగా ఒకసారి, శశిరేఖ పరంగా ఒకసారి ప్రయోగించారు. అభిమన్యుడి 'ఓహో' లో మెచ్చుకోలు కనిపిస్తే శశిరేఖ 'ఓహో' లో పరిహాసం వినిపిస్తుంది.

'మాయాబజార్' తమిళ చిత్రంలో ఈ తెలుగు పాట ఒరవడిలోనే సాగిన గీతం ఇది :

అభిమన్యుడు : కణ్ణున్ కలన్దిడుం శుబదినమే
కణ్ణే ఉనక్కేన్ కలవరమే
కణ్ణే ఉనక్కేన్ కలవరమే
కాదల్ కనియే కనిరసమే
ఉనైక్ కణ్డే కనిన్దదు ఎన్ మనమే

వత్సల : కణ్ణుడన్ కలన్దిడుం శుబదినమే
కణ్ణా ఉనక్కేన్ పరవశమే
కణ్ణా ఉనక్కేన్ పరవశమే
ఏకాన్ద మదిల్ ఇశైయ మగిళ్న్ద
ఎన్ కనవే నినైవానదే

అభిమన్యుడు : కావిల్ ఉలావుం కోగిలమే
ఉన్ గానామృదమే ఆనన్దమే
కలాబమయిల్ పోల్ ఉలావుం కలైయే
కలై మాన్ విళియే కావియమే

వత్సల : మలర్ కణైయాలే మారనైప్ పోలే
నిలై అరియామలే వీశువదేన్
మలర్ కావినిలే వీర విహారమో
మంగై ఎన్నిడముం ప్రదాబమో

ఈ తమిళ గీతానికి భావానువాదం:

అభి : కంటితో కలిసే శుభదినాన
(కన్నా) ప్రియా నీకేల కలవరమే
ప్రియా నీకేల కలవరమే
ప్రేమఫలమా! ఫలరసమా!
నిను చూచే పండింది నా మనసే

వత్సల : కంటితో కలిసే శుభదినాన
(కన్నా) ప్రియా నీకేల పరవశమే
ప్రియా నీకేల పరవశమే
ఏకాంతంలో కలిసి మురిసిన
నా కల నిజమైనదే

అభి : తోటలో విహరించే కోకిలా
నీ గానామృతమే ఆనందమే
ఆడే నెమలిలా నడయాడే కళలే
లేడి కనులదానా! కావ్యమా!

వత్సల : విరుల శరాలను మన్మథుడి లాగా
(పరి) స్థితి తెలియక గుప్పించేవేల?
పూలతోటలో వీరవిహారమో
మగువ నాపైనా ప్రతాపమా?



ఈ తమిళగీతాన్ని పరిశీలించగా -

తెలుగు పాటలోని సొగసులన్నీ ఈ గీతానికి కలిసినట్లు అనిపించదు. పల్లవిలో 'కన్ను' అని ఏకవచనం ఉన్నా - కన్నులు అనే గ్రహించాలి. తమిళ కొన్ని పదాలు పునరుక్తం కావడం, తెలుగు పాటలో లేని అభిప్రాయాలు కొన్ని ఉంచటం గమనించవచ్చు. పల్లవిలో 'కని' అనే పదానికి 'ఫలం' అని అర్థం. వత్సల ఆమె బావకు ప్రేమఫలం. ఫల రసమంత తీయనిది. ఆమెను చూడగానే ఆ బావ మనసు పండిందట. 'కా' అనే పదానికి తోట అని అర్థం. వత్సల తోటలో విహరించే కోకిలలాగా గానామృతాన్ని పంచుతున్నది. నెమలిలాగా నడయాడుతున్నది. నాట్యం చేసేది మగ నెమళ్లే కాని ఆడనెమళ్ళు కావు అని ఎవరైనా అన్నా కవులు ఈ రూల్సుకు కట్టుబడరని చెప్పేసుకోవచ్చు. వత్సలవి లేడికళ్ళు. మొత్తంమీద బావకు ఆమె ఒక కావ్యంగా కనిపించింది. తెలుగుపాటలో నాయిక నాయకుడి శరసంధానాన్నీ చతురోక్తులు విసిరే వేగాన్నీ పోలిస్తే - తమిళగీతంలో నాయికకు నాయకుడు విసిరే పూల బాణాలు మన్మథుడి బాణాలలాగా సోకుతున్నాయట. ఆమె స్థితి తెలియక అతను ఆ పని చేస్తున్నాడట. సరిగా ఆ సమయానికే ఒక దాసి తోటలోని ఈ జంటను చూచి రేవతీదేవికి చెప్పడానికి వెడుతుంది. తెలుగు పాటలో 'చెలి దగ్గర శౌర్యము లేమిటో' అన్నట్టు వున్న భావం తమిళంలో 'చెలిదగ్గర కూడా ప్రతాపమా' అనడంలో తేలిపోయినట్లు కనిపిస్తుంది.

తమిళంలోని పాట మొత్తంమీద సర్దుబాటు చేసినట్టు కనిపిస్తుంది.

పాటలోని 'ఓహో' లు తమిళంలో కనిపించవు. అయితేనేం! తెలుగు పాటలాగా తమిళగీతమూ నేటికీ వీనుల విందు చేస్తూనే ఉంది.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

## హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1961

షమ్మీకపూర్‌కు రఫీలాగా, మనోజ్‌కుమార్‌కు ముఖేష్ పర్మనెంట్ గాయకునిగా 'కాంచ్ కి గుడియా' చిత్రం (సాథ్ హో తుమ్ ఔర్ రాత్ జవాన్) ద్వారా మారారు. సుప్రదీకర్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

సుప్రదీకర్ లాగా ఈ సంవత్సరంలో చిన్న సంగీత దర్శకులు మంచి హిట్ గీతాలను అందించారు. 'రజియా సుల్తానా' చిత్రం కోసం లచ్చీరామ్ స్వర పరిచిన ఆశా-రఫీ డ్యూయెట్ 'ఢల్తీ జాయే రాత్, కహే లే దిల్ కి బాత్' (ఆనంద్ బక్షీకి మంచి గుర్తింపు తీసుకువచ్చిన గీతమిది), హిట్ అయింది. ఈ చిత్రగీత రచయితలలో ఒకరైన కైఫీ అజ్మీ 1983లో విడుదలైన 'రజియాసుల్తానా' చిత్రంలో కూడా గీతరచయిత కావటం విశేషం.


**ముకేష్**

'రేష్మీ రూమాల్' చిత్రం కోసం బాబుల్ స్వరపరిచిన 'గర్దిష్ మేఁ హో తారే ' ముకేష్ హిట్ గీతాలలో ఒకటిగా నిలిస్తే, 'ధర్మపుత్ర' కోసం ఎన్.దత్తా అందించిన ఆశా సోలో 'మైఁ జబ్ భి అకేలీ హోతీ హూఁ ', మహేంద్రకపూర్ గానం చేసిన 'జై జనని జై భారత్ మా' పాటలు సూపర్ హిట్ అయ్యాయి.

**(వచ్చే సంచికలో మరికొంత)**

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



రెడ్డి.ఎమ్మెౕ,ఒంగోలు

ప్ర॥ ఆవులింతలొస్తే చెయ్యి అడ్డం పెట్టుకుంటారెందుకు?

జ॥ ఎదుటివాడు ప్రేగులు లెక్కపెడతాడేమోనని.

ప్ర॥ ఆడంతే... అదోటైపు?

జ॥ షార్ట్‌హ్యాండేం గాదూ!

ప్ర॥ అతడే ఒక సైన్యం?

జ॥ యిహనేం, మిలటరీఖర్చు బోల్డంత తగ్గించొచ్చు.

## ఈ రూటేవేరు




PUBLIC PADDY = జనవరి

**- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ**

FROG JUMPS MOON LIGHT = కప్పగంతుల చంద్రప్రకాష్

CROCODILE EYES HILL MOTHER = మొసలికంటి కొండమ్మ

FROZEN HILL PEARLS = మంచుకొండ ముత్యాలు

BANGLES GOLDEN KING = గాజుల బంగార్రాజు

AIR SINGLE TOOTH = గాలి ఏకదంతం

**- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం**

## చిలిపి లిపి




A.C.D.T. - ఎసిడిటి

D MAN DO - డిమాండు

C B RUM - శిబిరం

PO RAW DO - పోరాడు

MON DO COME - మండూకం

RAW G - రాజీ

GO LAW - గోల

**-బి.చంద్రశేఖరయ్య,రామసముద్రం**



ఆకాశ వీధిలో-అతను-ఆమె-లవ్‌బర్డ్

**-బి.శ్రీరామ్,సింగర్,రుద్రారం**

నీకే మనసిచ్చాను-అవునా-ఐతే-చెవిలోపువ్వు-చాలా బావుంది

**-పి.గిరి, హైదరాబాద్**

పార్వతీ పరమేశ్వరులు- గణేశ్-తల్లిదండ్రులు

సీతాదేవి-ఊర్మిళ-అక్కాచెల్లెళ్ళు

గణపతి-స్వామి అయ్యప్ప-అన్నదమ్ములు

**- రాగం కనక ఉదయ సూర్య భాస్కర్రావు,ములగపూడి**

## పేరు - రిపేరు



## చిలిపి కవిత



హృదయం ఖాళీగా వుంది...
ప్రియురాలు పెళ్లి చేసుకుంది !
ఇల్లు ఖాళీగా వుంది...
ఇల్లాలు పుట్టింటికెళ్లింది !!
కడుపు ఖాళీగా వుంది...
కవిత రాసి పోస్ట్ చేసేశాను !!!

**-డా॥నెల్లుట్ల.వేంకటేశ్వర రావు, సికింద్రాబాద్**

## డబుల్ రోల్



**గున్న** ఏనుగులా**గున్న** వాడికీచొక్కా ఎలా సరిపోతుంది?
హలో ఎవరు కావాలీ...**యిందిరా?** అది కాలేజ్‌కి వెళ్లిపో**యిందిరా**.

**-కే.యన్వీ ఆంజనేయులు, ఉక్కునగరం**

సుగ్రీవుడు వానరరాజు కా**వాలి** అంటే **వాలి** నేలకూలాలి.

**-వి.మంజూరాణి,హైదరాబాద్**

UKG లోచదవడానికి UK దాకా వెళ్లక్కర్లేదు.

**-వై.శశిరేఖ సాయిబాబా,ఏలూరు.**

## షార్ట్‌కట్స్




ఆలపాటి కుటుంబరావు = ఆకు
గోవిందరాజు కరుణాకరరావు = గోకరా

- చక్రపాణి,చందానగర్

## పేరడీ పెరేడ్



ప॥ గోంగూర పప్పుంది
పప్పులోన నెయ్యుంది
నెయ్యివేసుకు తింటూవుంటే
తిండి రంజుగా ఉంటుంది ఓఓఓఓ...హోయ్ ॥గోంగూర॥
చ॥ అదురు అదురుగా టేస్టుంది
పెదవులు తడిగా చేస్తుంది
ఆవకాయను జోడిస్తే
అమృతతుల్యం అవుతుంది ॥గోంగూర॥
చ॥ కందిపొడుంది, పచ్చడివుంది
సాంబారుందీ, ఫ్రయ్ ఉంది
కందిపొడుంది,పచ్చడి ఉంది
సాంబారుందీ,ఫ్రయ్ ఉంది
ఏది ముందర కలపాలో
తికమకతో నామది ఉంది ॥గోంగూర॥
చ॥ గడ్డపెరుగు నోరూరిస్తూ
గలాసు నిండా ఉన్నాది
గడ్డపెరుగు నోరూరిస్తూ
గలాసు నిండా ఉన్నాది
గుత్తివంకాయ్ ఘుమఘుమ లాడుతూ
ఎంతమెక్కితే అంతుంది
గుత్తివంకాయ్ ఘుమఘుమ లాడుతూ
ఎంతమెక్కితే అంతుందీ... ॥గోంగూర॥

(మూగమనసులు చిత్రంలో 'గోదారి గట్టుంది' పాటకు పేరడీగా)

**-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం**

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన తాళాభక్తుల లక్ష్మీప్రసాద్ (విశాఖపట్నం) గారికి బ్లిస్ ఆడియో వారు 'ఓరి.. నీప్రేమ బంగారం కానూ' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.






# పింగళి పాటల్లో వెటకారాలూ చమత్కారాలూ



- రావి కొండలరావు

(గత సంచిక తరువాయి)

నాగేంద్రరావు గారి ఎక్కువ పాటల్లో కొన్ని కొన్ని పదాలు ఎక్కువగా వినిపిస్తాయి. కోయిల, వెన్నెల, చందమామ సరేసరి. (ఇవాళ ఈ మాటల పాటలే లేవు అవి పాతబడిపోయాయి గావున)తొలకరి వలపులు, వసంత గానం, కలవరం, కనులు తెరవడం, లాంటివి. ఏమైనా, అర్థం కానివీ అపార్థం కల్పించేవీ వుండవు. సరళంగా , సరసంగానే వుంటాయి. అక్కడక్కడ చమక్ తారల్లా చమత్కారాలు మెరుస్తాయి. 'వసంతగాలి' లాంటి సమాసాలు పండితులచేత మాటలనిపించుకుంటాయి. "శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణు" లోని యుగళగీతం "వసంతగాలికి వలపులు రేగ" (బాలమురళీ కృష్ణ,జానకి) సంచలనం చేసింది. 'శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణు' పేరు చెప్పగానే ఒక జోక్ గుర్తొచ్చింది. 'హాసం' గనక అప్రస్తుతం అనుకోవద్దు. "ఆంధ్ర మహావిష్ణు" షూటింగ్ వాహినిలో జరుగుతూ ఉండగా, తమిళ ప్రసిద్ధ నటుడు ఎం.ఆర్.రాధ అటువెళ్తూ "ఏం షూటింగు?" అని అడిగాడు. "ఆంధ్రమహావిష్ణు" అని పేరు చెప్పాడు అడగబడ్డాయన. రాధ ఒక్క క్షణం నిలబడిపోయి - "వింతగావుందే! ఆంధ్రులకి ప్రత్యేకంగా మహావిష్ణువున్నాడా!" అంటూ సాగిపోయాడు. "శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణు సినిమాలో నాగేంద్రరావు గారి లాంటి పండితులు 'వసంతగాలి'అని రాయడం బాగులేదు" అని వ్యాఖ్యానిస్తే- 'ఆ పేరు నాకు ఎప్పుడో వచ్చింది. సినిమాపాటలు బద్ధ కవిత్వంలో వుండవు. వీలావుండదు. ఎప్పుడూ కాకపోయినా, ఎప్పుడైనా మాట బాగుంటుందనుకుంటే వాడవలసిందే!" అని బదులు చెప్పారు నాగేంద్రరావు.

"భాగ్యచక్రము" సినిమాలో సుశీల పాడిన "వానకాదు వానకాదు వరదరాజా" (దేవుడికి సంబంధించిన వరద రాజు పేరుని, వరదతో కలిపారు) లో "కొండపైన నల్లమబ్బు పందిరి కాగా, కోనలోన మెరుపు తీగ తోరణ కాగా" అని పెళ్ళిసందర్భంగా రాస్తే - ఆత్రేయ "ఆహా" -అని మెచ్చుకున్నారు.

"నైటు క్లబ్ పెట్టేస్తా- న్యూడ్ కళను పోషిస్తా
బ్లాకు మనీ పోగు చేస్తా- సిటీలన్నీ యేలేస్తా"
"స్టంటు పిక్చరు తీస్తా-ధనము దోచుకుంటా
అమెరికాకు పోతా -అనుభవాలు రాస్తా"
"రష్యాకు ట్రిప్పువేసి రాకెట్టును కొట్టుకొచ్చి
పల్లెనుండి మూను దాక రాచబాటవేసేస్తా"

ఈ చరణాలు-ఆంగ్లాంధ్ర భాషలు కలిసిన చరణాలు- నాగేంద్రరావు గారు రాసినవేనా?- అనిపిస్తుందా! అవును. 'నిజాయితీ' (సింగీతం శ్రీనివాసరావు తొలిసినిమా)లో నాగభూషణం, కృష్ణంరాజు గొప్పలు చెప్పుకుంటూ పాడతారు. (ఘంటసాల,యస్.పి.బాలసుబ్రహ్మణ్యం) ఇందులో 'పల్లెనుండి మూను దాక రాచబాట' వెయ్యడానికి మించిన 'గొప్పకోత' ఇంకేముంటుంది?

"వింధ్యరాణి" నాగేంద్రరావుగారి నాటకం. డి.వి.సుబ్బారావు గారు వింధ్యరాజుగా ఆ నాటకం విరివిగా ప్రదర్శించారు. దాన్ని వైజయంతీ మూవీస్, జెమిని వారూ సంయుక్తంగా నిర్మించారు. ఏమీ నడవలేదు. నాగేంద్రరావు గారే ఆ నాటకాన్ని సినిమాగా మలిచినా, పేరు ప్రతిష్ఠా ఏమీ మిగల్లేదు. తిరిగి 'గుణసుందరికథ'కే రావడం.

"వింధ్యరాణి" రచయితే, "గుణసుందరి కథ" కి రాస్తున్నాడా? రచయిత కె.వి. రెడ్డి గారికి ఆలోచన దూరమైందా?" అని అప్పుడు కొందరు విస్తుపోయారు. "రాయకముందే నాకుఅలాంటి అక్షింతలు పడ్డాయి." అని నాగేంద్రరావు గారు చెప్పేవారు. ఇక 'గుణసుందరి కథ' లోని అంశం, రచన అన్నీ ఎంత మంతనంగా వున్నాయో, ఇక తర్వాత గాని విమర్శకులకి అర్థం కాలేదు. "శ్రీ తులసి ప్రియ తులసి" పాటలో "పెరటి వేల్పువై వెలసి" అని కీర్తించడం చమత్కారంలా అనిపిస్తుంది. ఇష్టవేల్పు, ఇలవేల్పులాగా- పెరటివేల్పు! తులసిమొక్క పెరటివేపే వుంటుందిగదా! విజయవారి 'సత్యహరిశ్చంద్ర' లో వీరబాహుడి పాట అన్నివిధాలా బాగున్న పాట. తత్త్వం. "కులంలోనూ మతంలోనూ ఏముంటుంది!" అంటూ-



"నిలువుబొట్టుతో సొరగం రాదురా
అడ్డబొట్టుతో నరకం పోదురా
జుట్టు బొట్టూ కట్టులన్నీ
పాడెకట్టుతో ఎగిరిపోవురా"



"జంగాలంతా శివుడే యంటరు
దాసరులో కేశవుడే యంటరు
జంగము దాసరి జగడమాడుకొని
వల్లకాటిలో ఒకటైపోతరే"

అని శైవవైష్ణవాల మీద చేసిన వెటకారం, వేసిన చురక - చిన్నమాటలైనా గొప్పమాటలు. 'మాయబజార్'లో 'వివాహభోజనంబు'ను కీర్తించిన ఆయనే -'హరిశ్చంద్ర'లో 'తద్దినంపు భోజనం' అని కాలకౌశికుడి శిష్యులచేత కీర్తింపజేశారు. (ఈ పాటలోని ఒక చరణం సింగీతం శ్రీనివాసరావు పాడడం-విశేషం) "తుంచకుండ గారెబూరె, మంచి తేనెలో ముంచుకొని, గొంతు జారవేయగానే బ్రేవుమని త్రేపొస్తే" అని తమాషాగా సాగుతుందా పాట.

"యువతులు చూసీ చూడకముందే
ఐసౌతావా అబ్బాయీ, విరహమే నీకు
శీతలమైతే వెచ్చని కౌగిట ఊచెదనోయీ"

సి.ఐ.డి సినిమాలో పాట (సుశీల) 'ఐస్ అవుతావా' అనడం, 'విరహమే నీకు శీతలమైతే, వెచ్చని కౌగిట ఊచెదనోయీ' అనడాల్లో శృంగారం సరళ భావంలో స్ఫురిస్తుంది. 'శ్రీకృష్ణార్జున యుద్ధము" చిత్రం నారదుని పాటతో ఆరంభమవుతుంది. కృష్ణుడిని స్తుతిస్తూ "దేవదేవ నారాయణ" అని పాడుతూ, నారదుడు కథ కూడా చెప్తాడు. పాట చివర్లో "ధరణినేమి మహిమ చాట, ద్వారకలో నుంటివో" అనడంలో, అప్పుడు కృష్ణుడు ద్వారకలో వున్నాడని - తాను అక్కడికే వెళ్తున్నాననీ పాడడం-



ప్రేక్షకులకి చెప్పడం!

"తపము ఫలించిన శుభవేళ బెదరగనేల ప్రియురాలా - ఎదుట నిలువుమని మంత్రము వేసి బెదరగనేల జవరాలా" అని అర్జునుడు పాడిన పాటలో 'బెదరడం' కొత్త ప్రయోగం. 'భయపడనేలా' అనడానికి బదులు 'బెదరగనేలా' అని వెయ్యడం పింగళి చేసిన సందడి. 'గుండమ్మకథ' హిట్ కావడంతో పాటలన్నీ ఎప్పటికీ హిట్లే. 'మౌనముగా నీ మనసుపాడిన'



పాటలో "రుసరుసలాడుచు విసిరిన వాల్జడ - వలపుపాశమని బెదరితినే" - మహాముచ్చటైన సరళ ప్రయోగం! "లేచింది మహిళాలోకం" అని- మహిళల్ని పొగిడి, పొగిడి చిన్నచురక కూడా తగిలించారు నాగేంద్రుల వారు. "అది ఇది ఏమని అన్ని రంగముల మగధీరులనెదిరించారూ, నిరుద్యోగులను పెంచారూ" అనడంలో - దేశంలోని నిరుద్యోగులు ఎక్కువ కావడానికి - మహిళలే కారణం అని - ఓ విసురు కూడా విసిరారు.

"నిదురించిన నా హృదయమునెవరో
కదిలించిన సడి విననాయె
కలవరపడి నే కనులు తెరువ
నాకంటి పాపలో నీవాయె"

అన్న చరణం 'కనులు తెరచినా నీ వాయె.' పాటలోనిది. కళ్లుతెరవగానే కంటిపాపలో కనిపించాట్ట! లాంగ్ షాట్‌నుంచి, టక్కని క్లోజ్‌షాట్‌కొచ్చినట్టుంది - సున్నితమైన సుమధుర భావం!

"వెన్నెలలోనె వేడియేలనో
వేడిమిలోనె చల్లనేలనో"

విరహ ప్రకటనకి ఇంతకంటె ప్రయోగాలు కావాలా?

(పెళ్ళినాటి ప్రమాణాలు: ఘంటసాల,లీల)

'కాళిదాసు' కాకముందు ఆ మూర్ఖుడి పేరు కాలుడు. వాడు పిల్లలతో కలిసి "నాలో నాయన నన్నాడ మంటే నేనాడుతున్నా నీఆట" అని పాడతాడు.

అందులో "నేనెట్టాడితే తానట్టాడుచు, నా నీడచూన్నది నా ఆట" అనిరాయడంలోని చమత్కార పరిమళాలు - ఎన్నాళ్లయినా వెదజల్లుతూనే వుంటాయి. పెళ్లయిన తర్వాత కాలుడు శోభన మందిరంలో "నీ కెట్టుందో గాని పిల్లా నాకు భలేగా వుందిలే" అని పాడుతూ, "అద్దంముందు ఇద్దరముంటే - ఇద్దరినద్దం కలిపేస్తుంటే" అంటాడు. 'తేనెమనసులు' లో ఆత్రేయ - చంద్రుడిని చూస్తూ ఇద్దరమ్మాయిలు పాడే పాట రాశారు : "నీఎదుట నేను - వారెదుట నీవు - మా ఎదుట ఓ మామ - ఎప్పుడుంటావు?" అని. ఎంతగొప్ప భావాలు! 'అప్పుచేసి పప్పుకూడు' లో 'ఆనందం పరమానందం' పాట. (ఘంటసాల) "యమునా తటమున గోపిక లందరు కృష్ణుని వెదుకుట ఆనందం - ఎవరికి దొరకక మురళీలోలుడు రాధకె చిక్కుట



పరమానందం". "ఆనందం, పరమానందం" రెండింటికీ వున్న గొప్పతేడాని చెప్పడానికి పింగళివారు ఉపయోగించిన ఉపమానం - నిరుపమానం!

"వినుటయెగాని వెన్నెల మహిమలు
అనుభవించి నేనెరుగనయా"



అని పెళ్లికాని మేరి - చంద్రుణ్ణి చూస్తూ పాడుతుంది 'మిస్సమ్మ' లో. ఇక్కడ ఒక మాట: ఈ మాట మీద రేలంగి, పింగళి వారిని అడిగాడు - "మీరు కూడా అనుభవించలేదుకదా (నాగేంద్రరావుగారు బ్రహ్మచారి) ఈ శృంగార గీతాలు అనుభవించిన వాడికంటె గొప్పగా మీరు రాస్తున్నారే - ఎలాసాధ్యం?" అని. 'రేలంగీ! 'రవి గాంచనిచోట కవిగాంచును' అన్నారు విన్నావా! కవికి అన్నీ తెలుస్తాయి. ఏదీ అనుభవించక్కర్లేదు. ప్రతిదీ గ్రహించగలనేర్పు ఒక్క కవికే వుంటుంది" అని వివరించారాయన. అందులోనే, "మూతి బిగింపులు అలకలు పాతబడిన విద్యలనీ మగువలెపుడు మగవారిని చిరునవ్వుల గెలవాలని" అని, సత్యభామనీ, రేవతినీ తెగనాడారు - మంచి పద్ధతి చెబుతూ.

ఇంకా ఎన్నో చమత్కారాలు, భావ ప్రయోగాలు వుండేవుంటాయి. భాషకంటె - భావానికే ప్రాధాన్యం ఇవ్వాలని నాగేంద్రరావు గారి సిద్ధాంతం - సంగీతం కంటె సాహిత్యానికీ ప్రాధాన్యం ఇవ్వాలని ఘంటసాలవారి సిద్ధాంత మైనట్టు! ఆ ఇద్దరి కలయికలోనూ వచ్చిన పాటలన్నీ మధు "రాతి" మధురాలు - మైలు రాళ్లు! ఆ 'పాత' మధురాలు కావు సరికొత్త మధురాలు!

పింగళి నాగేంద్రరావు గారి రచనలోని ఘనత- పాటలు,మాటలూ రెండింటినీ పాపులర్ చెయ్యగలగడం! పాటలు పాడుకుంటున్నట్టే - మాటలూ చెప్పుకోవడం ఆయన సాధించిన ఘనతే. ఆయన రాసిన ప్రతి పాట - "తీయని ఊహలు హాయిని గొలిపే వసంతగానమే". అవి గానవనియంతా పరిమళిస్తాయి; మన మనసెంతో పరవశింపజేస్తాయి!

**ఘంటసాల క్విజ్ - 15 విజేతలు**

**మొదటి బహుమతి**
శ్రీమతి నెల్లుట్ల రమాదేవి, హనుమకొండ
**రెండవ బహుమతి**
శ్రీ కె.ఎల్.ఎన్.మూర్తి, వడ్డవల్లి
**మూడవ బహుమతి**
శ్రీ సోమయాజుల సాయిప్రసాద్, ఒనకడిల్లీ(ఒరిస్సా)

**సరి అయిన సమాధానాలు**

1. టింగ్‌రంగా
2. డార్లింగ్ డార్లింగ్ కమాన్ (రంగేళిరాజా)
3. అక్కచెల్లెళ్ళు
4. మంచిరోజు
5. మనదేశం

**బహుమతులు**

మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
రెండవ బహుమతి: 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్, హెచ్.ఎం.వి.వారిది.
మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.




| | | |
|---|---|---|
| చిత్రం | : | తీస్రీ మంజిల్ |
| రచన | : | మజ్రూహ్ సుల్తాన్‌పురి |
| సంగీతం | : | ఆర్.డి.బర్మన్ |
| గానం | : | మహమ్మద్ రఫీ, ఆశా భోంస్లే |
| అభినయం | : | షమ్మీ కపూర్, ఆశా పారెఖ్ |

## 'ఆజా ఆజా మైఁ హూఁ ప్యార్ తెరా'

అ: ఆజా ఆజా మైఁ హూఁ ప్యార్ తెరా
అల్లా అల్లా!ఇన్‌కార్ తెరా
అ అ ఆజా అ అ ఆజా,అ అ అ ఆజా
అ అ ఆజా,అ అ అ ఆజా (2)
అ అ అ

అ: తుమ్‌పె హజారోం కీ ఆంఖేఁ చాహియే తుమ్‌కో సహారా
పల్‌కోఁ మేఁ ఆవో ఛుపాలూఁ, నాజుక్ తన్ హై తుమ్హారా
॥ఆజా అఅ ఆజా॥

ఆ: మేరా ఖయాల్ తుఝే హై, మైనే అభీ యహీ జానా
సచ్చా హై ప్యార్ కి ఝూఠా, యే హై ముఝే ఆజ్‌మానా
॥ఆజా అఅ ఆజా॥

అ: రఖ్‌నా థా దిల్ పే హమారే, హాథ్ ఛుడాకే చలీ హో
ఆ: జీ హాఁ జరా యే భీ కహియే, ఆగ్ లగాకే చలీ హో
॥ఆజా అఅ ఆజా॥



**తొ**లకరులు,జడివానలు, చిరుజల్లులు కురిపించిన శ్రావణమేఘం ఆర్.డి.బర్మన్ సంగీతం. ఆ మేఘం ఇపుడు మూగబోయినా మేఘమథనం చేసి కృత్రిమ వర్షాలు కురిపిస్తున్న మేధావులు ఎందరో ఉన్నారు. ఆర్.డి. నేడు మన మధ్య ఉండి ఉంటే ఇంకా ఎన్నో పన్నీటి జల్లులు కురిసేవి అనటానికి ఆయన తన జీవిత చరమాంకంలో అందించిన సంగీతం బలమైన సాక్ష్యం. 'అంతం' (1992-హిందీలో ద్రోహి) లోని 'ఓ మైనా', 'నీ నవ్వు చెప్పింది నాతో' పాటలు, '1942-ఎ లవ్ స్టోరీ' (1994) లోని పాటలు సంగీత ప్రియులకు కొత్తరుచులు చూపించాయి. వెళుతూ వెళుతూ ఆర్.డి మనకందించిన కానుకలు అవి.



మొదట్లో తన తండ్రి ఎస్.డి. బర్మన్ వద్ద అసిస్టెంట్‌గా పనిచేసిన ఆర్.డి.కి గురుదత్ 'రాజ్' (1959) అనే చిత్రంలో మొదటిసారిగా సంగీతదర్శకుడిగా అవకాశం ఇచ్చారు. కానీ ఆ చిత్రం మధ్యలోనే ఆగిపోయింది. 1961 లో మొహమూద్ తన 'ఛోటే నవాబ్' తో ఆర్.డి.కి బ్రేక్ ఇచ్చారు. 'కారు మీద సొట్టలు పడేలా దరువేస్తూ ఉండేవాడు. తటుకోలేక అవకాశ మిచ్చాను' అంటారు మొహమూద్. మళ్ళీ 1965 లో 'భూత్ బంగ్లా' లో మొహమూదే ఆర్.డి. కి రెండో అవకాశ మిచ్చారు.



1966 లో నాసిర్ హుస్సేన్ నిర్మించిన 'తీస్రీ మంజిల్' తో ఆర్.డి.బర్మన్ దశ తిరిగింది. ఆ చిత్రంలో 'ఓ హసీనా జుల్ఫోఁ వాలీ', 'ఆజా ఆజా', 'దీవానా ముఝ్‌సా నహీఁ', 'ఓ మేరే సోనారే' పాటలు ఒకదానికొకటి భిన్నంగా రూపొందించి అన్ని వయసుల వారినీ ఆకట్టుకున్నారు ఆర్.డి. నిజానికి హీరో షమ్మీకపూర్‌కి తన రెగ్యులర్ మ్యూజిక్ డైరెక్టర్స్ శంకర్-జైకిషన్‌లను మార్చడం ఇష్టంలేదు. కానీ పాటలు విన్న తర్వాత ఆయన సందేహాలు పటాపంచలైపోయాయి. నాసిర్ హుస్సేన్ చిత్రాలకు ఆర్.డి. రెగ్యులర్ అయిపోయారు. 'ప్యార్ కా మౌసమ్', 'కారవాన్','యాదోఁ కీ బారాత్','హమ్ కిసీ సే కమ్ నహీఁ' చిత్రాలలో ఆయన అందించిన పాటలు ఇప్పటికీ శ్రోతలను అలరిస్తూనే ఉన్నాయి.



70వ దశకంలో ఆర్.డి అందించిన సంగీతం శ్రోతలను మంత్రముగ్ధులను చేసింది. 'కటీ పతంగ్', అమర్ ప్రేమ్', 'కారవాన్', 'హరే రామ హరే కృష్ణ', 'పరిచయ్', 'ఆప్నాదేశ్', 'మెహబూబా', 'అనామికా', 'యాదోఁకీ బారాత్', 'ఆంధీ', 'ఖుష్బూ', 'కినారా', 'హమ్ కిసీ సే కమ్ నహీఁ', మొదలైన విభిన్నమైన చిత్రాలలో ఆయన వెర్సటాలిటీని నిరూపించుకున్నారు. ఒక్క 1971 లోనే ఆయన 'రైనా బీతీ జాయె'(అమర్ ప్రేమ్), 'పియాతూ అబ్ తో ఆజా'(కారవాన్), 'దమ్ మారో దమ్'(హరే రామ హరే కృష్ణ) పాటలు రూపొందించి తన రేంజ్‌తో అందరినీ ఆశ్చర్యచకితులను చేశారు. అలాంటి



ఆర్.డి కి 1982 దాకా ఫిలింఫేర్ అవార్డు రాలేదంటే మరో రకంగా ఆశ్చర్య పోవటం తప్పదు. 1982లో 'సనమ్ తేరీ కసమ్' కి, 1983 లో 'మాసూమ్' చిత్రానికి ఆయనకు ఫిలింఫేర్ అవార్డులు వచ్చాయి. ఆర్.డి కి ఇంత లేటుగా ఫిలింఫేర్ అవార్డ్లు ఇచ్చారని తెలిసిన (పేరు చెప్పడానికి ఇష్టపడని) ఒక సంగీత దర్శకుడు అవార్డు వ్యవస్థపై నమ్మకం పోయి తనకొచ్చిన ఫిలింఫేర్ అవార్డులను ఒక స్వచ్ఛంద సంస్థకు ఇచ్చేశారు. మలితరం సంగీత దర్శకులకు ఆర్.డి పై ఉన్న గౌరవం అలాంటిది.

హిందీ సినిమాలలో వచ్చిన మర్డర్ మిస్టరీ చిత్రాలలో మంచి పేరు సంపాదించిన చిత్రం 'తీస్రీమంజిల్'. కామెడీ, రొమాన్స్, మ్యూజిక్ కలగలపి ఆద్యంతం ఆసక్తికరంగా తెరకెక్కించారు దర్శకుడు విజయ్ ఆనంద్. ట్రెయిన్‌లో హీరోయిన్ ఆశాపారెఖ్‌ను ఏడిపించటానికి ఒక లావుపాటి వ్యక్తిని షమ్మీకపూర్ రకరకాల చేష్టలతో నవ్వించటం, ఆ వ్యక్తి తనను చూసే అలా విరగబడి నవ్వుతున్నాడని భావించి ఆమె అతన్ని గొడుగుతో కొట్టడం, అతను చనిపోయాడని షమ్మీకపూర్ ఆమెను భయపెట్టడం హిందీ చిత్రాలలోని క్లాసిక్ కామెడీ సీన్లలో ఒకటి. (ఇదే కాన్సెప్ట్‌తో 'బావగారూ బాగున్నారా'లో చిరంజీవి, రంభ, బ్రహ్మానందంలతో పండించిన కామెడీ కూడా ప్రజాదరణ పొందింది.)



కథానుసారం హీరో ఒక హిల్ స్టేషన్‌లోని హోటల్‌లో డ్రమ్మర్‌గా పనిచేస్తుంటాడు. ఆ హిల్ స్టేషన్‌కి వచ్చిన హీరోయిన్ అక్క హీరో వెంట పడుతుంది. అతను ఆమెకు దూరంగా ఉంటాడు. తర్వాత ఆమె హోటల్ మూడో అంతస్తు (తీస్రీ మంజిల్) నుంచి కిందపడి మరణిస్తుంది. హీరో కాదనటంతో ఆత్మహత్య చేసుకుందని అందరూ భావిస్తారు. హీరో మీద కోపంతో హీరోయిన్ అతనికి గుణపాఠం చెప్పాలని తన స్నేహితురాళ్లయిన హాకీ ప్లేయర్లతో అతనికి దేహశుద్ధి చేయించాలని హిల్ స్టేషన్‌కి వస్తుంది. అతను ఆమెను ప్రేమిస్తాడు. ఆమె అతణ్ణి ప్రేమించినట్టు నటించి అతని పనిపట్టాలని చూస్తుంది. ఈ సందర్భంలో వచ్చే పాట 'ఆజా ఆజా మైఁ హూఁ ప్యార్ తెరా'. అంతకు ముందెన్నడూ హిందీ చిత్రాలలో వినని కొత్త తరహా సంగీతంతో, చూడని కొత్త తరహా నృత్యంతో ఈ పాట యువతరాన్ని ఉర్రూతలూగించింది. రాక్ మ్యూజిక్‌ను సామాన్య ప్రజలకు పరిచయం చేసిన ఘనత ఆర్.డి కే దక్కుతుంది.

'మైఁహూఁప్యార్ తెరా' అంటే 'నేనే నీ ప్రేమ' అని. ఆంగ్లంలో 'యూ ఆర్ మై లవ్' అని ప్రియమైనవారిని 'నాప్రేమ' అంటూ సంబోధిస్తారు. హిందీలో కూడా ఆ ప్రయోగం ఉంది. 'మేరా ప్యార్ భీ తూహై' (సాథీ) పాట వినే ఉంటారు. తెలుగులో 'నువ్వే నా ప్రేమ' అనే ప్రయోగం లేదు. 'మైఁహూఁప్యార్ తెరా' అంతే 'నాదే నీ ప్రేమ' అనుకోవచ్చు. 'అల్లా అల్లా' అంటే 'అయ్యో రామా' లాంటి ఆశ్చర్యార్థకమైన మాట. ఇన్‌కార్ అంటే నిరాకరణ, కాదనటం.

'రావా రావా నాదేగా నీ ప్రేమ
అయ్యో రామా! కాదంటావే ఇలా
రావా రా రా రావా......................'

తను ప్రేమించిన అమ్మాయి వెంటపడి 'నన్నెందుకు ప్రేమించవు?' అని దబాయించే షమ్మీకపూర్ ఇమేజ్‌కి తగినట్టు 'నేనే నువ్వు ఎదురుచూసే ప్రియుణ్ణి, కాదంటావెందుకు?' అనే భావంతో పల్లవి రాశారు రచయిత మజ్రూహ్ సుల్తాన్‌పురి. 'ఆజా అఅ ఆజా అఅఅ ఆజా' అంటూ డాన్స్‌కి ఎంతో ఆస్కారంగల హుషారైన ట్యూన్ అందించారు ఆర్.డి.

'హజారోఁ' అంటే వేనవేలు. సహారా అంటే తోడు,సహాయం. పల్‌కేఁ అంటే కనురెప్పలు. ఛుపాలూఁ అంటే 'దాచుకుంటా' అని.

'నీ పైన కళ్ళు ఎందరివో, తోడొకరుండాలి నీకు
కళ్ళలో దాచుకుంటా రావా, నాజూకు తనువు నీది
రావా రా రా రావా.................'

'అందరి కళ్ళూ నీమీదే ఉన్నాయి. నీకొక తోడు కావాలి. నీ మేను ఎంతో సుకుమారం, నిన్ను కళ్లలో పెట్టుకుని కాపాడుకుంటా, వచ్చెయ్' అని తనను ప్రేమించేందుకు కారణాలు, తాను కల్పించే సౌకర్యాలు ఏకరువు పెడుతున్నాడు.

ఖయాల్ అంటే తలపు. జానా అంటే తెలుసుకున్నాను అని. సచ్చా అంటే నిజమైనది.ఝూఠా అంటే అసత్యం. ఆజ్‌మానా అంటే పరీక్షించటం.

'నా తలపు నీలో ఉందని తెలిసింది ఇప్పుడే నాకు
ఈ వలపు నిజమో కాదో తరచి చూడాలి నేను
రావా రా రా రా రావా..................'

అతన్ని ప్రేమించినట్టు నటించి ఉచ్చు బిగించటమే మంచిదని తలచి ఆమె ఒక్కసారిగా ఒప్పుకోకుండా బెట్టు చేస్తూ 'నాగురించి తాపత్రయ పడుతున్నావు సరే, నీ ప్రేమ నిజమో కాదో పరీక్షించాలి రా' అని అతనితో అడుగు కలిపింది.



రఖ్‌నా అంటే ఉంచటం. ఛుడానా అంటే విడిపించటం. ఆగ్ అంటే అగ్ని

అ: 'నా గుండెపై ఉంచాల్సిన చేయి విడిపించుకు పోతున్నావు'
ఆ: 'ఔనౌను ఇంకా అను మాటలు జ్వాల రగిలించానని'

'నా గుండెపై ఉంచి నన్ను కుదుటపరచాల్సిన చేయి విడిపించుకు పోతున్నావు' అని అతను నిష్ఠూరమాడుతుంటే 'ఇలాంటి పైత్యపు మాటలు చాలా విన్నాను' అనే భావంతో 'గుండెలో జ్వాల రగిలించానని కూడా అను' అని అతణ్ణి ఉడికించింది ఆమె.

హుషారైన ఈ సరదా పాటతో పాటు మిగతా పాటలన్నీ మజ్రూహ్ సుల్తాన్‌పురియే రాశారు. షమ్మీకపూర్, హెలెన్‌ల పై చిత్రీకరించిన 'ఓ హసీనా జుల్ఫోం వాలీ' పాటను గతసంవత్సరం ఆర్.డి బర్మన్ సంగీతం ఆధారంగా రూపొందిన 'దిల్ విల్ ప్యార్ వ్యార్' లో జిమ్మీ షేర్‌గిల్, హృషితా భట్‌లపై చిత్రీకరించారు. ఇంకా వేర్వేరు చిత్రాలలోని ఆర్.డి పాటలు బబ్లూ చక్రవర్తి చేత రికార్డు చేయించి విడుదల చేసిన ఆ చిత్రం ఆడియో ఘన విజయం సాధించింది. ఆర్.డి అమరత్వానికి ఇదే నిదర్శనం.



- పి.వి.సత్యనారాయణ రాజు

జనవరి 14 జంధ్యాల జయంతిని పురస్కరించుకుని...




నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# "హ్యూమర్ హేమర్ కాకూడదు!

కొన్నేళ్ళక్రితం-బెజవాడనుంచి ఒక నాటక సమితి మద్రాసు నగరం వచ్చి 'కళాసాగర్' సంస్థవారికి ''కలైవానర్ అరంగం''లో నాటకం ప్రదర్శించింది. (ఇక్కడ ఒక మాట చెప్పుకోవాలి.'కలైవానర్'అనేది హాస్యనటుడు ఎన్.ఎస్ కృష్ణన్‌కి ఇచ్చిన బిరుదు. అతని పేరుమీదనే ఆ 'అరంగం'(థియేటర్) వుంది. అంతకుముందు ఆ థియేటర్ పేరు-చిల్డ్రన్స్ థియేటర్. ఆపేరు మార్చి, ఆ గౌరవాన్ని ఒక హాస్యనటుడికిచ్చారు తమిళనాడు ప్రభుత్వం వారు. అతనికి మద్రాసులో ఒక కూడలిలో విగ్రహంం వుంది. అతని పేరుమీద పెద్దరోడ్డు కూడా వుంది. మనకీ హాస్యనటులువున్నారు. అలాంటి గౌరవాలు ఏవీ?) ఆ నాటకంలోని హీరో పాత్రధారి అక్కినేని నాగేశ్వరరావును అనుకరిస్తూ నటించినట్టు కనిపించాడు. చేతులు తిప్పడం, డైలాగులు చెప్పడం - చూసినవాళ్లంతా అంతే ఫీలయ్యారు. ఆ నటుడు అక్కినేనిలా ఫీలయ్యాడు. సరే,నాటక ప్రదర్శన బావుంది. అందరూ బాగా చేశారు. నాటక రచనా బావుంది. ఆ హీరో వేసిన 'అనుకర అక్కినేనే'ఆ నాటకం రాశాట్ట. ఆయన పేరు జంధ్యాల. సినిమా రంగానికీ, సినిమా వాళ్లకీ అప్పటికి ఆయన తెలీదు.



తర్వాత

తర్వాత జంధ్యాల రచయితయి, దర్శకుడిగా కూడా ప్రఖ్యాతి ఆర్జించిన తర్వాత ఆ మాటనేను ఆయన్ని అడిగాను - "ఆనాటి నాటకంలో మీరు అక్కినేనిలా నటించాలని నటించారా?"అని. "నేనా?అక్కినేనా! అలా ఇమిటేట్ చెయ్యాలని చెయ్యలేదు. ఆయన మంచి నటుడు కదా, ఆ ప్రభావం నా మీద వుంది. అంచేత,ఆ లక్షణాలు కనిపించాయే గానీ, అనుకరించలేదు. ఐనా,ఒకరి ప్రభావం ఇంకొకరి మీద వుండడం సహజం. నాటకాల్లో తండ్రి వేషాలు వేసేవాళ్లు గుమ్మడిలాగో, రంగారావులాగో చెయ్యాలనీ తాపత్రయ పడతారు. మనకీ అని ఒక బాణీలేనపుడు, ఈజీగా వుంటుందని-ఒకరి నటనను స్ఫూర్తిగా తీసుకుంటాం. అన్నట్టు-అదే మీరన్నట్టు 'అక్కినేని వారిలా చెయ్యాలని చూశాడు' అన్నమాట విన్న తర్వాత అలా నటించడం మానేశాను. అసలు,నటించడం కూడా బాగా మానేశాను." అని చెప్పి ఒక జోక్ చేశారు-"నేను సినిమాల్లో వేషాలకి ప్రయత్నించాననుకోండి. నేను అక్కినేని నాగేశ్వరరావుగారిలా నటిస్తాను" అని అంటే-''నువ్వు మళ్లీ ఎందుకు? ఆయనేవున్నారుగా అనేవారు కదా డైరక్టర్లు!" అని నవ్వారు జంధ్యాల-మెత్తగా.

మెత్తగా మాట్లాడ్డం, మెత్తగా నవ్వడం జంధ్యాలగారి లక్షణాలు. ఆయనతో మాట్లాడుతున్నప్పుడు లక్ష క్షణాలు అక్కర్లేదు గాని, క్షణాల్లో ఆ లక్షణాలు గ్రహించవచ్చు. సుహాస్యప్రియుడు. మనిషిలో హడావుడి, ఆర్భాటం కనిపించవు. ''సింపుల్ అండ్ సాఫ్ట్''అని ఆంగ్లంలో చెప్తేగాని, తెలుగులో అర్ధంకాని మనిషి. "రావు గోపాలరావు"షూటింగ్ జరుగుతోంది (ఆయనే రచయిత, దర్శకుడూ అని జ్ఞాపకం చెయ్యాలా?) ఆ షూటింగ్‌లో రావుగోపాలరావు, చంద్ర మోహన్, పొట్టి ప్రసాద్, నేనూ- ఇంకా స్టూడెంట్స్ వగైరాలున్నాం. పొట్టి ప్రసాద్ పొద్దున షూటింగ్‌కి రాగానే,"నాకేమైనా డైలాగ్స్ వుంటే ఇప్పుడే చెప్పండి బాబూ" అని సహాయ దర్శకుడ్ని అర్ధించి వెంటబడ్డాడు. "ఇప్పుడు లేవు" అని అతను దర్శకుడి వెంటవెళ్ళాడు. మరికొంతసేపటికి మళ్ళీ అలాగే అడిగి అతను లేవంటే, చిరాకు పడ్డాడు ప్రసాద్- "పొట్టి ప్రసాద్ అంటే లాకాయి లూకాయి అనుకుంటున్నారా? నాకుడైలాగ్స్ లేకపోవడం



ఏమిటి? ఆహా(!'' అని గద్దించినట్టు మాట్లాడాడు. నాతో కూడా అన్నాడు ప్రసాద్-''నేను ముందుగా చెప్పర్రా. డైలాగ్ అప్పటికప్పుడు చెప్పి, చెప్పమంటారు. ముందుగా ఇస్తే పేజీడువున్నా పేచీ లేకుండా చెప్పొచ్చుకదా పెర్ఫెక్ట్‌గా"అని. నేను వూరుకోకుండా మెల్లిగా జంధ్యాల గారికి అంటించాను. "డైలాగ్ లేదా ఎవరన్నారు ప్రసాద్‌కి డైలాగ్ లేదని! పెద్దడైలాగే వుందే"అన్నారు జంధ్యాల. ఓ పావుగంట తర్వాత,సహాయ దర్శకుడు పేజీన్నర డైలాగు తెచ్చి ప్రసాద్‌కిచ్చి, "ఓ అరగంటలో షాటు వస్తుంది డైరెక్టరుగారు కంఠతా పట్టమన్నారు"అన్నాడు. ప్రసాద్ దబ్బుని కింద పడ్డాడు. "ఇంత పెద్ద డైలాగా ఓర్నాయనో- అదేకదా, ప్రొద్దున్నుంచి అడుగుతున్నాను. లేదులేదని విసిరికొట్టారు!.... నన్నింకెవరూ డిస్టర్బ్ చెయ్యద్దు" అని ఆ కాయితాలు తీసుకుని ఓమూల కూచుని చదవడం ఆరంభించాడు. కంఠతా పట్టాడు-కొంత వరకూ డైలాగ్ కూడా తికమకగా వుంది. నోటికి పట్టడం లేదు. "ఓర్నాయనో"అనుకుంటున్నాడు. సహాయ దర్శకుడు మళ్లీవచ్చి "డైరక్టరుగారు ఆ డైలాగ్

మధ్యాహ్నం తీస్తానన్నారు మీకు టైము ఇవ్వాలని" అనేసి వెళ్లిపోయాడు. భోజనం కూడా సరిగా చెయ్యకుండా పొ.ప్ర-ఆ డైలాగ్‌తో కుస్తీ పడుతున్నాడు. అవస్థపడుతున్నాడు. "ఏం ప్రసాద్ గారూ!డైలాగ్ వచ్చేసిందా?ఒకే షాట్‌లో తియ్యాలి రెడీయా?"అని ఓ కేక వేశారు జంధ్యాల. "వచ్చేసింది సార్.... వవవ్వచ్చేసింది.."అన్నాడు ప్రసాద్- కంగారు కంగారుగా. ఓ కుర్రాణ్ణి ఎదురుగా పెట్టుకుని ముక్కాముక్కా వప్ప జెబుతున్నాడు ప్రసాద్. ఒళ్లంతా చెమటలు పడుతున్నాయి.

సాయంకాలం ఐదుగంటలయింది. షూటింగ్ 'పాకప్'చెప్పారు జంధ్యాల. "నా డైలాగో,నాడైలాగు"అని ప్రసాద్ బెంబేలెత్తి పోయాడు. జంధ్యాలగారి దగ్గరకి పరుగెత్తాడు. "చాలావరకూ వచ్చేసింది సార్ డైలాగు- రేపు తీస్తారా?" అని అడిగాడు. జంధ్యాల గారు ఏమీ ఎరగనట్టు మొహంపెట్టి అమాయకంగా చూసి, "డైలాగా! ఏ డైలాగు?"అన్నారు. ప్రసాద్ దిగ్గుమన్నాడు.."అదే..ఈఈ...పెపెద్ద..."అని నసిగితే,జంధ్యాలనవ్వేశారు-ప్రసాద్‌ని ఏడుపు మొహంపెట్టించి.అదంతా ఆయన చేసిన చమత్కారం. నిజంగా డైలాగ్ లేదు!పొద్దున్న నేను డైలాగ్ సంగతి చెప్పగానే, ఆయన "ఓ పని చెయ్యండి-ఏదో ఒకటి పేజీన్నర డైలాగ్‌లాగా రాసేయండి. రాసి, అసిస్టెంట్ చేత కాపీ చేయించి ఇచ్చేయమనండి"అన్నారు సైలంట్‌గా. అదీ అయన జరిపించిన నాటకం. ప్రసాద్ నివ్వెరపోయాడు, నీరస పడ్డాడు, నీల్గాడు- "ఏంటిసార్ ఇంతలా ఏడిపించారు?"అన్నాడు. "ఇంకెప్పుడూ డైలాగో డైలాగో అని ప్రాణం తియ్యకండి." అన్నారు జంధ్యాల నవ్వుతూ. గోపాలరావుగారు, చంద్రమోహన్,నిర్మాత జయకృష్ణ అందరూ ఒకటే నవ్వు! "మంచిపనయింది"అన్నారు అంతా. ప్రసాద్ కూడా ఏడ్వలేక నవ్వాడు. అలాంటి కులాసా వాతావణం కనిపిస్తుంది-జంధ్యాలగారి షూటింగ్‌లో. పొట్టిప్రసాద్‌చెప్పినట్టు "నా మీద కాస్ట్లీ జోక్ పేల్చార్రా బాబూ" -అన్నట్టు.

"చంటబ్బాయ్"లో నేను వేశాను- దొంగ డిటెక్టివ్ వేషం. నేనుదొరికిపోయానూ- ఆషాటుతీశారు."అంతేనా... దీంతో క్యారెక్టర్ అయిపోయిందా?"అని అడిగాను. "లేదు లేదు



పోలీసులు రావడం,మిమ్మల్ని అరెస్టు చెయ్యడం, వ్యాన్‌లో ఎక్కించి తీసుకువెళ్లడం,కోర్టు,మీకు జైలు- ఆ సీన్లన్నీ వున్నాయి."అన్నారు సీరియస్‌గా. ఆ సీరియస్‌నెస్‌లోంచి చిరుహాసం బయట పడుతోంది. "వద్దులెండి-అర్థమైంది. పొట్టి ప్రసాద్‌కి చేసినట్టు, నాకూ చెయ్యకండి" అని, "రావుగోపాలరావు" సంఘటన గుర్తు చేశాను, నవ్వారాయన.

చందమామ విజయా కంబైన్స్‌కి ఆయన ఒక సినిమా చెయ్యాలని, డిస్కస్ చేశాం. ఎన్నో కథల మధ్య స్క్రిప్ట్ రాసేశారుకూడా. అప్పుడన్నారు జంధ్యాల-"నా మొదటిసినిమా 'ముద్ద మందారం' కి పూర్తిస్క్రిప్టు రాశాను. మళ్లీ ఇప్పుడే రాయడం!" అని ఆ సినిమా లొకేషన్లు చూడ్డానికి ఆయన,నేను,కోడైరక్టరు కె.వి.రావు గారు- రాజమండ్రి, విశాఖపట్నం తిరిగాం.

రాజమండ్రిలో ఒక హోటల్‌కెళ్లి-దోసెలు ఆర్డరిచ్చాం.దోసెలు తెచ్చాడు సర్వ్వులకూ సర్వుచేసే సర్వరు. జంధ్యాలగారు దోసెమీద చెయ్యి పెట్టారు-చల్లగా వుంది. "మీది?" అన్నారు. అదీ అలాగే వుంది. ఆయన వెంటనే, సర్వర్‌ని పిల్చారు. "దోసెలు అర్జెంటుగా పాక్ చేసి ఇవ్వాలి. ఒక ఇరవై కావాల్సి వుంటుంది. రెడీగా వున్నాయా?వెయ్యాలా?" అని అడిగారు జంధ్యాల. అతను రెడీగా వేసే వున్నాయన్నాడు. చల్లగా చచ్చాయి కాబట్టి తెలిసింది" అన్నారు సర్వరు దిగ్గుమని పడిపోయేలా. వాడి దగ్గర నిజం రాబట్టడానికి, జంధ్యాలగారు అడిగిన విధానం- తమాషా అయిన ఒక చమత్కారం.

ఆ ట్రిప్పులోనే ఒక చోట ఒక లాయర్ గారు కలిసి,"మిమ్మల్ని ఇంటిపేరుతోనే అందరూ జంధ్యాల అంటున్నారు. మీ పూర్తిపేరేమిటో తెలుసుకోవచ్చా?" అని అడిగారు. "పూర్తి పేరు జంధ్యాల" అన్నారు జంధ్యాల.

"అది ఇంటిపేరు ...మీపేరు...?"

"జంధ్యాల"

"కాదుసార్-మీకు నామకరణం చేసిన పేరు?"

"జంధ్యాల"

అంతే! ఆ లాయరు గారు మరేం మాటా,పలుకూ లేకుండా చిర్నవ్వుతో నిష్క్రమించారు. మాతో వచ్చిన జంధ్యాలగారి మిత్రుడు-"అవును మాకు కూడా తెలీదు - మీపేరు మాకైనా చెప్తారా పోనీ?"అని అడిగితే-"జంధ్యాల"అన్నారు ఆయన మళ్లీ. "ఆయన పేరు చెప్పడానికి మొహమాట పడుతున్నారు ఇంక అడగొద్దులెండి" అన్నాన్నేను.

చందమామ విజమావారి "బృందావనం" తీస్తున్నప్పట్నుంచీ ఆయన అడుగుతూ వచ్చారు. "ఎప్పుడు చూపిస్తారు సినిమా?"అని. మొదటి కాపీ రాగానే, బయట థియేటర్లో వేసి, నేను,మాధవ పెద్ది సురేష్ మా మిత్రుల్ని ఆహ్వానించాం. జంధ్యాల గారు వచ్చి చూసి, బాగుందని చెప్పకుండా-"ఎందుకు తీసారీ సినిమా? ఎవరు చూస్తారు? ఒక ఫైట్‌లేదు. గ్రూప్ పాటలేదు,బూతు డైలాగుల్లేవు,అసభ్యమైన దృశ్యాల్లేవు అబ్బే"అన్నారు -సీరియస్‌గా. ఇన్‌డైరెక్ట్ భాషలో పొగిడి, తర్వాత అన్నారు. "ఇలాంటి సినిమాలతో మళ్లీ తెలుగు సినిమా ధోరణి మారాలి".

"హ్యూమరు ఆరోగ్యానికి మంచిది. ఆ హ్యూమరే ఆరోగ్యంగా లేకపోతే? అది హేమర్ అవుతుంది. 'సుత్తి' వీరభద్రరావు, 'సుత్తి'వేలు కలిసినట్టు" అని జోక్ చేశారు-ఉత్తమమైన హాస్యం కోసం పరితపించి, తపించిన జంధ్యాల. ■

# చిత్రగుప్త మాధుర్యం లాలిత్యం

## ఆయన సంతకాలు



అసామాన్య శాస్త్రీయ సంగీత వైదుష్యం లేదు; వెనక పెద్ద పెద్ద బ్యానర్లు లేవు; ఈయన నంగీతమే కావాలని పట్టుబట్టే హీరోల అండలేదు. నిర్మాతలకు ఈయన పేరు సిఫారసు చేసే ప్రముఖ గాయకుల వెన్నుదన్ను లేదు. అయినా దాదాపు 250 చిత్రాలకు మధురమైన సంగీతం అందించి, తన ట్రేడ్ మార్కును వదిలి వెళ్ళిన చక్కని సంగీత దర్శకుడు చిత్రగుప్త.

1917 నవంబరు 16న బీహార్ లో జన్మించిన చిత్రగుప్త బహుశా ఆనాటి సంగీత దర్శకులందరి లోకీ విద్యాధికుడై ఉంటారు. ఎం.ఎ ఎకనమిక్స్, జర్నలిజం చేసిన ఆయన మరే వృత్తిలోనైనా రాణించేవాడే, కానీ స్వయంగా గాయకుడు కావడం, మిత్రుల ప్రోత్సాహం లభించడంతో,సినీ రంగ ప్రవేశం చేసి, హిందీ చలనచిత్రరంగంలో శాస్త్రీయ బాణీలకు పేరు పెట్టిన ఎన్. ఎన్. త్రిపాఠీ (సంగీత్ సామ్రాట్ తాన్‌సేన్ వంటి సినిమాల సంగీత దర్శకుడు) శిష్యరికం చేసి, ఆయన అసిస్టెంట్ గా పనిచేశారు. మార్పును సహించని త్రిపాఠీ, కొత్తదనం కోసం అర్రులు చాచే చిత్రగుప్తల మధ్య అతి తక్కువ కాలంలోనే విభేదాలు వచ్చి, ఆయన స్వతంత్రంగా సంగీతం అందించడం ప్రారంభించారు. 1946లో లేడి రాబిన్ హుడ్ నుంచీ, 1985లో ఘర్ ద్వార్ వరకూ చిత్రగుప్త ఏనాడూ అగ్రశ్రేణి నాయకత్వం వహించక పోయినా, ఎస్.డి.బర్మన్,శంకర్-జైకిషన్,నౌషాద్, రోషన్,మదన్ మోహన్ ఇత్యాది హేమాహేమీల మధ్య తన ఉనికిని నిలబెట్టుకోగలగడమే చాలా గొప్ప విషయం.

చిత్రగుప్త నంగీతంలోని ప్రత్యేకత-మాధుర్యం! చాలా సరళమైన మట్టు, మూడ్‌కి తగిన రాగం, ఎవరైనా ఆనందంగా పాడుకోగలిగిన మృదుత్వం ఆయన సంతకాలు. ఆ కాలం నాటి నంగీత దర్శకులు చాలా మందికి లాగే ఆయనకు కూడా ప్రధానమైన గాయక ద్వయం రఫీ,లతాలే. రఫీ పాడిన 'జాగ్ దిలే దీవానా రుతు జాగి' (ఊంచేలోగ్), 'ముఝే దర్దే దిల్ కా పతా నథా, ముఝె ఆప్ కిస్ లియే మిల్ గయే'(ఆకాశ్ దీప్, 1965), లతా పాడిన 'దిల్ కా దియా జలాకే గయా యె కౌన్ మేరీ తన్‌హాయీ మే'(ఆకాశ్ దీప్), 'దీవానె తుమ్ దీవానే హమ్',ఆజ్ కీ రాత్ నయా చాంద్ లేకే ఆయీ హై'(షాదీ,1962), ముస్కరావో కీ జీ నహి లగతా (కంగన్,1959) వంటి పాటలు ఈ సారళ్యానికి చక్కని ఉదాహరణలు.

చిత్రగుప్త దురదృష్టం ఎలాంటిదంటే, ఆనాటి ప్రముఖ సంగీత దర్శకులు సంగీత దర్శకత్వం చేయని, చేయడానికి ఇష్టపడని స్టంటు సినిమాలు - లేడీ రాబిన్ హుడ్, ఫైటింగ్ హీరో, తూఫాన్ క్వీన్,(1946) వంటివి - పౌరాణిక సినిమాలు - శివరాత్రి(1954), నాగపంచమి (1953), శివభక్త్(1955) వంటివి - ఆయనకు మిగిలేవి. వీటిలో ఆయన చక్కని నంగీతం ఇవ్వలేదని కాదు. శివభక్త్‌లో రఫీ పాడిన 'ప్రభు తేరే చరణ్ పడే జహా జహా హై గీత్ హమారా వహీ కహీ' ఈనాటికీ వివిధ్ భారతిలో తరచు మోగుతూనే ఉంటుంది, మననసును ఆర్ద్రం చేనస్తూనే ఉంటుంది.

కానీ తెలుగులోలా హిందీలో పౌరాణిక సినిమాలు మెయిన్‌స్ట్రీమ్ సినిమాలు కావు. వాటిలో ఎంత చక్కని సంగీతం సమకూర్చినా, వాటికి లభించే ఆదరణ తక్కువే. ఆయనకంటూ ప్రోత్సహించడానికి ప్రత్యేకమైన బ్యానర్లు, నిర్మాతలు ఎవరూ లేకపోయినా,తన విశిష్టమైన సంగీత శైలి వల్ల దక్షిణాది సూపర్ హిట్ నిర్మాతలను ఆయన ఆకర్షించారు. ఎ.వి.యం. వారికి శివభక్త్, మై భీ లడ్‌కీ హూ,1964 (నాదీ ఆడజన్మే)లతో సహా చాలా సినిమాలకు ఆయన సంగీతం అందించారు.

1960 దశకంలో చిత్రగుప్త ఆశించిన విజయాలు ఆయనకు లభించాయి. భాభీ(1957), మైచుప్ రహూంగీ(1962), బర్‌ఖా(1959), ఏక్ రాజ్(1963), గెస్ట్ హౌస్(1959), గంగా కీ లహరే(1964), మై షాదీ కర్ నే చలా(1962), ఒపెరా హౌస్(1961), ఔలాద్(1961), వాస్నా(1968), ప్యార్ కా నప్నా(1969),అంతకు ముందు వచ్చిన పతంగ్(1960), మేరా కుసూర్ క్యా హై(1964), ఘర్ బసాకే దేఖో(1963). చిత్రగుప్తకు మంచి పేరు తెచ్చి పెట్టిన చిత్రాలు.

చిత్రగుప్త సంగీతంలోని విలక్షణత రెండు విషయాల్లో స్పష్టం. ఒకటి - యుగళ గీతాల స్వర రచనలో ఆయన అందెవేసిన చేయి. అందులోనూ గాయనీ గాయకులు లతా,రఫీ అయితే, ఆ మాధుర్యం చెప్పనే అక్కర్లేదు. అలాంటి యుగళ గీతాల్లో కొన్ని:

'చుఫాకర్ మేరి ఆంఖో‌ కో వో పూఛే కౌన్ హై' (భాభీ, 1957)

తెరీ దునియాసే దూర్ - చలే హోకే మజ్ బూర్ (జబక్,1961)

చాంద్ జానే కహా ఖొగయా - తుమ్ కో చెహరే సే పర్దా హటానా థా (మై చుప్ రహూంగీ,1962)

యె పర్‌బతోంకే దాయిరే - యే శామ్ కా సమా



(వాస్నా,1968)
అరమా థా హమే జిన్ కా వో ప్యార్ కే దిన్ ఆయే
(ఔలాద్,1968)

రఫీ లతాల తోనే కాక, ముఖేశ్,సుమన్,కిశోర్ లతాల కాంబినేషన్ లో కూడా చిత్రగుప్త చాలా చక్కని యుగళాలు అందించారు. ఆశా, తలత్ పాడిన దోదిల్ ధడక్ రహే హై ఔర్ ఆవాజ్ ఏక్ హై (ఇన్సాఫ్,1973),ముఖేశ్,లతా పాడిన 'ఏక్ రాత్ మే దోదో చాంద్ ఖిలే'(బర్ఖా) వంటివి ఎన్నో. యుగళగీతం సన్నివేశం, నాయికా నాయకుల మనస్థితులు ఈయన స్వర రచనా సృజనకు కొత్త పదును పెట్టాయనిపిస్తుంది.

శాస్త్రీయ సంగీతంలో కూడా చిత్రగుప్త ఎవరికీ తీసిపోలేదు. కిశోర్ పాడిన శాస్త్రీయ గీతం అంటూ ఎవరైనా వెతికితే మొదట గుర్తొచ్చే 'పాయల్ వాలీ దేఖనా'(ఏక్‌రాజ్,1963) చిత్రగుప్త సంగీతం దర్శకత్వం లోనిదే. అలాగే మధుబన్ మే రాధికా వంటి విన్యాసాలు కలిగిన రఫీ పాట 'అఖియన్ సంగ్ అఖియా లాగె ఆజ్'(బడా ఆద్మీ) చిత్రగుప్త స్వరరచనే.ఎక్కువగా రఫీ కే పాటలు ఇచ్చిన చిత్రగుప్త సంగీత దర్శకత్వంలో 'ముఫ్త్ హువే బద్‌నామ్'(బారాత్), దేఖో మౌసమ్ క్యా బహార్ హై, సారా ఆలమ్ బేకరార్ హై (ఒపేరా హౌస్) వంటి హిట్ పాటలు ముఖేశ్, 'అగర్ సున్ లే కి ఎక్ నగమా హుజూరే యార్ లాయా హూ', (ఏక్ రాజ్) ఛేడోన మేరి జుల్ఫే (గంగాకి లెహరే) వంటి హిట్‌పాటలు కిశోర్ పాడి, చిత్రగుప్త విజయాల్లో పాలు పంచుకున్నారు.

ఈ అపురూప సంగీత దర్శకుడి పొదిలో మరో అస్త్రం, ఆయన హిట్ పాటలు తెలుగు వారు 'అనుకరించడం'. చల్‌చల్ రె పతంగ్ మేరే చలీరే, - పద పదవే వయ్యారి గాలి పటమా గాను, చల్ ఉడ్‌జారే పంఛీ - పయనించే ఓ చిలుకా గాను, దిల్ కా దియా - నా ఊహలో హలో గాను, మై కౌన్ హూ మై కహా హు ముఝే యే హోశ్ నహీ - నిజమైనా, కలయైనా, నిరాశలో ఒకటేలే గానూ మనకు తెలుగులోకి తర్జుమా అయ్యాయి.

చిత్రగుప్త పాటలు సంఖ్యలో తక్కువే. కానీ, మనసును తాకి, కరిగించి, ఒక హాయిని, మాయనీ కలిగించడంలో అసామాన్యమైనవి. భోజ్‌పురి చిత్రాలలో అగ్రశ్రేణి సంగీత దర్శకుడిగా గుర్తింపు పొందిన చిత్రగుప్త, ఒక పాటలో 'ఇత్ నీ నాజూక్ న బనో'అని రఫీ చేత పాడించినా, తను నాజూకుకే పరిమితమై, ఎక్కువ వైవిధ్యం లేని సంగీత దర్శకుడిగా ముద్ర వేయించుకున్నాడు. ఆయన శక్తి వైవిధ్యంలో లేకపోవచ్చు. కానీ సున్నితత్వంలో ఉంది. మాధుర్యంలో ఉంది. అతి తక్కువ స్వరాలలో అతిఎక్కువ భావం పలికించడంలో ఉంది. ఆయన సంగీతంలో ఎంత నిరాడంబరత ఉందో, ఆయన వ్యక్తిత్వంలో అంత ఔన్నత్యం ఉంది. చిత్రగుప్త పాటల్లో ఎక్కువ భాగం మజ్రూ సుల్తాన్‌పురీ రాసారన్న విషయం అందరికీ తెలిసిందే. 'దోస్తీ' చిత్రానికి సంగీత దర్శకత్వానికి ఎంపికయిన కొత్త సంగీత దర్శకులు లక్ష్మీకాంత్ ప్యారెలాల్ లకు గీతరచన చేయడానికి మజ్రూహ్ తటపటాయిస్తూంటే, 'ఈ యువకుల్లో ప్రతిభ ఉంది. మీరు వెనకాడకుండా వారికి రాయండి' అని ప్రోత్సాహించి అంత అద్భుతమైన మాట, పాటల సంయోజనానికి పరోక్షంగా కారకుడైన వ్యక్తి చిత్రగుప్తే. (దోస్తీకి మొదట అనుకున్న సంగీత దర్శకుడు రోషన్).

చిత్రగుప్త సంగీతంతో ఏ మాత్రం పరిచయం ఉన్నవారైనా కయామత్ సే కయామత్ లో 'పప్పా కెహతేహై బడా నామ్ కరేగా' వినగానే అందులో ఆయన సంగీత లక్షణాలను పసిగట్టేస్తారు. ఆయన పుత్రులు ఆనంద్ మిళింద్ చాలా వరకు తండ్రి మాధుర్యాన్ని పుణికి పుచ్చుకున్నారు. కానయితే, ఈ రేసు యుగంలో వాళ్ళు పోటీలకి దిగి, నాణ్యతను కోల్పోతున్నారు. తండ్రి వేదాంతాన్ని వంట బట్టించుకుని, కొన్ని సినిమాలకే పరిమితమైతే, ఆయన లేని లోటును వారు తప్పక తీర్చగలుగుతారు. ఆయన పాటలోనే లతా చెప్పినట్లు, 1975 తర్వాత తెరమరుగైన చిత్రగుప్తను తలుచుకుని ఆయన అభిమానులు 'తడపావోగీ, తడప్‌లో దిల్ తడప్ తడప్ కర్ భీ తుమ్హారే గీత్ గాయేగీ' అని పాడుకుంటూనే ఉంటారు.

**- మృణాళిని**

# చిత్రగుప్త హిట్స్

**చిత్రం: బాభీ(1957)**

గానం: మహమ్మద్ రఫీ రచన: రాజేంద్రకిషన్

చల్ ఉడ్‌జా రే పంఛీ...
చల్ ఉడ్‌జా రే పంఛీ కే అబ్ యే
దేస్ హువా బేగానా ॥చల్॥
భూల్ జా అబ్ వో మస్త్ హవా... వో ఉడ్‌నా డాలీ డాలీ ॥2॥
జగ్‌కీ అంఖ్‌కా కాంటా బన్‌గయీ
చాల్ తెరీ మత్‌వాలీ
కౌన్ భలా ఉస్ బాగ్‌కొ పూఛే.... ॥2॥
వో నా జిస్‌కా మాలీ తేరీ కిస్‌మత్ మే లిఖాహై
జీతే జీ మర్ జానా ॥చల్॥
రోతే హై వో పంఖ్ పఖేరూ సాథ్ తేరే జో ఖేలే ॥2॥
జిన్‌కె సాథ్ లగాయే తూనే అర్‌మానోంకే మేలే
భీగీ అఖియోంసే హీ ఉన్‌కీ ఆజ్ దువాయేం లేలే
కిస్‌కో పతా అబ్ ఇస్ నగ్‌రీమే
కబ్ హో తేరా ఆనా ॥చల్॥

**చిత్రం: జబక్ (1961)**

గానం: లతామంగేష్కర్, మహమ్మద్ రఫీ రచన: ప్రేమ్ ధవన్

అ: తెరీ దునియాసె దూర్ చలె హో కె మజ్‌బూర్
హమె యాద్ రఖ్‌నా ॥2॥
ఆ: జావో క హీ భీ సనమ్ తుమ్హె ఇత్‌నీ కసమ్
హమె యాద్ రఖ్‌నా ॥2॥ ॥తేరీ॥
అ: ఆయేంగీ బహారే తొ తేరే హీ ఫసానే సునాయేంగీ హమే ॥2॥
ఆ: హోగీ తన్‌హాయీ తో ఆకే తెరీ యాదేం రులాయేంగీ హమే
రులాయేంగీ హమే తడ్‌పాయేంగీ హమే
అ: కభీ దేఖీ థీ బహార్ కభీ హమ్ సే థా ప్యార్
జరా యాద్‌రఖ్‌నా ॥జావో॥
ఆ: లేజా జానె వాలె జొ ఆయే మేరే దిల్ కీ కిసిసే క్యా గినా ॥2॥
అ: తెరీ హీ ఖతా హై న మేరీ హీ ఖతాహై జో హోనా థా హువా
జో హోనా థా హువా హై కిసీసే క్యాగిలా
ఆ: దేఖో రోయే మేరా ప్యార్
కహె దిల్ కీ పుకార్ హమె యాద్ రఖ్‌నా ॥తేరే॥

**చిత్రం:మైం భీ లడ్కీ హూం(1964)**

గానం: లతా మంగేష్కర్,పి.బి.శ్రీనివాస్ రచన: రాజేంద్రకిషన్

అ: చందాసే హోగా వొ ప్యారా పూలోంసె హోగా వొ న్యారా
ఆ: నాచేగా ఆంగన్ ఛమ్ ఛమ్
నన్హాస మున్నా హమారా ॥చందా॥
ఆ: ఆ.......... అ: ఆ.......
అ: ఖిల్‌తీ హో జైసే కలీ సీ హోగీ జబాజ్తె తోంతిలీసీ
ఆ: ఖిల్‌తీ హో జైసే కలీ సీ హోగీ జబాజ తోంతిలీసీ
పాపా ఓ మామా ఓ బాబా
పక్ లేగె హమ్ చాంద్ తాలా ॥చందా॥
అ: ఆ......... ఆ: ఆ.........
అ: అబ్ తక్ ఛుపాహై వొ ఐసే సీపీ మె మోతీ హో జైసే ॥2॥
ఆ: పరియోంకి నగరీ సె చల్‌కర్
ఆతా హి హోగా దులారా ॥చందా॥

**చిత్రం: ఒపేరా హౌస్(1961)**

గానం: లతా మంగేష్కర్,ముఖేష్ రచన: మజ్రూహ్ సుల్తాన్‌పురి

అ: దేఖో మౌసమ్
ఆ: క్యా బహార్ హై
అ: సారా ఆలమ్
ఆ: బేకరార్ హై
అ: ఐసే మే క్యూ హమ్
ఆ: దివానే హో జాయేనా అ: ॥దేఖో॥
ఆ: ఛల్‌కీ ఛల్‌కీ
అ: చాంద్‌నీ భి హై
ఆ: హల్కీ హల్కీ
అ: బేఖుదీ భి హై
ఆ: ఐసే మే క్యూ హమ్
అ: యహీ పర్ ఖోజాయేనా
అ: రండీ రండీ రేత్ మే జిల్‌వోంకీ బర్‌సాత్‌హై
ఆ: క్యా మస్తానా హై సమా క్యా మత్‌వాలీ రాత్ హై ॥రండీ॥
అ: ఓ..సప్‌నే బిఖ్‌రే
ఆ: మోడ్ మోడ్ పే
అ: అంఖె నైనా
ఆ: జోడ్ జోడ్ కె
అ: ఐసే మే క్యూ హమ్
ఆ: దివానే హో జాయేనా
ఛల్‌కీ ఛల్‌కీ
అ: చాంద్‌నీ భి హై
ఆ: హల్కీ హల్కీ
అ: బేఖుదీ భి హై
ఆ: ఐసే మే క్యూ హమ్
అ: యహీ పర్ ఖోజాయేనా
ఆ: గాతీసీ హర్ సాంస్‌మె బజ్‌తీసీ షహనాయియాం
అ: సాయా దిల్‌పె డాల్‌తీ తారోంకీ పర్ ఛాయియాం ॥గాతీసీ॥
ఆ: ఓ....ఝూకె చందా
అ: ఆస్‌మాన్‌సె
ఆ: ఛేడే హమ్‌కో
అ: జాన్ జాన్ కె
ఆ: ఐసే క్యూ హమ్
అ: యహీ పర్ ఖో జాయేనా అ: ॥దేఖో॥
అ: దరియాంకీ హర్ మోజ్ మే అర్‌మానోంకా జోర్ హై
ఆ: దిల్‌వాలోంకీ గీత్‌కా హల్కా హల్కా షోర్ హై ॥దరియా॥
అ: ఓ...లెహరేం దోలె
ఆ: ఝూమ్ ఝూమ్ కె
అ: సాహిల్ కా ముహ్
ఆ: చూమ్ చూమ్ కె
అ: ఐసే మే క్యూ హమ్
ఆ: దివానే హో జాయేనా
అ: దేఖో మౌసమ్
ఆ: క్యా బహార్ హై
అ: సారా ఆలమ్
ఆ: బేకరార్ హై
అ: ఐసే మే క్యూ హమ్
ఆ: దివానే హో జాయేనా

# సరిగపదమని

**10**

కూర్పు : టి.నవీన్

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ● | 3 | | | 4 |
| | ● | | ● | 5 | | ● | ● | |
| 6 | | ● | 7 | ● | | ● | 8 | |
| ● | ● | 9 | ● | 10 | | ● | | ● |
| 11 | | | ● | | ● | 12 | ● | 13 |
| ● | ● | ● | 14 | | ● | 15 | | |
| 16 | | ● | | ● | 17 | ● | ● | |
| | ● | 18 | ● | 19 | | | ● | |
| ● | ● | 20 | | ● | | ● | 21 | |

పంపినవారి పేరు :..........................................................

వయసు :.......... వృత్తి:..........................................................

చిరునామా :..........................................................

..........................................................

..........................................................ఫోన్:..........................

**నిబంధనలు:**

ఏ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**ఆధారాలు:**

**అడ్డం:-**

1. '..........కోసేటి పడుచుపిల్లోయ్' అంటూ పాడాడు దసరాబుల్లోడు(4)
3. 'కొడితే.......... సిక్స్‌కొట్టాలి'అన్నాడు రాగూరు.(4)
5. బుల్లి ...... బుజ్జి ...... గూటిలోని గువ్వ......అన్నాడు చినరాయుడు (2)
6. '.......... భూమి నాదేశం నమోనమామి' అన్నాడు మేజర్ చంద్రకాంత్ (2)
7. '.......కార నాదాను సంధానమౌ గానమె శంకరాభరణము అన్నాడు శంకరశాస్త్రి(1)
8. 'ఈనాటి ఈ...... కలకాదోయి నిజమోయి' (2)
10. ......... ......... చౌకా చక్కా- సా మారో అన్నారు బాయ్స్(2)
11. 'నువ్వేం మాయ చేశావో గాని' అనేపాట గల చిత్రం (3)
14. 'ఛల్........ .........'రైలుబండిపై చిత్రీకరించిన ఈపాటకు స్వరకల్పన రెహమన్(2)
15. '............ పంచామృతం' మోహన్‌బాబు అభినయించిన పాట(3)
16. '....... గొట్టి చెబుతున్నా తొలిమాట' చంద్రబోస్ రచించిన గీతం (2)
19. '.............పట్టి భామబళ్లో అఆ ఇఈ నేర్చుకుంటా' (3)
20. వటపత్రశాయికి వరహాల....... (2)
21. '....... ....... .... .... .......తెలుపను ఎదలోని ప్రేమను' ఉష పాడిన పాట(2)

**నిలువు:-**

1. ముత్యమంత .......... ముఖమెంతో ఛాయ (3)
2. ఇదిగో రాయలసీమ ........ దీని కథ తెలుసుకో తెలుగు బిడ్డ (2)
3. 'నను.......... తిట్టకురో మావో సుబ్బులు మావో' (4)
4. .......... చందమామా మా వింత గాథ వినుమా (3)
8. 'వెన్నెల్లో ...... ....... మల్లెల్లో........ ........ వరాల జల్లే కురిసే' (2)
9. '....... వారి మాటలకు అర్థాలే వేరులే' (2)
10. ......... ది మొగల్తూరు అల్లు అర్జున్ ఆడవేషంలో అభినయించిన పాట (3)
12. '....... ....... ....... మీనా కనుల సోనా'అంటూ పాడాడు శివమణి (2)
13. ................. పాటకావలా అని అడిగాడు అన్నయ్య (5)
14. '......రే బేటా ......, ....... ......రే బేటా ......' అన్నాడు కృష్ణదేవదాసు 'మేఘాలమీదసాగాలి' పాటలో (2)
16. '........వలపే పదే పదే పిలిచే' ఎన్.టి.ఆర్, సావిత్రి 'దేవత'లోని పాట (2)
17. '......... ఏతోడు లేక ఎటేపమ్మ ఒంటరినడక' సిరివెన్నెల సీతారామశాస్త్రి పాట(3)
18. ముక్కాలా ముక్కాబులా ...... ఓ...... (2)

**పజిల్, కూపన్ 15-01-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



31 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)



17పాటలు గల
సింగిల్ ప్యాక్ ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)



36 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




20 పాటలు గల
సింగిల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్

# 'సరిగపదమని-8'

**జవాబులు**

**అడ్డం:** 1. అందాల, 3. నలుగురికి, 7. ఏ 8. మనసున, 11. మాఊళ్ళో 14. వారు 15. మళ్ళీ 16.కలలో 17.మగ 18.మాను 19.దానా 21. దివి 22. కదిలే 23.అమ్మ

**నిలువు:** 1.అందరి 2.లక్కీ 3. నల్ల 4 గున్న 5.కిట 6.ఫేసు 9.నన్ను 10. నవ్వుల 11.మావా 12. ఊరుమనదిరా 13.రామచిలుకా 16.కనులు 20కొమ్మ

## కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

అద్దంకి శ్రీరామచంద్రమూర్తి- హైదరాబాద్, కోదాటి విజయలక్ష్మి- వరంగల్, పి.గిరిజ- ఒంగోలు, సి.పల్లవి- కర్నూలు, ఎ.ఎస్.ఆర్.కృష్ణ- ఏలూరు, పి.ఎస్.ఆర్.ప్రసాద్- నెల్లూరు, డి.రాధ- తణుకు, ఆమంచి వెంకటలక్ష్మికామేశ్వరి- రాజోలు (తూ॥గో॥జిల్లా), నండూరి రామానుజాచార్యులు- విజయవాడ, నిశ్శంకరరావు గంగాధరరావు- గుంటూరు, మోచెర్ల సురేష్- రాజమండ్రి, ఎ.రవికిరణ్- గుంటూరు, మద్దిపాటి సూర్య- హైదరాబాద్, హెచ్.లక్ష్మి- మధురనగర్, శిష్టా సీతామహాలక్ష్మి- హైదరాబాద్, పసుపులేటి ఝాన్సీ- మొగలికుదురు (తూ॥గో॥జిల్లా), జొన్నలగడ్డ జానకి రామశర్మ- ఒంగోలు, యు.విజయశేఖర్‌రెడ్డి- హైదరాబాద్, కె.జ్యోతిర్మయి- హైదరాబాద్, జీరాల సౌజన్య- గుంటూరు, ఎన్.సి.పద్మజ- హైదరాబాద్, జి.వరలక్ష్మి- అచ్చంపేట (మహబూబ్‌నగర్), తులసి ఫణి- కాకినాడ, కిశోర్‌కుమార్.ఆర్- గోదావరి ఖని (కరీంనగర్), సి.వి.రాజేశ్వరి- విశాఖపట్నం, బాలనాగు విజయసారథి- భీమడోలు (ప॥గో॥జిల్లా), సర్వ కృష్ణభాస్కర్- హైదరాబాద్, పి.నవీన- అనంతపురం, వై.బి.వి.ఆర్.మూర్తి- రాజాం, బి.వి.ఎస్.ప్రసాద్- పుల్లలపాడు (ప॥గో॥జిల్లా), ఆర్.ఫణిబాల- ధవళేశ్వరం (ప॥గో॥జిల్లా), మల్యాల హరిశ్రీకృష్ణ- హైదరాబాద్, సి.శారదాదేవి- హైదరాబాద్, పి.వి.జె.మురళి- హైదరాబాద్, పి.లక్ష్మికుమారి- ఖమ్మం, కొంపెల్ల వెంకటరత్నలక్ష్మి- విశాఖపట్నం, కక్కిరేణి చంద్రకళ- చౌటుప్పల (నల్గొండ), నందగోపాల్- విశాఖపట్నం, పాలంకిపాటి శ్రీనివాసరావు- విశాఖపట్నం, వి.వి.యస్.మందేశ్వరరావు- మండపేట (తూ॥గో॥జిల్లా), ఎస్.వాణీ స్వయంప్రభాదేవి- విశాఖపట్నం, గరిమెళ్ళ అన్నాజీరావు- అన్నవరం (తూ॥గో॥జిల్లా), అసర్లా భారతి- సికింద్రాబాద్, కె.వి.రమణమూర్తి- బరంపురం, జాగిర్దార్ మాధురి- సామర్లకోట (తూ॥గో॥జిల్లా), కె.వి.దుర్గ మోహనరావు- నల్గొండ, అడపా సత్యనారాయణబాబ్జి- హైదరాబాద్, సి.జి.శంకరరావు- హైదరాబాద్, జి.రాములు- గొల్లపూడి (కృష్ణా), వేదుల అపర్ణ- అనకాపల్లి, బి.ఎస్.రామరావు- హైదరాబాద్, గంటి విజయలక్ష్మి- అమలాపురం, యం.రఘువీర్- సికింద్రాబాద్, కె.శ్రీకాంత్- విజయవాడ, సి.హెచ్.అనురాధ- హైదరాబాద్, మరువాడ వెంకటరామనాగ- విశాఖపట్నం, డి.గురునాధరావు- విశాఖపట్నం, పి.వి.రామశర్మ- విశాఖపట్నం, బొమ్మకంటి రవికిషోర్- హైదరాబాద్, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ (కృష్ణా), జె.అహల్య- హైదరాబాద్, షేక్ కరీముల్లా- వినుకొండ (గుంటూరు), మద్ది బాలరాజు- నరసన్నపేట, మద్ది త్యాగరాజు- నరసన్నపేట, ఆర్.ఎస్.ఎస్.ఎన్.మూర్తి- హైదరాబాద్, సి.హెచ్.కళ్యాణ్ చక్రవర్తి- బిరహాంపూర్ (ఒరిస్సా), ఎన్.లక్ష్మిప్రభ-ఎస్.కోట (విజయనగరం), సురభి శ్రీరామం- కాకినాడ, ఎమ్.విజయలక్ష్మి- నడుకుదురు (తూ॥గో॥జిల్లా), కె.వి.శరవన్ కుమార్- సాదం (చిత్తూరు), ఎ.ఎం.పురుషోత్తమాచార్యులు- హైదరాబాద్, బాలినేని భావన- హైదరాబాద్, పి.రాణి- నరసాపురం, ఎస్.కె.షంషాద్- శ్రీశైలం డ్యామ్ తూర్పు, జవాంగుల శ్రీనివాస్- సత్తెనపల్లి (గుంటూరు), ఎ.రాజు- తణుకు (ప॥గో॥జిల్లా), ఆర్.వరలక్ష్మి- హైదరాబాద్, సి.శేషారావు- హైదరాబాద్, ఎ.సంగీతలక్ష్మి- పాతవరం (గుంటూరు), శ్రీరాముల ప్రసాద్- నిర్మల్ (ఆదిలాబాద్), కె.బి.కైలాస్‌నాథ్- అనంతపురం, ఎం.లక్ష్మి- అనంతపురం, బలిజేపల్లి సర్వలక్ష్మి- విజయనగరం, పి.తిరుమల్‌ప్రసాద్- హైదరాబాద్, కర్రి ఝాన్సీ- హైదరాబాద్, ఎమ్.రామలక్ష్మి- విజయవాడ, సి.శైలుష- గోదావరిఖని, ఎన్.హనుమంతరావు- చండూరు (నల్గొండ), ఆత్మూరి వెంకట శరత్‌కృష్ణ- హైదరాబాద్, మద్దాలి సువర్చలా శ్రీనివాస్- హైదరాబాద్, డి.కోమలి- మార్కాపూర్ (ప్రకాశం), సహారె ఈరణ్ణ- ఆదోని, యు.యు.ఉరుకుందు- ఎమ్మిగనూరు, ప్రసూనా పాణ్యం- కర్నూలు, ప్రవీణ్‌కుమార్.ఎస్- సంగం (నెల్లూరు), చీమలకొండ విజయలక్ష్మి- బెంగుళూరు, ఇప్పగుంట వెంకట శ్రీనివాసరావు- మౌలాలి, దారెల్లి శాంతిశ్రీ- పాల్వంచ (ఖమ్మం), చైతన్య వాంకుడోతు- న్యూపాల్వంచ (ఖమ్మం), ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, తాతిరాజు మోహన్‌రావు- విశాఖపట్నం, కె.సతీష్‌చంద్ర- విశాఖపట్నం, పులి నాగరత్నమ్మ- ప్రొద్దుటూరు (కడప), ఎ.ఎస్.ఎస్.గోపాల్- విశాఖపట్నం, బి.రేణుక కుమారి- నిజామాబాద్, ఇలపావులూరి మారుతి- అద్దంకి (ఒంగోలు), కె.ప్రమద- హైదరాబాద్, గండూరి స్వాతి- హైదరాబాద్, డి.వి.రఘు- హైదరాబాద్, ఎమ్.వి.వి.ఎస్.గోపాలకృష్ణ- విశాఖపట్నం, సి.వి.రామయ్య- గుడూరు, జె.రాజ్యలక్ష్మి- హైదరాబాద్, యం.జె.అనిల్ కుమార్ రెడ్డి- ఉరుటూరు (కడప), బాలాంత్రపు వేంకటరమణ- హైదరాబాద్, పొన్నం ఉమాదేవి- చిలకలూరిపేట, వై.రాజ్యలక్ష్మి- సికింద్రాబాద్, డా॥జి.మాధవి అశోక్- సిద్దిపేట (మెదక్), వై.ఎస్.ఆర్.శాస్త్రి- వడపల్లి (నల్గొండ), పి.పాపారావు- విశాఖపట్నం, జి.కళ్యాణిశర్మ- నంద్యాల (కర్నూలు), తాడిమళ్ళ వెంకటశేషగిరి రావు- రుద్రపాక (కృష్ణా), సి.హెచ్.పరాత్పరరావు- ఏలూరు (ప॥గో॥జిల్లా), అప్పల బత్తుల ఈశ్వరరావు- హైదరాబాద్, మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల (ఆదిలాబాద్), కె.పురుషోత్తమచార్యులు- విజయవాడ, పి.చెంచురామయ్య- తిప్పవరపాడు (నెల్లూరు), ఎన్.లీలాప్రసూనదేవి- హైదరాబాద్, యం.విజయలక్ష్మి- హైదరాబాద్, రాకేష్‌కుమార్- చీమకుర్తి (ప్రకాశం),మునిగోటి ఉమా లక్ష్మిశర్మ- మదనపల్లె (చిత్తూరు), సి.నళినికుమారి- సికింద్రాబాద్, డి.అమరేశ్వరరాయశర్మ- వార్తకాబిన్‌పేట (గుంటూరు), కె.ఎస్.ప్రకాశరావు- కంకిపాడు (కృష్ణా), ఎ.ఎస్.ఎన్.మూర్తి- మహబూబాబాద్, బి.రమేష్- బుగ్గలపల్లె (కడప), శోభా నాగరాజ్- హిందుపూర్ (అనంతపురం), బిహారాశేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), సి.విజయసారథి- కర్నూలు, వి.తిరుమల రెడ్డి- హైదరాబాద్, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, ఎమ్.శ్రీఅనుదీప్- కాకినాడ, జె.శర్వాణి- తిరుపతి, పి.వి.వి.ఆర్.ప్రతాప్- చీపురుపల్లి (విజయనగరం), వై.నాగేశర్వరావు- గుంటూరు, కె.లావణ్య- నంద్యాల (కర్నూలు), ఎస్.భారతి- హైదరాబాద్, ఎమ్.రామ్-మైదుకూరు (కడప), కె.వి.రమణారెడ్డి- హైదరాబాద్, సి.హెచ్.శ్వేత- చీపురుపల్లి (విజయనగరం), భమిడి సూర్యకామేశ్వరి రేవతి- హైదరాబాద్, ఎమ్.ఎస్.అనితాగురుప్రసాద్- మైసూర్ (కర్ణాటక), దూసి జయశ్రీ- హైదరాబాద్, సి.భువనేశ్వరి- శ్రీకాళహస్తి, మరువాడ కామేశ్వరరావు- విశాఖపట్నం, జి.బాలత్రిపుర సుందరి- ఆముదాలవలస (శ్రీకాకుళం), పి.శేఖర్‌బాబు- ధర్మసాగర్ (వరంగల్), అవధానం శివకుమార్- తిరుపతి, జి.కె.ఎస్.విశ్వనాథ్- కాకినాడ, మేడా మస్తాన్ రెడ్డి- విశాఖపట్నం, కె.పార్వతి- రాజమండ్రి, బొక్కి బర్నబాస్- రామతీర్థం(విజయనగరం), బి.ఇ.శ్రీనివాసమూర్తి- అనంతపురం, పసుమర్తి సరస్వతి- నెల్లూరు, నెల్లుట్ల రమాదేవి- హన్మకొండ, పూసరపు రోహిణి కృష్ణప్రియ- నర్సాపురం, పదాల రాము- పాతపట్నం, ఎమ్.వి.శాస్త్రి- చెన్నై, చల్లా సుబ్బలక్ష్మి-అత్తిలి (ప॥గో॥జిల్లా), యర్రా వాణి- కాకినాడ, మచ్చ ఆదిత్య- జగిత్యాల, చిట్టా విశ్వేశ్వరశాస్త్రి- హైదరాబాద్, మల్లంపల్లి సీతాకుమారి- హైదరాబాద్, బి.వి.ప్రసాద్- హుజూర్‌నగర్ (నల్గొండ), సామంచి రాధ- విజయవాడ, సన్నిధి రామలక్ష్మి- ఆకివీడు (ప॥గో॥జిల్లా), కె.సతీష్‌కుమార్- జగిత్యాల (కరీంనగర్), కె.వసుంధర- నల్గొండ, వడ్లమన్నాటి నాగసాయి- విజయవాడ, దేవరం సతీష్‌కుమార్- కరీంనగర్, డి.హరిప్రియ- అనంతపురం, మహమ్మద్ లతీఫ్- నాచారం (రంగారెడ్డి), పింగళి శ్యామసుందర్- బెంగుళూరు, జి.యస్.ప్రసాద్- హైదరాబాద్, కె.రఘురామ్- హైదరాబాద్, రాజమళ్ళ విశ్వకళ్యాణ్- విజయవాడ, తెలికిచెర్ల ఎం.కె.కిషోర్- కరవంజ (శ్రీకాకుళం), గెలివి శశికళ- నంద్యాల, ఐ.రమామణి- గుమ్మలక్ష్మిపురం (విజయనగరం), ఎన్.సి.రోజా- శ్రీరాంనగర్ (నల్గొండ), డి.మాణిమంజరి- హైదరాబాద్, ఎ.పి.హృదయకుమార్- నిజామాబాద్, గురజాల శ్రీదేవి- విశాఖపట్నం, గంటి వెంకట్రావు- కొమరిపాలెం (తూ॥గో॥జిల్లా), చాగంటి గిరిజారాణి- కొండల అగ్రహారం (విశాఖజిల్లా), ఆర్.సత్యరాజన్- కొవ్వూరు(ప॥గో॥జిల్లా), ఎమ్.మాధురి రంగారావు- నల్గొండ, అనుపోజు శివకుమార్- కొమరవానిపేట (శ్రీకాకుళం), పొన్నాడనిత్య జయానంద పద్మిని- కాకినాడ, బి.ఎన్.రమ్యశ్రీ- హైదరాబాద్, కె.వి.ఎన్.పల్లవి- కావలి, శ్రీదేవి.ఎన్- వైజాగ్, ఆర్.వి.వి.కృష్ణ- హైదరాబాద్, సి.హెచ్.ఫణి సౌజన్య- దుబచెర్ల (ప॥గో॥జిల్లా), ఐ.ఎన్.సౌజన్య- గుడూరు (నెల్లూరు), శివప్రసాద్- హైదరాబాద్, ఎమ్.ఎస్.చంద్రశేఖర్- హైదరాబాద్, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), సి.శాంతకుమారి - కాకినాడ, కొడాలి లలితశ్రీ- విజయనగరం, వి.ఉమాదేవి- హైదరాబాద్, కళాబింబి- చెన్నై.

## ఒక తప్పుతో వ్రాసిన వారు:

మద్దుల అప్పారావు- అనకాపల్లి, జె.శ్రీదేవి- వనపర్తి (మహబూబ్‌నగర్), పి.పద్మావతి- ఖమ్మం, ఎన్.శంకరాచార్యులు- చిలుకానగర్, పి.అభినయ్- చిత్తూరు, ఆర్.వాణిశ్రీ- ఒంగోలు, బి.దక్షిణామూర్తి- అనంతపురం, బి.ప్రవీణ్- పర్లాకిమిడి (ఒరిస్సా), యాగా కీర్తిప్రవీణ- కాకినాడ, తాడి రంగారావు- రాజమండ్రి, ఎ.ఉమారాణి- యెల్లందు (ఖమ్మం), బి.వి.కె.చక్రవర్తి- హైదరాబాద్, అంగర జయతీర్థ- అంగర, వి.వెంకటరమణ- హైదరాబాద్, వై.ఇ.వి.నారాయణరావు- శ్రీకాకుళం, ఊట్ల శ్రీవాణి- కడప, అన్నే కుసుమ కుమారి- గోపవరగూడెం, జి.పాండురంగ శర్మ- హైదరాబాద్, కె.హెచ్.నిష్మ- విశాఖపట్నం, మామిడి మహేంద్ర- పూణే, మామిడి మునిశ్రీలత- రేపల్లె, చోడవరపు దివ్యలక్ష్మి- మచిలీపట్నం, రాహుల్‌కుమార్- రాజమండ్రి, శశిశేఖర్- హైదరాబాద్, రాజాన రమేష్- బరంపురం, ఖలీల్- శ్రీశైలం డ్యామ్ తూర్పు (శ్రీశైలం), ఎన్.నాగర్జున- చిత్తూరు, ఎన్.హరిప్రసాద్- చీమకుర్తి (ప్రకాశం), బి.పద్మావతి- సాలూరు (విజయనగరం), హెచ్.శ్రీనివాసరావు- తిరుపతి, గ్రంధి రాంప్రకాష్- ముసునూరు (కృష్ణా), ఎ.వినాయక శాస్త్రి- మదనపల్లె, జి.ఉషారాణి- విశాఖపట్నం, మండపాక నాగేశ్వరరావు- విశాఖపట్నం, కె.వి.సరస్వతి- హైదరాబాద్, ఎన్.గాయత్రిదేవి- హైదరాబాద్, తోట ఉమారాణి- మర్కాపూర్, ఎ.లీలా కుమారి- హైదరాబాద్, కె.దుర్గామహేశ్వరి- నెల్లూరు, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), వారణాసి వాగ్దేవి- కొదాడ (నల్గొండ), వి.కృష్ణవేణి- తెనాలి (గుంటూరు), ధర్మాల సుబ్రహ్మణ్యం- హైదరాబాద్, చిట్టూరి పూర్ణానందరావు- నల్గొండ, పి.వేణుగోపాల్- అచ్చంపేట (మహబూబ్‌నగర్), కందాడ శ్రీనివాస్- హైదరాబాద్, కె.చెన్నక్రిష్ణారెడ్డి- సనత్‌నగర్, కె.శ్రీవల్లి- హైదరాబాద్, సి.భార్గవి- తరిగొండ, బచ్చువిజయకుమార్- విశాఖపట్నం, ఎస్.శివనారాయణ- కొత్తపేట (ప్రకాశం), కాటూరు రంగాచారి- వరంగల్, జన్నిగోర్ల ప్రసాదరావు- హైదరాబాద్, బిల్లంకొండ రాంబాబు- పమిడుపాడు (గుంటూరు), పింగళి కనకవల్లి- గుంటూరు, బాలస్వామిగౌడు- వనపర్తి, వై.రాజానాయుడు- పెద్ద చెన్నయ్యగారివల్లె (చిత్తూరు), బి.వి.సూర్యనారాయణ- కళింగపట్నం (శ్రీకాకుళం), తమిరశ జానకి- హైదరాబాద్, ఎ.టి.కాశీనాథ్- హైదరాబాద్, గన్నమని రామలక్ష్మి- చివటం (ప॥గో॥జిల్లా), బొడిగ వెంకటేశంగౌడ్- కవాడిపల్లి (రంగారెడ్డి), కె.మురళిమోహన్- మార్కాపూర్ (ప్రకాశం), టి.వి.ఎన్.శ్రీకాంత్- సికింద్రాబాద్, వజ్రం.వి-హైదరాబాద్, లంకారాణి- గుడివాడ (కృష్ణా), ఎరివింటి జయప్రకాష్‌శాస్త్రి- వనపర్తి (మహబూబ్‌నగర్), కె.శామ్‌ప్రసాదరావు- మహబూబ్‌నగర్, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), ఆర్.రాఘవేంద్రరావు-హైదరాబాద్, వై.చిట్టిబాబు- డి.కెశవరం (తూ॥గో॥జిల్లా), ఎస్.వరలక్ష్మి- హైదరాబాద్, పి.రమేష్- హైదరాబాద్, జి.రమాదేవి- శ్రీకాకుళం, ఏగూరు అభయ్- మహబూబ్‌నగర్, పర్చా వాసుదేవరావు- దేవరకొండ (నల్గొండ), కూచి ఇందీవరశ్యాం- హైదరాబాద్, మండలీక కమలకుమారి- కాకినాడ, జి.చంద్రశేఖర్- విజయనగరం, బాసరాజు యాదగిరి- రామన్నపేట (నల్గొండ), యం.రజని- నల్గొండ, ఎ.పురుషోత్తంరావు- గజ్వేల్ (మెదక్), వి.వి.సూర్యనారాయణమూర్తి - కాకినాడ, యు.గున్నేశ్వరరావు- పాగిరి (శ్రీకాకుళం), సహారే ఇందిర- కళ్యాణ్ (మహారాష్ట్ర).

## రెండు తప్పులతో వ్రాసిన వారు:

నిర్మల క్రిష్ణ- హైదరాబాద్, పెండ్యాల నరహరి- హైదరాబాద్, ఎ.శ్రీరత్న- విద్యానగర్, ఎన్.శ్రీవాణి- విజయవాడ, ఈ.ప్రమిలారాణి- ఘట్‌కేసర్ (రంగారెడ్డి), పున్నా బొర్రస్వామి- జగ్గయ్యపేట (కృష్ణా), జె.పాలరాజు- కడపరాజుపల్లి (ప్రకాశం), డి.సంజీవ్‌కుమార్- నిజామాబాద్, కడగాన రాము జానకి- పొందూరు (శ్రీకాకుళం), వి.స్రవంతి-హైదరాబాద్, సామంచి శ్రీరాధ- విశాఖపట్నం, ఆర్.కె.యు.ఎస్.భాస్కరరావు- ములగపూడి (తూ॥గో॥జిల్లా), యు.యు.శ్రీరాములు- విల్లివక్కము, ఎమ్.నాగేశ్వరశర్మ- గుంటూరు, మల్లిడి అరుణాదేవి- కుతుకులూరు (తూ॥గో॥జిల్లా), మల్లిడి దినేష్‌రెడ్డి- కుతుకులూరు (తూ॥గో॥జిల్లా), యస్.సుధీర్ రావు- హైదరాబాద్, పి.కృష్ణారావు- అమలాపురం (తూ॥గో॥జిల్లా), అల్లూరి రామరాజు- విజయవాడ, జయంతి ప్రకాశశర్మ- విశాఖపట్నం, దేసు విజయలక్ష్మిమూర్తి- గుంటూరు, వి.జె.బెన్నెట్- నిడుబ్రోలు (గుంటూరు), బి.శైలజకుమారి- అల్లూరు (కర్నూలు), యం.కళ్యాణి- దేవరకొండ (నల్గొండ), బి.జయమ్మ- నంద్యాల (కర్నూలు), మెహర్‌కుమార్ తాటిపాముల- లింగంపల్లి (నిజామాబాద్), క్రిష్ణవేణి- సికింద్రాబాద్, వి.విద్యాసాగర్- విశాఖపట్నం, డా॥సి.నాగమణి- నంద్యాల, ఎస్.రాజశేఖర్‌గౌడ్- పూలచింత (కర్నూలు), కె.మమత- చిత్తూరు, సి.వి.హెచ్.బి.ఎస్.కె.చైతన్య- మల్కాజ్‌గిరి, ఎమ్.సత్యవాణి- తణుకు, చెన్నా ధనమౌళీశంకర్- విశాఖపట్నం, పి.శంకరమ్మ- గూడూరు (నెల్లూరు), టి.జగన్‌మోహన్- విశాఖపట్నం, 'మన్నవ మాధవి- సత్తెనపల్లి.

## మూడు తప్పులతో వ్రాసిన వారు:

ఎ.రాజశేఖర్‌రెడ్డి- మంగలగిరి (గుంటూరు), డి.వెంకటరావు- సాలూరు, ఎమ్.అంబాజిరావు- కర్నూలు, కాశీనాథుని విజయలక్ష్మి- విజయవాడ, ఎస్.పద్మావతి- ఒంగోలు, ఎమ్.దుర్గాప్రసాద్- వరంగల్, వి.రాజేశ్వర్- ఆదిలాబాద్, లంక సూర్యనారాయణ- పన్వేల్, యు.లక్ష్మణస్వామి- కల్లూరు (కర్నూలు), వి.శ్యాంబాబు- హైదరాబాద్, ఇంద్రకంటి వీరభద్రశర్మ- కడప, జి.పట్టమ్మాళ్- హైదరాబాద్, టి.బ్రహ్మయ్య- కుప్పాలపల్లి (కడప), జె.చరణ్‌కేదార్- తాడేపల్లిగూడెం (ప॥గో॥జిల్లా), పి.లక్ష్మిశ్రీదేవి- దొర్నిపాడు (కర్నూల్), సి.రంగనాయకులు- మార్కాపూర్ (ప్రకాశం).



# ఆ పాట మధురం

రాజా

తెలుగు చలన చిత్ర పరిశ్రమ ఆంధ్రదేశంలో స్థిరడాలన్న సదుద్దేశంతో తొలి అంకురాలు మొలకెత్తించిన వారిలో సారథీ సంస్థను ప్రముఖంగా చెప్పుకోవాలి. హైదరాబాద్‌లో స్టూడియోను నిర్మించుకుని శ్రీ సారథీ స్టూడియోస్ పతాకంపై ఎన్నోమంచి చిత్రాలను నిర్మించిందీ సంస్థ. అగ్ర కధానాయకులు లేకుండా వీరు నిర్మించిన

...




చిత్రం 1960లో విడుదలైంది. గుమ్మడి, అంజలి, జగ్గయ్య, చలం, గిరిజ, కృష్ణకుమారి ప్రధాన తారాగణం. బాలరాజ్ సహాని, పండరీబాయి, జగదీప్, నందా, శ్యామ మొదలగు వారితో ఎ.వి.యమ్ సంస్థ నిర్మించిన 'బాభీ'చిత్రం ఈ 'కులదైవం'కు ఆధారం.'బాభీ' చిత్రానికి కృష్ణన్-పంజు దర్శకులు, చిత్రగుప్త సంగీత దర్శకుడు కాగా 'కులదైవం' చిత్రానికి కబీర్‌దాస్ దర్శకుడు, మాస్టర్ వేణు సంగీత దర్శకుడు.

తనలోని కళను కమర్షియల్ రంగంలో నిలబెట్టిన తర్వాత ఏ కళాకారుడికైనా సరే-ఇన్‌స్పిరేషన్.ఇమిటేషన్,కాపీ,పేరడీ,అనే ఈ నాలుగు ప్రక్రియలలో ఏదో ఒక దాన్ని ఎప్పుడో ఒకప్పుడు స్పృశించవలసిన అవసరం వచ్చితీరుతుంది.అందుకు కారణాలు సామాన్య జనానికి అవసరం కావచ్చు.అయినా ఆ కారణాలు అకారణాలు అయి ఉండవు. అర్థం చేసుకోవటానికి కాస్త ప్రయత్నిస్తే , అది ఆ కళాకారుడి పట్ల నిజమైన అభిమానాన్ని మనం ప్రదర్శించినట్టే.....! శ్రీ సారథీ స్టూడియోస్ పతాకం పై 1960లో విడుదల అయిన 'కులదైవం'చిత్రానికి సంగీతాన్నిచ్చేటప్పుడు మాస్టర్ వేణుకు అదే పరిస్థితి ఎదురైంది. ఆ చిత్రానికి మూలమైన 'బాభీ'హిందీ చిత్రాన్ని హక్కులతో సహా నిర్మాత తీసుకోవడం వల్ల అందులోని రెండు ప్రతిష్టాత్మక పాటలను మాత్రం 'మక్కీకిమక్కీ' లా తెలుగు వారికి అందించవలసిన బాధ్యత ఆయనపై పడింది. అది తెనిగించడమే తప్ప తెగించటం ఎంత మాత్రమూ కాదు.ఔచిత్య భంగం కలగకుండా నిజాయితీతో తెనిగించటం కూడా దోషం అనుకుంటే మనకు రామాయణ భారత భాగవతాలు ఉండేవా....? ఘంటసాలకు, సముద్రాలకు, తెలుగు వారికి 'పయనించే ఓచిలుకా' వంటిఅత్యద్భుత గీతం మిగులుండేదా!? 'కులదైవం' చిత్రం కి సంబంధించి ఈ నాటికీ ప్రజల స్మృతిపథంలో మిగిలున్న పాటలలో కొన్ని...

ఆడి పాడేను నా మది ఈవేళ - అరుదెంచే ఉగాది శుభవేళ ॥ఆడి॥
కనువిందై ఈ జగమంతా - కలిగించు చక్కలిగింత ॥కను॥
మూగే ఎలతుమ్మెద రొదలో మురిసే విరి బాలా ॥మూగే॥
ఉప్పొంగి వువ్విళ్లూరే - ఈవేళా... మనసూగే
మనసూగేను పూవుల ఉయ్యాలా ॥ఆడి॥
కేరింతల చిలుకలపాట - ఊరించే నన్నీపూటా
చిరుగాలి సందడి తేలే - చిన్నారీ భావాలే ॥చిరు॥
వాసంతపు ఆనందాలే ఏచోటా... వయసూరే
వయసూరే ఒయ్యారపు అందాలే ॥ఆడి॥





జూనియర్ సముద్రాల రాసిన ఈ పాటను సుశీల పాడగా కృష్ణకుమారి అభినయించింది. మాస్టర్ వేణుపై నౌషాద్ ప్రభావం అణువణువునా ఎంతగా జీర్ణించుకుపోయి వుందో సంగీత ప్రియులందరికీ తెలుసు. మాతృక అయిన 'బాభీ'లోని 'కారే కారే బాద్‌రా' పాట ట్యూన్‌ని, నడకని ఈ పాటలో ఉపయోగించుకోవడం జరిగింది. చిత్రగుప్త చేసిన ట్యూన్‌ని - నౌషాద్ ప్రభావం గల మాస్టర్ వేణు - అనుసరించవలసి వస్తే ఎలా ఉంటుందోనన్న అనుభవం కోసం ఈ పాటని కచ్చితంగా అధ్యయనం చేసి తీరాలి. కొన్నిటిని అధ్యయనం చేస్తూ వుంటే ఎంత ఆనందంగా వుంటుందో చెప్పలేం. దేవుని సృష్టి రహస్యాలను, ప్రకృతి మర్మాలను తెలుసుకుంటున్నప్పుడు శాస్త్రజ్ఞుల మనసు ఎంత ఉప్పొంగి పోయి వుంటుందో మనం తెలుసుకోలేం. పరిశోధనలలోనున్నప్పుడు వారెందుకలా మునిగిపోయి వుంటారో కొంతమందికి ఓ పట్టాన అర్థం కాదు. ఇటువంటి వాటికి మనకు సమాధానం పరోక్షంగా దొరకాలంటే ఈ 'ఆడిపాడేను నా మది ఈవేళా' పాటను, 'కారే కారే బాద్‌లా' పాటను, నౌషాద్ స్వరపరిచిన రతన్, అన్‌మోల్‌ఘడీ చిత్రాలలోని పాటలను, సంపాదించి ఒకదాని తర్వాత ఇంకొకటి మార్చి మార్చి విని చూడండి. అప్పుడు మీ మనసుకి 'అవధి లేని ప్రతి అనుభూతికీ - ఆత్మానందమె పరమార్థం' అంటూ నారాయణరెడ్డి రాసిన మాటలు అనుభవానికొస్తాయి.

గారడిచేసే నీ కనులూ - ఆరడి చేయును నా మనసూ
తీయని ఆశల అలజడిలో - ఊగే ఆగని లేవయసూ ॥గారడి॥
నీ నవ్వుల వెన్నెల సోలి నటియించు మేను తూలి ॥నీ నవ్వుల॥
నా వాలుకన్ను దోయీ - తాళాలు వేయునోయ్
మనమందు చిందులేసే నా ఆశలూ
వినిపించు హాయి మీరే ప్రేమ సంగీతాలే ॥గారడి॥
నా వెనుక చేరి నిలిచీ నవ్వేవు నన్ను జూచీ ॥నా వెనుక॥
అదరి వెనుజూచే సరికే ఆడేవు దోబూచీ
వెరగందీ దిక్కులన్నీ - నేజూడగా
వెనుదట్టీ నవ్వుతావు వేళాకోళమనీ ॥గారడి॥




జూనియర్ సముద్రాల రాసిన ఈ పాటను సుశీల పాడగా కృష్ణకుమారి, కృష్ణారావు అనే నూతన నటుడు అభినయించారు. ట్యూన్ పరంగా ఈ పాటలోని చరణాల ఎత్తుగడను, 'ఆడిపాడేను నా మది ఈవేళా' పాటలోని చరణాల ఎత్తుగడను గమనించి చూస్తే - 'ఆడిపాడేను' పాట చరణాల ఎత్తుగడను కాస్త స్లో చేసి 'గారడి చేసెను నీ కనులు' పాట చరణాలకు టేకాఫ్ లాగ ఉపయోగించుకున్నారేమోననిపిస్తుంది. ఈ రెండు పాటల సాహిత్యాన్నీ తీరిగ్గా ఓ పదిసార్లు చూసి నెమరు వేసుకుంటే - ఇవాళ 'ఎంతో బావున్న సాహిత్యం వుందీ' అనుకున్న కొన్ని పాటల్లో కూడా ఈ సున్నితత్వం కనబడదు. జీవితంలో నాజూకుగా వుండే కొన్ని రసస్పందనల్లో ఓ మోస్తరు కరకుదనం, మోటుదనం తెలియకుండానే చోటుచేసుకుంటూ, ఆక్రమించేస్తూ వుండటం వల్లనే ఈ మార్పులు సంభవిస్తూ వున్నాయేమోనని అనిపిస్తుంది.

సాకీ : మనసులో ఒకటుంచి మాటాడతారు
కన్నీటితో గుండె కరగించుతారు! ఆ... ఆ...
అరచేత వైకుంఠ మొరిగించుతారూ - ఎవరు? ఆడవారు
పాట : నమ్మరాదూ అసలే నమ్మరాదూ ॥నమ్మ॥
ఈ గడుసైన ఆడవాళ్ళ నమ్మరాదూ ॥నమ్మ॥
ఇలలోన గూడ నమ్మరాదు
అబ్బ... కలలోన గూడ నమ్మరాదు ॥ఇల॥
నమ్మరాదూ అసలే నమ్మరాదూ
సాకి : ఆడది బొంకిందంటే గోడబెట్టినట్టేరా
మూడుముళ్ళు పడ్డవెన్క బ్రతుకంతా గోదేరా
ఆ స్టోరీ కొండవీటి చేంతాడురా... ఆ... ఆ...
పాట : ఇక్కడి మాటక్కడ చెపుతూ అక్కడి మాటిక్కడ చెపుతూ ॥ఇక్కడి॥
గడియారం ముల్లులాగా కాలికొద్ది చెక్కర గొడుతూ ॥గడి॥
జుట్టూజుట్టూ ముడిపెడతారూ చోద్యం చూస్తూ నిలబడతారూ
ఎవరు? ఆడవారు ॥నమ్మ॥
రోషం రెండౌన్సులు - మోసం మూడౌన్సులు
అసూయ మొండిపట్టు అయిదౌన్సులు
సాహసం ఆరౌన్సులు - ఏడుపు ఏడౌన్సులు
తళుకు, బెళుకు, కులుకు, జలుకు
లిపిస్టిక్,, స్నో, పౌడర్, మేకప్ పదౌన్సులు
అంతా కలిమిల జేస్తే ఆడదౌనురా
చూడ వేడుకౌనురా ॥నమ్మరాదు॥








ఈ పాటను కొసరాజు వ్రాయగా ఎమ్.చిత్తరంజన్ పాడేరు. జగయ్య ప్రధానపాత్రధారిగా, కొంతమంది ఉపపాత్రధారులతో కలిసి అభినయించిన పాట యిది. పాట సాహిత్యం ఆసాంతం పరికించి చూస్తే కొసరాజు వ్యంగ్య చమత్కృతి అర్థం అయిపోతుంది. ఇక సంగీత పరంగా చూసుకుంటే - కళ్యాణి రాగం ఆ పాటకు ఆధారం. 'ఇలలోన కూడ నమ్మరాదు... అబ్బ... కలలోన కూడ నమ్మరాదు' అనే లైనుకు జతపడిన ట్యూన్‌ని ఆలపించుకుంటూ పోతే ఈ రాగంలో మరిన్ని పాటలు తట్టే అవకాశం వుంది. ఈ పాటను వినగానే చాలామంది ఏ.యమ్.రాజా పాడేడని అనుకున్నారు ఆరోజుల్లో. కానీ ఏ.యమ్.రాజా పాడే పద్ధతికి భిన్నంగా ఉండడంతో ఎవరిదీ నూతన గాత్రం అంటూ శ్రోతలు ఆసక్తి కనపరచి, ఆకాశవాణికి చెందిన చిత్తరంజన్ ఈ పాటను పాడేరని తెలుసుకున్నారు.

ఆకాశవాణి ద్వారా అందరికి స్వర పరిచితుడైన చిత్తరంజన్‌కి రేడియో అన్నయ్యగా ప్రసిద్ధులైన కీ.శే.న్యాపతి రాఘవరావు ద్వారా ఈ చిత్రంలో పాడే అవకాశం వచ్చింది.'హైదరాబాద్‌లో తీస్తున్నాం కాబట్టి లోకల్ టాలెంట్‌ని చూద్దాం' అని అనుకున్న తరుణంలోన్యాపతి రాఘవరావు ఓ గెట్‌టు గెదర్‌ని ఏర్పాటుచేసి చిత్తరంజన్ పాటలను మాస్టర్ వేణు వినేట్టు చేశారు. అప్పుడు ఆలిండియా రేడియోలో క్యాజువల్ ఆర్టిస్‌గా ఉండే చిత్తరంజన్ తను స్వయంగా ట్యూన్ చేసుకున్న దేవులపల్లి, సినారె గీతాలను ఆలపించి మాస్టర్ వేణును ఆకట్టుకున్నారు. ఆ తరువాత వారిరువురి మధ్య అను 'రాగ బంధం' ఎంతగానో ముడివేసుకుంది. మాస్టర్ వేణు సంగీత జీవిత పయనంలో ఎన్నో మలుపులకు, మజిలీలకు సాక్షిగా నిలబడే కొద్దిమందిలో ఇవాళ చిత్తరంజన్ ఒకరు. మన 'హాసం' పత్రికలో లలితసంగీతం శీర్షికను నిర్వహిస్తున్న శ్రీ చిత్తరంజన్ - ఆ చిత్తరంజనే అని పాఠకులకు వేరేగా చెప్పక్కర్లేదు.

అతడు : రావే రావే వయ్యారి ఓచెలీ ॥రావే॥
నా గారాల జిలిబిలి జాబిలీ ॥రావే॥
ఆమె : చాలూ చాలోయి సఖ ఈ కేళీ ॥చాలూ॥
చెలులెవరైన చూచిన ఎగతాళి
ఆమె : దొరవారు కన్నులు మూసి
దోచేందుకు వేరేముంది
దొరికేది కన్నియ వలపే
దోచారది ఇంతకు మునుపే
అతడు : ఓ హో చమత్కారివే
ఓ జవరాలా ॥చాలు చాలోయి॥
అతడు : కలవోలె కాపరాలు
కలకాలం సాగాలంటే
కలవాలి మనసూ మనసూ
శృతిలో లయగా మెలగాలీ
ఆమె : తమరే సదా నాకు
మనసైన జీవనమైనా ॥రావే॥
అతడు : నీ కేలూ వీడగ తరమే
ఆమె : వేడేది నేనా వరమే
అతడు : నిజమైతే ఈ అనురాగం
ఆమె : జీవితమే తీయనిరాగం
ఇద్దరూ : మనకీ సరాగాలు సరదాలు శాశ్వతమేలే ॥రావే॥
ఓఓఓఓ



ఈ పాటను సుశీల,యం.చిత్తరంజన్ పాడారు. తెరపై కృష్ణకుమారి, కృష్ణారావు అభినయించారు. ఈ పాటను సముద్రాల జూనియర్ రాశారు. చాలా సార్లు పహడీ రాగఛాయల్లోను,ఎక్కువసార్లు మోహన రాగంలోను వినిపించే ఈ పాటలో సంవాదరీతిగా వినిపించే సంగీత సాహిత్యాలు తెలియకుండానే మనసుకి హత్తుకుంటాయి. అది అందరికీ తెలిసేట్టు చేసింది మాత్రం గాయనీ గాయకుల ఉచ్చారణలోని స్పష్టతే. ఇదిలా ఉండగా ఆ పాట రెండో చరణంలో 'కాపురాలు'కి బదులు కావరాలు అంటూ చిత్తరంజన్ చేత పాడించటం ఓ గమనించదగ్గ విషయం.

అతడు : పదపదవె వయ్యారి గాలిపటమా ॥పద॥
పైన పక్షిలాగ ఎగిరిపోయి
పక్క చూపు చూసుకుంటు
తిరిగెదవే గాలిపటమా ॥పద॥
ప్రేమగోల లోన చిక్కిపోయినావా
నీ ప్రియుడున్న చోటుకై పోదువా ॥ప్రేమ॥
ఆమె : నీ తళుకంతా నీ కులుకంతా
అది ఎందుకొ తెలుసును అంతా ॥పద॥
నీకు ఎవరిచ్చారే బిరుదు తోక
కొని తెచ్చావేమో అంతేగాక ॥నీకు॥
అతడు : రాజులెందరూడినా మోజు లెంతమారినా
తెగిపోక నిలిచెనే తోక ॥పద॥
ఆమె : నీలిమబ్బుల్లో ఆడుకుందువేమో
మింట చుక్కల్తో నవ్వుకుందువేమో ॥నీలి॥
అతడు : వగలాడివిలే జగదంతవులే
దిగిరాకుండ ఎటులుందువులే ॥పద॥



నటభైరవి రాగచ్చాయలలో సాగే 'పద పదవే వయ్యారి గాలి పటమా'పాటను ఘంటసాల,జమునారాణి పాడగా చలం,గిరిజపై చిత్రీకరించారు.ఈ పాట కూడా సంగీత సాహిత్యాలతో సహా ఒరిజినల్ చిత్రం 'బాభీ' లో రఫీ,లత పాడిన 'చల్ చల్‌రే పతంగ్ మేరే చల్‌రే' పాటకు మక్కీకి మక్కీగా చెప్పుకోవాలి. ఆ హిందీ పాటలోని ఇంటర్‌లూడ్స్‌ని జాగ్రత్తగా గమనిస్తే ఆర్కెష్ట్రయిజేషన్ అంతా శంకర్-జైకిషన్ స్టయిల్లో ఉంటుంది. ఒకరి స్టయిల్లో ఇంకొకరు స్వరపరచటం అనేది ఆ రోజుల్లో తమ సామర్ధ్యానికి ఒక సవాల్ లాగే భావించేవారని, శంకర్-జైకిషన్ లు స్వరపరిచిన 'చోరి చోరి' లో 'రసిక్ బల్‌మా' పాటలా 'పేయింగ్ గెస్ట్'లో యస్.డి.బర్మన్ 'చాంద్‌ఫిర్‌నిక్‌లా' పాటని స్వరపరచారని ఇదివరకు పేర్కొనటం జరిగింది. అలాగే

తనకంటూ ఓ బాణీని ఏర్పరచుకొని ప్రత్యేక పంథాలో స్వరపరిచే మదన్‌మోహన్ ఆఖరీదావ్(1958)లో స్వరపరిచిన 'ఓ చాంద్ ముస్కొరాయే ఓ తారేషర్మ్ ఆయే' పాట వింటే 'చోరీ చోరీ'లో శంకర్-జైకిషన్ స్వరపరచిన 'ఏరాత్ భీగీభీగీ'పాట ఆర్కెస్ట్రయిజేషన్, గాయనీ గాయకుల కాంబినేషన్‌తో సహా గుర్తొస్తుంది.ఈ ఉదాహరణలన్నింటితో పోలిస్తే చిత్రగుప్త కూడా ఈ 'చల్‌చల్‌రే పతంగ్ మేరే చల్‌రే' పాటలో తన వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూనే అత్యద్భుతంగా సక్సెస్ అయ్యాడని చెప్పాలి. ఇక తెలుగు పాట వరకూ వస్తే చలంకి ఘంటసాల పాడిన పాటలన్నీ ఓ వరుసలో టేప్ చేసి వింటే ఓ తమాషా అయిన పద్ధతిలో తన గాత్రాన్ని విసురుతూ ఆయనకు ఘంటసాల పాడారనిపిస్తుంది. (కావాలంటే నిత్యకళ్యాణం పచ్చతోరణంలో 'టనానా టంకు చలో' పాటని 'తోబుట్టువులు'లో 'ఏమయ్యా ప్రేమయ్యా పడితే లేవవు ఓ భయ్యా' అనే పాటను గుర్తుకు తెచ్చుకోండి) ఇక సాహిత్యం వైపు వస్తే ఆంధ్రాలో చాలాచోట్ల గాలిపటాన్ని 'తోక' అని కూడా అంటారు. ఆ పదాన్ని, జగాల అంతు చూసే ఘనమైన దానివిలే అనే అర్థంతో వాడిన 'జగదంతవులే' అనే మాటను పూర్తి నేటివిటి టచ్‌తో ప్రయోగించిన గీత రచయిత కొసరాజు రాఘవయ్యచౌదరి శైలిని ప్రత్యేకంగా శ్లాఘించి తీరాలిక్కడ.

పయనించే ఓ చిలుకా
ఎగిరిపో పాడై పోయెనుగూడు ॥పయ॥
తీరెను రోజులు నీకీ కొమ్మకు ॥తీరెను॥
పోమ్మా ఈ చోటు వదిలి
ఎవరికి వారె ఏదో నాటికి ఎరుగము ఎటకో ఈ బదిలీ
మూడు దినాల ముచ్చటయే.... ॥మూడు॥
ఈ లోకములో మన మజిలీ
నిజాయితీగా ధర్మ పధాన ॥నిజాయితీ॥
చనుమా ధైర్యమే తోడు ॥పయ॥
పుల్లాపుడకా ముక్కున కరచి గూడును కట్టితి వోయీ ॥పుల్లా॥
వానకు తడిసిన నీ బిగి రెక్కలు ఎండకు ఆరిన వోయీ
ఫలించలేదని చేసిన కష్టమూ...
ఫలించలేదని చేసిన కష్టమూ మదిలో వేదన వలదోయీ
రాదోయి సిరి నీ వెనువెంటా ॥రాదోయీ॥
త్యాగమె నీ చేదోడు ॥పయనించే॥
మరవాలి నీ కులుకుల నడలె మదిలో నయగారాలే ॥మరవాలి॥
తీరని వేదన తీయని ముసుగే శిరసున సింగారాలే
ఓర్వలేని ఈ జగతికి నీపై ॥ఓర్వలేని॥
లేవే కనికారాలే
కరిగి కరిగీ కన్నీరై ॥కరిగి॥
కడతేరుటె నీ తలవ్రాలే ॥పయనించే॥
గోడుమనీ విలపించారే నీ గుణము తెలిసినవారూ ॥గోడు॥
జోడుగ నీతో ఆడిపాడి కూరుము లాడినవారూ
ఏరులయే కన్నీరులతో మనసారా దీవించేరే
ఎన్నడో తిరిగి ఇటు నీ రాకా ఎవడే తెలిసినవాడు ॥పయనించే॥



జూనియర్ సముద్రాల రాయగా ఘంటసాల పాడిన 'పయనించే ఓ చిలుకా' పాట చిత్రంలో వివిధ సన్నివేశాలలో వస్తుంది. అక్కడక్కడ యమన్ రాగం కలుస్తున్నా ఆసాంతం కళ్యాణి రాగంలో సాగిన పాటగా ఉదహరించాలీగీతాన్ని. కళ్యాణి రాగంలో వచ్చే చతుశృతి రిషభంతో పాటు శుద్ధ రిషభాన్ని అనుస్వరంగా కలుపుకుంటూ అక్కడక్కడ ప్రతిమధ్యమం బదులు శుద్ధ మధ్యమాన్ని వేసినా-కళ్యాణి రాగానికి సదుపమానంగా నిలిచిపోయిందీ గీతం. ఒరిజినల్ చిత్రం 'బాభీ' లో రఫీ పాడిన 'చల్ ఉడ్‌జారే పంఛీ' పాట ఈ పాటకు ఆధారం. నిజానికిది మక్కీకి మక్కీ గీతమైనా ఘంటసాల క్లాసిక్స్‌లో ఒకటిగా నిలిచిపోవటానికి కారణం ఘంటసాల, సముద్రాల అనే చెప్పాలి. సముద్రమంత గాంభీర్యాన్ని తన స్వరంలో నిలుపుకున్న గళం ఘంటసాలదైతే, ఆద్యంతం ఇది తెలుగు వారి పాటేనని ఘంటాపదంగా అందరూ నమ్మేట్లు రాసిన కలం సముద్రాలది. వాస్తవానికి ట్యూన్‌తో పాటు-హిందీ రచయిత రాజేంద్రకిషన్ రాసిన 'చల్ ఉడ్‌జారే పంఛీ' పాట భావాన్ని సాహిత్యంతోసహా తీసుకోవడం జరిగింది. కానీ తెలుగు పాట మొత్తం ఎన్ని సార్లు ఎంతమంది పరిశీలించినా సరే అందులో మనది కానిది ఒక్కటి కూడా మచ్చుకైనా సరే కనిపించదు. (మజిలీ,బదిలీ లాంటివి ఎప్పుడో మన వ్యవహారికంలో కలిసి పోయాయి.) మన పలుకుబడినిఅంత గొప్పగా ఉపయోగించుకున్న జూనియర్ సముద్రాలను తప్పనిసరిగా వేనోళ్ళ కొనియాడాల్సిందే. కావాలంటే ఇదే సంచిక 62వ పేజీలో 'పయనించే ఓ చిలుకా' పాట మాతృక అయిన 'చల్ ఉడ్‌జారే పంఛీ'పాట సాహిత్యాన్ని ఇవ్వడం జరిగింది. గమనించండి. ఇటువంటి వేదనా గీతాలకు ఘంటసాల స్వరం ఒక వరం అయితే ఆయన పాడే పద్ధతి తెలుగు వారి గుండెల్లో గుడికట్టుకున్న గోపురం. ముఖ్యంగా ఈ పాట చివరిలో వచ్చే ఆలాపనను నిశితంగా గమనిస్తే ఒరిజినల్‌గా రఫీ పాడిన పద్ధతి కన్నా మరింత మెరుగ్గా వచ్చిందనిపిస్తుంది. తన గాత్ర ధర్మం ప్రకారం ఘంటసాలవారు ఆ ఆలాపనను ఎత్తుకున్న పద్ధతి, చివర్న గ్యాప్‌లతో తన వాయిస్‌ని ప్రాజెక్ట్ చేసుకున్న విధానం, ఎత్తుకున్న ఆ ఆలాపనను మధ్యలో దించి-మెలొడీని మిళితం చేసి - తిరిగి అద్భుతమైన రేంజ్‌కి చేరుకునేలా ఆయన ఇచ్చిన స్పందనకి తనువు, అణువణువు పులకించి పోతుంది. సానుభూతి రసానుభూతిని సమపాళ్ళలో పండించుకున్న ఈ గీతానికి సంబంధించిన మరో ముఖ్య విషయం ఏమిటంటే 'పుల్లా పుడక ముక్కున కరచి' అనే చరణం ఎక్కడ ఎవరివలన తొలగించబడిందో కానీ, ఇప్పుడు చాలా క్యాసెట్లలో ఉండటం లేదు.

'కులదైవం' చిత్రంలోని మొత్తం పాటలన్నీ సారథీ స్టూడియోలోనే రికార్డ్ అయ్యాయి. ఆర్కెస్ట్రాలో చాలా మంది హైదరాబాద్‌కు చెందినవారే. అందులోని వయొలినిస్ట్ ఎ.ఆర్.రామానుజులుని,తబల్టిస్ట్ నారాయణని ప్రముఖంగా పేర్కొనాలి. ఎన్నో టీ.వీ ఎపిసోడ్స్‌కి సంగీతాన్ని ఇచ్చి మరెన్నో టి.వి కార్యక్రమాల్లో కీ-బోర్డు వాయిస్తూ కనిపించిన కీ॥శే॥ మనోజ్‌కుమార్; ఎన్నో సంగీత కార్యక్రమాల్లో గిటారిస్ట్‌గా కనిపిస్తూ, సానాయాదిరెడ్డి తీసిన 'ప్రేమ పల్లకి' చిత్రానికి సంగీత దర్శకత్వం వహించిన కృష్ణ-నీరజ్ ద్వయంలోని నీరజ్‌కుమార్, ఆనాటి వయొలినిస్ట్ రామానుజులు కుమారులే.

# శ్రీకృష్ణార్జునయుద్ధము

## కథా సంగ్రహం

**నాంది:**

శ్రీకృష్ణ సందర్శనార్థియై భూలోకానికి వస్తూ నారదమునీంద్రుడూ, బ్రహ్మవరార్థియై సత్యలోకానికివెళుతూ గయుడనే గంధర్వరాజూ గగనమార్గాన కలుసుకున్నారు. గయుని ఆశ, "ఎలాగైనా అనంత జగత్కీర్తి గాంచుటయే" అని తెలిసి, కలహప్రియుడైన నారదుడు, ఇంతకీర్తి కాంక్ష కారణంగా కొంత ప్రళయం జరగకపోదని ఆనందించి "అస్తు" అని అతని దీవించి పంపి, తాను ద్వారకకు ప్రయాణించాడు.

**చిన్నన్నయ్య వర నిర్ణయం:**

బలరామ కృష్ణుల ఏకైక సోదరి సుభద్ర. ఆచెల్లెలంటే శ్రీకృష్ణునికి ప్రాణం. అందుచే, తన బహిప్రాణమైన అర్జుననకే సుభద్రనుకట్టపెట్టాలని కృష్ణుడు నిశ్చయించాడు. సుభద్రకు సింగారం చేస్తున్న రుక్మిణి మరదలి వివాహవిషయం జ్ఞాపకం చెయ్యగానే "మన సుభద్రకు వరుణ్ణి ఎప్పుడో నిర్ణయించాను. కాని ముందు సుభద్ర ఇష్టపడితేనే నేనుచెప్పేది" అన్నాడు కృష్ణుడు. సమయానికి అక్కడకు వచ్చిన నారదమునీంద్రుడు ఆసంభాషణనందుకొని, శ్రీకృష్ణార్జునులు సాక్షాత్తూ నరనారాయణులే అని తెలిసినవాడు గనుక, కృష్ణుని మనస్సులోమాట నిట్టే కనిపెట్టి "అర్జునుడే సుభద్రాకన్యకు తగిన వరుడు. ఈ సంబంధం దివ్యంగావుంది, వెంటనే అర్జునునితో వివాహం జరిపించేసెయ్యండి" అన్నాడు. ఆమాటతో ఎక్కడలేని సిగ్గూ సంతోషం వచ్చి సుభద్ర అక్కడ నిలవలేక వెళ్ళి పోయింది. అంటే తాను వరించిందీ అర్జుననే అన్నమాట.

**పారిజాత ప్రభావం:**

ఇంక నారదుడు వచ్చిన పని... శ్రీకృష్ణునకు ఒక పారిజాత పుష్పాన్ని కానుకగా ఇచ్చి, దాని విశేషాన్ని అతిగా వర్ణించి దానిని ధరించిన స్త్రీలకు శుభం అని రుక్మిణి వంక చూచాడు. సమయోచితంగా కృష్ణుడాపుష్పాన్ని రుక్మిణికి అలంకరించాడు. అంతతో ఊరుకోక నారదుడు, "మరి ఈ పారిజాత ప్రభావం చూడండి, తమకిక సత్యభామా విధేయులనే చెడు పేరు పోయి రుక్మిణీ విధేయులనే మంచికీర్తి వస్తుందని శ్రీకృష్ణునితో అని, అయినా అంత స్వాతిశయం గల ఆ సత్యభామకు గర్వభంగం కావలసిందే అన్నాడు. ఈ ప్రసంగమంతా సత్యభామ చెలికత్తె పొంచి వింటోంది. అదిగమనించి "గోడలకు చెవులుంటాయి ఊరుకోం"దని కృష్ణుడు నారదుని వాగ్ధోరిణినరికట్టగా "నారాయణ" అంటూ నారదుడు సెలవు పుచ్చుకున్నాడు.

**సత్యభామ అలక:**

చెలికత్తె వచ్చి చెప్పిన మాటలు వింటూనే రోషం వచ్చి, ఈర్ష్య హెచ్చి, సత్యభామ తోకత్రొక్కిన త్రాచులా పోయి, బుసలుకొడుతూ అలకపాన్పుపై శయనించింది. శ్రీకృష్ణుడువచ్చి మృదుమధుర గానంతో తన ప్రేమను నివేదించాడు, లాలించాడు, వేడుకున్నాడు. ఏం చేసినా సత్యభామ చలించలేదు. చివరికి "దాసుని తప్పు దండంతో సరి" అన్నట్లు ప్రియురాలి కాలికి మ్రొక్కాడు. సత్యభామ కాలు విదిలించుకొంది. అది తాకి కృష్ణుని కిరీటం క్రింద దొర్లింది. అంత పని జరగడంతో సత్యభామ తల్లడిల్లిపోయింది. కాని "ప్రియురాలు తన్నినా నాకు మన్ననే" అంటూ కృష్ణుడు ప్రసన్నంగానే ఉన్నాడు. ఇంక ముంచుకు వచ్చిన పశ్చాత్తాపంతో దిగ్గున వెళ్ళి సత్యభామ కృష్ణునిపై వ్రాలిపోయింది. ఆసమయంలో బలరాముని వద్దనుంచి కృష్ణునికి పిలుపు వచ్చింది.

**పెద్దన్నయ్య వర నిర్ణయం:**

నారదుడు వచ్చిన వేళావిశేషం. బలరాముని మందిరంలోకూడా, సుభద్ర పెళ్ళిమాటలు జరుగుతున్నాయి. ఏమనుకొంటున్నారో అని సుభద్ర కూడా చాటుగా ఉండి వింటోంది. తన చెల్లెలికి తన ప్రియశిష్యుడు దుర్యోధనుడే తగిన వరుడని ఎప్పుడో నిర్ణయించానని బలరాముడనగానే, ఓహో ఈ సంబంధం దివ్యంగా వుందనేసి నారదుడు మెచ్చుకుని ఎదురుగా ఉన్న కృష్ణుని వైపు తిరిగి పరిస్థితులంటూ నమస్కారబాణం వదిలాడు. కాని రేవతి కల్పించుకొని "మన సుభద్ర అర్జుననినే వరించినట్టుంది మనకు దుర్యోధనుడెంతో అర్జునుడూ అంతేగా" అన్నది. "అదెలా అర్జునుడు ధర్మరాజు తమ్ముడు. ఈ జన్మలో రాజు కాలేడు. దుర్యోధనుడు కౌరవాగ్రేసరుడు. రారాజు, ఈసంబంధం తప్పదు." అని చెప్పి, సుభద్రను దుర్యోధనునికి చేసుకోమని ధృతరాష్ట్రులవారికి నేడే శుభలేఖ పంపుతానన్నాడు బలరాముడు. శ్రీకృష్ణుడు చేతలవాడేగాని మాటలవాడు కాడు. కనుక అన్నగారి కెదురు చెప్పకుండా మౌనం వహించాడు. ఇది తెలియక పాపం సుభద్ర కోపం, నిరాశ, దుఃఖం పొంగిరాగా వెళ్ళి దిగులు పడుతోంది. శ్రీకృష్ణుడువచ్చి చెల్లెలి నోదారుస్తూ, "సుభద్రా! అర్జుననికీ నీకూ కళ్యాణం జరిపించే భారం నాది నా మాటనమ్ము" అని చేతిలో చేయి వేసి చెప్పాడు. ఆ అభయ హస్తంతో సుభద్రకు ప్రాణం లేచి వచ్చింది. అర్జునుని తలుచుకొంటూ ఆనందపారవశ్యంలో తేలిపోయింది. ఆమె ప్రేమగాన తరంగాలు వాయు వేగమునపోయి, అర్జునుని హృదయంలో ప్రతి ధ్వనించాయి.

**నారాయణ మంత్రం:**

సుభద్రను తలచుకొంటున్న అర్జుననికి నారదుడు ప్రత్యక్షమై బలరాముడు సుభద్రను దుర్యోధనునికివ్వ నిశ్చయించిన వార్తనందించి, మీరిక యతీశ్వరుని వేషం ధరించి ద్వారకకు చేరండి. తరువాత సర్వం మీ శ్రీకృష్ణులవారు చక్క చేస్తారని నారాయణ మంత్రం ఉపదేశించి వెళ్ళాడు.

**కామియైన స్వామి:**

సుభద్రకోసం యతీశ్వరుడైన అర్జునుడు ద్వారకలో రైవతకాద్రి యందు మఠంవేసి నారాయణ జపం చేస్తాడు. వాని మిత్రుడు బ్రహ్మచారి, చిన్నయతివేషం ధరించి వెళ్ళి బలరాముని దర్శించి తన గురుస్వామి మహిమను వర్ణించాడు. యతులంటే బలరామునికి వెర్రి. వెంటనే ఆ యతీశ్వరుని తన మందిరానికి ఆహ్వానించాలని బయలుదేరాడు. ఈలోగా కృష్ణుడు, అర్జునుని కలుసుకొని- వేషం బాగుందిగాని ఈ రహస్యం ఎవరికీ తెలియరాదు. నేను చెప్పేవరకూ నీవు బయల్పడరాదు- అని బోధించి వెళ్ళాడు. బలరాముడు మేళతాళాలతో వచ్చి,ఘనంగా స్వాగతం చెప్పి, ఈ కపట యతిని తీసుకొనివెళ్ళి సుభద్ర ఉద్యానంలోనే విడిది ఏర్పాటు చేసి, చెల్లెలికి శుభం అని స్వామి సేవలకు సుభద్రనే నియోగించాడు.

**గడ్డమే అడ్డం:**

స్వాముల సేవ తనకు జయమని చిన్నన్నయ్య కూడా చెప్పాడు. సుభద్ర ఎంతో భక్తితో స్వామికి సేవలు చేస్తోంది. ప్రియురాలిని చూసుకుంటూ సేవలందుకొంటుంటే, అర్జుననకు ఎంత ఆనందం కలుగుతూందో అంత విసుగూ పుడుతోంది. ముక్తికాంత నెపంగా సుభద్రనుద్దేశించి ప్రణవ గీతమన్నట్లు ప్రణయగీతం పాడుతున్నాడు. ఈవింత భక్తిగానం సుభద్రకు వింతగా వుండేది. ఈయనొక లీలా శుకుడనుకొని, ఈస్వామి సేవాఫలంగా

తనకర్జునుడెప్పుడు లభిస్తాడా అని చింతతో ఉంటూ, ఒకనాడు "నీకై వేచితినయ్యా" అంటూ ఒక పాట కూడా పాడింది. ఆమె నిరీక్షణంతా తనకోసమేనని తెలిసి, అర్జునుడు - నీకు జోస్యం చెపుతానంటూ ఆమె చేతిని తన చేతిలోనికితీసికొని పారవశ్యంలో తన హృదయానికి హత్తుకున్నాడు. ఆ చేష్టతో స్వామిమీద అనుమానం, కోపం వచ్చి సుభద్ర రుసరుస వెళ్ళి ఆ స్వామి మంచివాడుకాడు, వెంటనే వెళ్ళకొట్టండని కృష్ణునితో చెప్పింది. అర్జునుడు తొందరపడివుంటాడని ఊహించి శ్రీకృష్ణుడు 'లేదమ్మా ఆ స్వామిని నేనే పిలిపించాను. ఎక్కడున్నా అర్జునునీక్షణాన రప్పించగల మహిమగలవాడు. ఈమారు వెళ్ళినప్పుడు నీకే తెలుస్తుందని సుభద్రను బుజ్జగించి పంపాడు. సుభద్ర ఎంతో భక్తిగా వచ్చి "మా బావ నిక్కడకు రప్పించండి" అని ప్రార్ధించింది. అప్పుడర్జునుడు కొంటెగా ఆమెకు "ఓం ప్రాణేశాయనమః ఇయం ముహూర్తే సాక్షాత్కారం కురు కురు" అనే మంత్రాన్ని ఉపదేశించి, కళ్ళు మూసుకొని మూడు సార్లు జపించి చూడు నీబావ ప్రత్యక్షమవుతాడన్నాడు. సుభద్ర కళ్ళుమూసుకొని మంత్రం జపిస్తుండగా అర్జునుడు వేషం తీసివేసి కూర్చున్నాడు. సుభద్ర కళ్ళు తెరిచేటప్పటికి ఎదుట యతికాదు; అర్జునుడే ప్రేమగీతం పాడుతూ పలకరిస్తున్నాడు. తనప్రియుని నాటకమంతా తెలిసి సుభద్ర సంభ్రమాశ్చర్యాలతో దూసుకు వెళ్ళిపోయింది. సుభద్రా అని పిలుస్తూ అర్జునుడామె మందిరం వరకూ వెళ్ళాడు. ఆసమయంలో బలరాముని రాక చూసి శ్రీకృష్ణుడే యతీశ్వరుడై కూర్చున్నాడు. బలరాముడు వచ్చి స్వామియే అనుకుని సుభద్రా దుర్యోధనుల వివాహానికి లగ్నంపెట్టమనీ పెళ్ళివారు వచ్చేవరకూ శ్రీకృష్ణునికీ రహస్యం తెలియరాదని అన్నాడు. "దశమీ లగ్నం మంచిదని" అన్నగార్ని పంపి ఈలోగా పంచమీ లగ్నాన సుభద్రార్జునులకు వివాహం జరిపించి ఆ రాత్రికి రాత్రే వారిని ఇంద్రప్రస్థం పంపించివేశాడు.

తరువాత ఈ రహస్యం తెలిసి బలరాముడుగ్రుడైనాడు. శ్రీకృష్ణుని చూసి "నాకు తెలుసు ఈ కపట నాటకం నడిపించింది నీవే; నీకు సుభద్ర, అర్జునుడు కూడా ఎంత కృతఘ్నులవుతారో చూస్తూవుండమ"ని కోపాన్ని వెళ్ళగ్రక్కి, ఇంక చేసేదిలేక తమవైపునుంచి పాండవులకు జరగవలసిన సత్కారాలు జరిపించి రమ్మని శ్రీకృష్ణుని ఇంద్రప్రస్థానికి పంపాడు.

శ్రీకృష్ణుడు వెళ్ళి పాండవులకు బహుమానాలందించి, వారివల్ల ఆదరింపబడుతూ సత్కారాలందుకొంటూ సంతోషంగా కాలం గడుపుతున్నాడు.

**ఖాండవదహనం:**

ఒకనాడు అర్జునుడూ కృష్ణుడూ ఖాండవవన సమీపానికి విహారం వెళ్ళారు. అగ్నిదేవుడు విప్రుని రూపంలో వారిని దర్శించి తాను ఆజీర్ణ వ్యాధితో బాధ పడుతున్నాననీ, దివ్యౌషధులుగల ఈఖాండవవనమును దహిస్తే కాని తన జాడ్యంపోదని, ఎప్పుడు యత్నించినా ఇంద్రుడు విఘ్నాలు కలిగిస్తున్నాడని వారి సహాయంకోరగా వారంగీకరించారు. అర్జునునకు గాండీవమును అక్షయతూణీరా లను, శ్రీకృష్ణునకు చక్రాయుధమునూ లభించేట్టుచేసి అగ్నిదేవుడు ఉగ్రజ్వాలా రూపమున ఖాండవ దహనం ప్రారంభించాడు. వనమంతా మహాప్రళయంగా దహించుకుపోతోంది. ఇంద్రుని మిత్రుడు తక్షకుడు ఆ వనంలోవున్నాడు. అతని రక్షణకోసం, అగ్ని చల్లారేట్టు ఇంద్రుడు కుంభపాతంగా వర్షాన్ని కురిపించాడు. కాని ఒక నీటి చుక్క కూడా క్రిందపడకుండా అర్జునుడు బాణాలతో బ్రహ్మాండమైన పందిరి అల్లాడు. అగ్నిదేవునికిసంతృప్తికరంగా ఖాండవదహనం జరిగింది.

**బ్రహ్మావర ప్రభావం - శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ:**

గయుడు, తాను తెలిసిచేసినా తెలియకచేసినా తన చేష్టలు జగత్ప్రసిద్ధములై ముల్లోకాల్లోను తనకీర్తి విస్తరించేటట్టు బ్రహ్మదేవుని వరం పొంది, విమానంలో వస్తూ, విలాసినుల స్తోత్రగానంలో మైమరిచి సేవిస్తున్న తాంబులాన్ని క్రిందికి ఉమిశాడు. ఆ నిష్ఠీవనం, ఇంద్రప్రస్థం నుంచి ద్వారకకు వెళుతూ దారిలో అగి సూర్యునికి అర్ఘ్య ప్రదానం చేస్తున్న శ్రీకృష్ణుని దోసిటిలోనే పడింది. అంత కృష్ణుడు ఆగ్రహోదగ్రుడై ఈ అపచారం చేసిన దూర్తుడెవడని సూర్యదేవునే ప్రశ్నించాడు. సూర్యుడు సర్వసాక్షి, "బ్రహ్మవరప్రభావ చోదితుడైన గయు"డని విశదంచేశాడు. అయిన ఆ దురాత్ముని శిరస్సుని నాచక్రధారచే ఖండింతునని శ్రీకృష్ణుడు శపథం చేశాడు. ఇంక ఇంటికివెళ్ళిన గయునికి అన్నీ అపశకునాలే. ఇంత విలయానికి హేతువేమని ఆందోళనపుడుతున్న గయునికి "నీవు చేసిన నిష్ఠీవనం సూర్యునికి అర్ఘ్యమిస్తున్న శ్రీకృష్ణభగవానుని దోసిటపడినది. ఆ అపరాధానికి నీశిరస్సును తన చక్రధారచే ఖండితునని శ్రీకృష్ణుడు ప్రతిజ్ఞ చేశాడని అశరీరవాణి వినిపించింది. ఆ దారుణవార్త విని ఇంక నన్ను రక్షించగలవారెవరని గయుడల్లాడిపోయాడు. బ్రహ్మదేవుని ప్రార్థించాడు. శివుని వేడుకొన్నాడు. కాని శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ మాన్పుటకెవరూ సిద్ధపడలేదు. నిరాశచే కృంగిపోతున్న గయునుకి నారదముని వచ్చి ఉపాయం చెప్పాడు. సంగతి చెప్పకుండా ముందువెళ్ళి అర్జునుని శరణుకోరవలసిందనీ అతడభయమిచ్చిన తర్వాత సంగతి తెలిసినా నిన్ను విడువడని - నిన్ను రక్షించగలవాడు నరనారయణుల అంశలోపుట్టిన ఆ నరుడేననీ సూక్ష్మం చెప్పాడు. గయుడు, అర్జునుడే శరణని బయలుదేరాడు.

**అర్జున ప్రతిజ్ఞ:**

ప్రకృతిసౌందర్యాన్ని వినోదిస్తూ సుభద్రార్జునులు ప్రేమగాన పరవశులై వుండగా అర్జున, పల్గుణ, పార్థ శరణుశరణంటూ గయుడువచ్చి అర్జునుని కాళ్ళమీద పడ్డాడు. నిస్సంకోచంగా అర్జునుడతనికి అభయమిచ్చాడు. తరువాత నిజం తెలియగానే తన ప్రాణబంధువైన కృష్ణునితోనే విరోధమాయని విచారించి శరణార్ధిని రక్షించడమే క్షత్రియధర్మం గనుక ఏది ఏమైనా గయుని రక్షించి తీరుతానని అర్జునుడు ప్రతిజ్ఞచేశాడు.

**ఇంక రాయబారాలు:**

ఈసంగతి తెలిసి శ్రీకృష్ణుడు పాండవుల వద్దకు అక్రూరమహాశయుని రాయబారిగాపంపాడు. అతడు వచ్చి - అన్ని ఉపకారాలుచేసిన శ్రీకృష్ణునితో మీకు వైరం తగదు; గయుని మాకు అప్పగించమని పలువిధాల నచ్చచెప్పాడు. పంచపాండవులూ ఏక కంఠంగా శ్రీకృష్ణుడు మాకు చెలి, చుట్టం, దైవం-శరణార్థిని రక్షించడం క్షత్రియ ధర్మం గనుక అర్జునుని చూసి తానే గయుని క్షమించి ఈగండం నుంచి తమను కాపాడవలనేని వినయ విధేయతాపూర్వక విజ్ఞప్తితో అక్రూరుని తిరిగి పంపించారు.

ఇంత మాత్రాన ఈ విలయమాగదని తనను చూసి అయినా, తన చిన్నన్నయ్య శాంతించకపోడని సుభద్ర ద్వారకకు వచ్చింది. ఆమె అవస్థకు జాలిపడి, రేవతి, సత్యభామ, రుక్మిణి ఒక్కొక్కరే శ్రీకృష్ణుని సమాధాన పరచాలని చూశారు. కాని కృష్ణుడందర్నీ కసిరికొట్టాడు. అదిచూసి సుభద్ర కన్నీళ్ళతో అన్నకాళ్ళు పట్టుకొంది. గయుని క్షమించి ఈగండం కాయమని బ్రతిమాలింది. మామీద నీప్రేమ ఏమైపోయిందని వాపోయింది. కాని గయుని అపరాథం కంటే తన మాటను ధిక్కరించి అర్జునుడు కృతఘ్నుడైనాడేయని కృద్దుడై కృష్ణుడు - అర్జునుని యుద్దమునకే సిద్దపడమని చెప్పి చెల్లెల్ని పంపివేశాడు.

ప్రతిస్పర్థులై రణరంగంలో నిలిచిన ఆ ప్రియబావమరదులు వాగ్వాదములతోనూ, పరస్పర నిందోక్తులతోనూ, వీర రౌద్ర భయానక రసములు వెల్లివిరియు రీతిలో దివ్యాస్త్రయుద్ధాన్ని సాగించారు. ఆ పోరును నివారించుటకై పరమశివుడే స్వయంగా ధరకు దిగినాడు. "మా అర్జునుని చూచి గయుని ఏనాడో కాచినాను, రానున్న కురుక్షేత్ర సంగ్రామంలో మా అర్జునుని దివ్యాస్త్ర సంపద ఎటువంటిదో లోకమునకు చాటి చెప్పుటకే ఈ లీలను సంకల్పించినాను" అని శ్రీ కృష్ణుడు తన మనసులోని మాటను ఎల్లరకు విశిదీకరించాడు. తేలిక పడిన హృదయములతో అందరూ లీలావినోది అయిన ఆ శ్రీకృష్ణ భగవానుని చేతులు జోడించి నమస్కరించారు.

**శుభం**

1. నారదుడు: (గానం: ఘంటసాల)

దేవదేవ నారాయణ పరంధామ పరమాత్మ
నీ లీలల నెన్నతరమ భక్త పారిజాతమా !
దేవదేవ నారాయణ పరంధామ పరమాత్మ
సకల భువన సంచాలక అఖిల దనుజ సంహారక
ఎప్పుడెచట అవతరించి ఏమి నటనసేతువో ! ॥దేవదేవ॥
దీనసుజన పరిపాలా మునిసన్నుత గుణజాలా
ధరణినేమి మహిమచాట ద్వారకలో నుంటివో ॥దేవదేవ॥

2. కృష్ణుడు: (గానం: ఘంటసాల)

అలిగితివా సఖీ ప్రియా కలత మానవా
ప్రియ మారగ నీదాసుని ఏల జాలవా? ॥అలిగితివా॥
లేని తగవు నటింతువా మనసు తెలియనెంచితివా
ఈ పరీక్షమాని ఇంక దయను చూడవా? ॥అలిగితివా॥
నీవె నాకు ప్రాణమనీ నీఆనతి మీరననీ
నీవె నాకు ప్రాణమనీ నీఆనతి మీరననీ
సత్యాపతి నా బిరుదని నింద ఎరుగవా? ॥అలిగితివా॥
ప్రియురాలిని సరసనుండి విరహమిటుల విధింతువా...
ప్రియురాలిని సరసనుండి విరహమిటుల విధింతువా
భరియింపగ నాతరమా కనికరించవా? ॥అలిగితివా॥

3. కృష్ణుడు: పద్యం (గానం: ఘంటసాల)

నను భవదీయ దాసుని మనంబున నెయ్యపు కిస్కబూని- తా
చిన యది నాకు మన్ననయ; చెల్వగునీ పదవల్లవంబు-మ
త్తను పులకాగ్రకంటక వితానము తాకిన నొచ్చునంచు నే
ననియెద అల్కమానవుకదా ఇకనైన అరాళ కుంతలా!
(పారిజాతాపహరణం)

4. సుభద్ర: (గానం: పి.సుశీల, ఘంటసాల)

అన్నీ మంచి శకునములే కోరికతీరే దీవెనలే
మనసున మంగళ వాద్యమహా్మ్రోగెలే ॥అన్నీ మంచి॥
నావలెనే నా బావ కూడా
నాకై తపమును చేయునులే
తపము ఫలించి ననువరియించి
తరుణములోనే బిరాన నన్నుచేరులే ॥అన్నీమంచి॥

అర్జునుడు:
అన్నీ మంచి శకునములే కన్యాలాభసూచనలే
మనసున మంగళ వాద్యమహా్మ్రోగెలే ॥అన్నీమంచి॥
కుడికన్నదిరె కుడిభుజమదిరె
కోరిన చెలినను తలచెనులే
చిరకాలముగా కాంచిన కలలూ
నిజమౌ తరుణము వచ్చెనులే ॥అన్నీమంచి॥
అన్నీ మంచి శకునములే కన్యాలాభసూచనలే
మనసున మంగళ వాద్యమహా్మ్రోగెలే

సుభద్ర:
మల్లెతోరణల మంటపమందే
కనులూ మనసులు కలియునులే
కలిసినమనసుల కలవరములతో
జీవితమంతావసంతగానమౌనులే ॥అన్నీమంచి॥

5. అర్జునుడు: శ్లోకం (గానం: ఘంటసాల)

వసుదేవ సుతం దేవం - కంస చాణూర మర్దనమ్
దేవకీ పరమానందం - కృష్ణం వందే జగద్గురుమ్
వందే నవఘన శ్యామం - పీతకౌశేయ వాసనమ్
సానందం సుందరం శుద్ధం - శ్రీకృష్ణం ప్రకృతే పరమ్॥

6. సుభద్ర- చెలికత్తెలు: (గానం: పి.సుశీల, బృందం)

స్వాములసేవకు వేళాయె వైళమ రారే చెలులారా
ఆశీర్వాదము లభించుగా చేసే పూజలు ఫలించుగా ॥స్వాముల॥
ఎన్ని తీర్థములు సేవించారో ఎన్ని మహిమలను గణియించారో
విజయంచేసిరి మహానుభావులు మన జీవితములు తరించుగా
॥స్వాముల॥
లీలాశుకులో ఋష్యశృంగులో మన యతీంద్రులై వెలసిరిగా
ఏమి మౌనమో - ఏమిధ్యానమో మనలోకములో ఉండరుగా
॥స్వాముల॥
ఏయే వేళలకేవి ప్రియములో ఆవేళలకవి జరుపవలె
సవ్వడి సేయక సందడి చేయక భయభక్తులతో మెలగవలె......
॥స్వాముల॥

7. అర్జునుడు: (గానం: ఘంటసాల)

చాలదా ఈపూజ దేవీ, చాలదా ఈ కొలువు దేవీ
నీ భక్తునింత నిరాదరణ చేయనేలా ॥చాలదా॥
నీవాలు చూపులే నాప్రాణము, నీమందహాసమే నా జీవము
తపము జపము చేసి అలసి సోలసి సోలినే
ఇక కనికరించి ఈబాధను బాపవేల? ॥చాలదా॥
నీ అందెల గలగలలే ప్రణవనాదము
నీ కంకణ రవళియే ప్రణయ గీతము
నీ కటాక్ష వీక్షణమే నాకు మోక్షము
కరుణజూపి ఈదీనుని కావవేల? ॥చాలదా॥
నీవులేని నిముషాలే యుగము లాయెనే
చెంతనుండి మాటలేని యోగమాయెనే
వరముకోరి ఈ చెఅలో చిక్కుపడితినే
జాలి దలచి ముక్తినొసగ జాలమేల? ॥చాలదా॥

9. సుభద్ర : (గానం: పి.సుశీల)

నీకై వేచితినయ్యా ఓ ఏకాంత రామయ్యా
నీకై కాచితినయ్యా నీకై కాచితినయ్యా ॥నీకై॥
నీవేక్షణమున వచ్చేదవోయని ఎదురులు చూచితినయ్యా
నీవు నడతువని త్రోవత్రోవల పూవుల పరచితినయ్యా ॥నీకై॥
చిగురాకులలో గాలి కదలినా నీవని భ్రమసితినయ్యా
చిలుకపలికినా నీ పిలుపేయని ఉలుకున కలగితినయ్యా ॥నీకై॥
నీకు ప్రియముగా విరిసిన పూవుల మాలికలల్లితినయ్యా
మనసున నిలచిన మంగళ రూపము ఎన్నడు చూచెదనయ్యా ॥నీకై॥

8. బ్రహ్మచారి - చంద్రిక: (గానం: బి.గోపాలం, స్వర్ణలత)

బ్రహ్మచారి: అంచెలంచెలు లేని మోక్షము చాలా కష్టమె భామినీ
చంద్రిక : కష్టమైనను ఇష్టమేనని కోరి నిలచితి చినమునీ
బ్రహ్మచారి: అయిన కుదురుగ ఎదుట కూర్చుని గాలి గట్టిగ పీల్చుమా
చంద్రిక : స్వామీ - స్వామీ
బ్రహ్మచారి: ఏమి? ఏమి?
చంద్రిక : నేను పీల్చినగాలి నిలువక అకటా మీపై విసిరెనే
అకట మీపై విసిరెనే
బ్రహ్మచారి: అందుకేమరి ॥అంచెలంచెలు॥
బ్రహ్మచారి: అయిన కన్నులు మూసి చూపును
ముక్కుకొనపై నిలుపుమా
చంద్రిక : స్వామీ - స్వామీ
బ్రహ్మచారి: ఈ మారేమి?
చంద్రిక : అచట నిలువక చూపులన్నీ అయ్యోమీపై దూకెనే
అయ్యోమీపై దూకెనే
బ్రహ్మచారి: అదేమరి ॥అంచెలంచెలు॥

**10. అర్జునుడు:** (గానం: ఘంటసాల)

తపము ఫలించిన శుభవేళ, బెదరగనేలా ప్రియురాలా
ఎదుట నిలువుమని మంత్రమువేసి చెదరగనేల జవరాలా! ॥తపము॥
తెలిమబ్బులలో జాబిలివలెనే మేలిముసుగులో దాగెదవేలా
తెలిమబ్బులలో జాబిలివలెనే మేలిముసుగులో దాగెదవేలా
వలచి వరించి మనసుహరించి నను గికురించగ నేలా.... ॥తపము॥
చూపులతోనే పలుకరించుచు,
చాటునవలపులు చిలుకరించుచూ
చూపులతోనే పలుకరించుచు,
చాటునవలపులు చిలుకరించుచూ
కోరిక తీరే తరుణము రాగా తీరా ఇపుడీ జాగేలా ! ॥తపము॥

**11. నారదుడు: పద్యం** (గానం: ఘంటసాల)

భళిరా బావపయిన్ సహోదరిపయిన్ వాత్సల్యభావంబు పు
ష్కలమై రాజిల వేదవేద్యుడగు కృష్ణస్వామి వేడ్కన్ శుభం
బలరారన్ వరుపాదముల్ కడిగి కన్యాదానమున్ జేయు ను
జ్జ్వల దృశ్యంబును చూడగల్గితిని నా జన్మంబు ధన్యంబుగా॥

**12. సత్యభామ & కోరస్:** (గానం: ఎస్.వరలక్ష్మి, బృందం)

వేయి శుభములు కలుగు నీకు పోయిరావే మరదలా !
ప్రాణ పదముగ పెంచుకొంటిమి నిన్ను మరువగ లేములే !
వాసుదేవుని చెల్లెలా ! నీ ఆశయే ఫలియించలే
దేవదేవుల గెలువ జాలిన బావయే పతి ఆయెలే ! ॥వేయి॥
భరతవంశము నేల వలసిన వీరపత్నివి నీవెలే
వీరధీర కుమారమణితో మరల వత్తువు గానిలే ! ॥వేయి॥

**13. గయుడు - కన్యలు :** (గానం: వసంత, స్వర్ణలత, బృందం)

కన్యలు : నీకుసాటి రవితేజా
గయుడు : ఊఁ. కానీ
కన్యలు : నీకుసాటి రవితేజా నీవేలే మహారాజా ! ॥నీకు॥
అందచందాలలో జయంత వసంతులైనా
ఐశ్వర్య వైభవాలలో అమరేంద్ర కుబేరులైనా
గయుడు : భళి భళి
కన్యలు : త్రిభువన పాలనలో త్రిమూర్తులైనా
నీతో తులతూగరయా ॥నీకు॥

**14. కృష్ణుడు: పద్యం** (గానం: ఘంటసాల)

ధరణీ గర్భము దూరుగాక, వడిపాతాళంబునన్ చేరుగా
క; రహస్యంబుగ దిగ్గజేంద్రముల వెన్కన్ దాగునే గాక, ఆ
హరబ్రహ్మాదులె వాని రక్షణకు తోడ్పై వత్తురే గాక ; ము
ష్కర గంధర్వు శిరంబు త్రుంచెద మహోగ్ర క్రూరచక్రాఘతిన్॥

**15. గయుడు: పద్యం** (గానం: మాధవపెద్ది సత్యం)

నాగలోకముజొచ్చి డాగియుండెదమన్న
బలియె శ్రీహరికి నన్ పట్టి యిచ్చు
దేవలోకము జేరి జీవింతమనుకున్న
ఇంద్రుడే నన్ను వధింపగలడు
ఏ గగనాలకో ఎగిరిపోయెదమన్న
అఖిల దిక్పాలకులతని భటులే
సర్వోపగతుడగు చక్రధారి ప్రతిజ్ఞ
తప్పింపనెవ్వరి తరము గాదు
బ్రహ్మశివులంతవారె నన్ వదిలినారు
ప్రాణముల మీద ఆశయే వదలలేదు
ఇట్టి హింసకు పాలైతిని, ఎందుబోదు,
ఎవరి వేడుదు, నాగతి ఏమి స్వామీ.

**16. యుగళ గీతం** (గానం: పి.సుశీల, ఘంటసాల)

అర్జున : మనసు పరిమళించెనే తనువు పరవశించెనే
నవ వసంత గానముతో నీవు నటన సేయగనే
సుభద్ర : మనసు పరిమళించెనే తనువు పరవశించెనే
నవ వసంత నాగముతో నీవు చెంత నిలువగనే ॥మనసు॥
అర్జున : నీకు నాకు స్వాగత మనగ కోయిలమ్మ కూయగా
సుభద్ర : గలగల సెలయేరులలో కలకలములు రేగగా ॥మనసు॥
అర్జున : క్రొత్త పూల నెత్తావులతో మత్తుగాలి వీచగా
సుభద్ర : భ్రమరమ్ములు గుములు గుములుగా ఝుం ఝుమ్మని పాడగా ॥మనసు॥
అర్జున : తెలిమబ్బులు కొండ కొనలపై హంసవలవలె ఆడగా
సుభద్ర : రంగరంగవైభవములతో ప్రకృతి విందు సేయగా ॥మనసు॥

**17. అర్జునుడు: పద్యం** (గానం: ఘంటసాల)

స్థాణుండే హరి పక్షమున్ గొని మహాద్వంద్వంబున్ వచ్చినన్
రానీ ; బంధులు మిత్రులున్ తుదకు సామ్రాజ్యప్రభల్ పోయినన్
పోనీ ; కృష్ణుడే పోరు తప్పదనినీ ; ముల్లోకముల్ సాక్షిగా
ఏ నీ ప్రాణము కాచి తీరెద భయంబింకేల వర్జింపుమా!

**18. కృష్ణుడు :** (గానం: ఘంటసాల)

ఉపకారంబులు చేసినాడ కదా, ఎన్నో రీతులన్ ; నాకె నే
డపకారంబు ఘటింప జూచుటలు మేలా నీకు పార్థా! మహా
విపదబ్ధిన్ వడిదాటి నాకన్ వెసన్ విధ్వంసమున్ జేయు నీ
కపటాచార కృతఘ్నువర్తనల లోకంబెందు హర్షించునే ?

**19. అర్జున:** (గానం: ఘంటసాల)

ఆపదలు మేమె తరియించు అదను జూచి
ఉట్టిపడెదవు మమ్మెల్ల ఉద్ధరించు
ఘనుడనని కీర్తి కనెదవు కాని కృష్ణ!
నీవు లేకున్న మేము రాణింపలేమె!

**20. సంవాద పద్యాలు** (గానం: ఘంటసాల)

కృష్ణుడు : ఎగ్గు సిగ్గులులేక ఏక చక్రపురాన
బిక్షాటనము చేసి వెలగలేదే!
అర్జున : నల్లపిల్లివోలె ఇల్లిల్లు గాలించి
పాల్వెన్న దొంగిలి ప్రబల లేదే
కృష్ణుడు : అడ్డువచ్చునటంచు ఆ ఏకలవ్యుని
వ్రేలును నరికించి వెలగలేదే.
అర్జున : అడ్డు వచ్చినయంత అర్ధాంగి రుక్మిణీ
తరుణి సోదరు తలగొరగ లేదే.
కృష్ణుడు : ఒక ఇంతినేవురు ఉద్వాహమై రాజ
కుల ప్రతిష్ఠను బుగ్గి కలుపలేదే.
అర్జున : పతుల నేమార్చి వ్రేపల్లె భామలతోడ
మఱగి యాదవకీర్తి చెఱుపలేదే.
కృష్ణుడు : ఋషులు మునులను భక్తి కీర్తించు దివ్య
పురుష లక్షణ మర్మము నరయలేక
ధరణి మాలీలలకె అపార్థము ఘటించు
ఇంత మూర్ఖుడవని ఎన్నడెరుగనైతి.
అర్జున : వంచనలు దొంగతనములు వక్రగతులె
పరమలీలలుగా చాటు వర్తి భజన
పరుల మూర్ఖత అవతారపురుషుడనని
నేగడెదవుగాని ఎరుగనే నీ చరిత్రా!

**21. గయుడు & కోరస్:** (గానం: మాధవపెద్ది సత్యం, బృందం)

జయ చంద్రకోటీర జయ ఫణి హారా
జయ నిర్జితానంగ జయ కృపాపాంగ
జయ మేరు కోదండ జయ విష్ణు కాండ
జయా జయా పరమేశ జయ పార్వతీశా
పాహిమాం పాహిమాం పాహిమాం.

జయంతి పిక్చర్స్ వారి

# శ్రీకృష్ణార్జునయుద్ధము

## తారాగణం

| | |
|---|---|
| ఎ.నాగేశ్వరరావు | ఎన్.టి.రామారావు |
| బి.సరోజాదేవి | ఎస్.వరలక్ష్మి |
| గుమ్మడి | శ్రీరంజని |
| కాంతారావు | ఛాయాదేవి |
| మిక్కిలినేని | ఋష్యేంద్రమణి |
| ధూళిపాళ | సురభి బాలసరస్వతి |
| నాగయ్య | స్వరాజ్యలక్ష్మి |
| సి.హెచ్.కుటుంబరావు | చిట్టి |
| అల్లురామలింగయ్య | మోహన |
| ముక్కామల | లీల |
| కైకాల సత్యనారాయణ | ప్రభాకరరెడ్డి |
| ఎ.వి.సుబ్బారావు | మహంకాళి వెంకయ్య |
| శ్రీనివాసులురెడ్డి | డి.నారాయణ |
| వడ్లమాని విశ్వనాథం | ఆదిశేషయ్య |

తదితరులు

## టెక్నీషియన్లు

| | |
|---|---|
| మాటలు, పాటలు | : పింగళి నాగేంద్రరావు |
| సంగీత దర్శకుడు | : పెండ్యాల నాగేశ్వరరావు |
| ప్లేబాక్ గాయకులు | : ఘంటసాల, సుశీల, మాధవపెద్దిసత్యం, స్వర్ణలత, బి.గోపాలం, వసంత |
| ఛాయగ్రహణ దర్శకుడు | : కమల్‌ఘోష్ |
| ట్రిక్కులు | : రవికాంత్ నగాయిచ్ |
| కెమెరా సంచాలకుడు | : బి.రామచంద్రయ్య L.C& S.E |
| శబ్దగ్రహణ దర్శకుడు | : వి.శివరామ్ B.Sc |
| రికార్డిస్టు | : టి.ఎ.జగన్నాధ్, |
| ఎడిటింగ్ | : వాసు |
| మేకప్ | : హరిబాబు, పీతాంబరం, ఎస్.ఎస్.ఆర్.మూర్తి |
| కళ | : మాధవపెద్ది గోఖలే, తోట వెంకటేశ్వరరావు |
| నృత్యము | : పసుమర్తి కృష్ణమూర్తి |
| అసోసియేట్ దర్శకుడు | : శింగీతం శ్రీనివాసరావు B.Sc |
| సహాయ దర్శకుడు | : ఘంటసాల చిరంజీవి |
| నిర్మాణ నిర్వాహకులు | : సూదిరెడ్డి శంకరరెడ్డి, డి.రామస్వామి |
| సహాయ నిర్మాత | : టి.పట్టాబిరామరెడ్డి M.A |
| నిర్మాత దర్శకుడు | |
| సినిమా అనుకరణ | : కె.వి.రెడ్డి B.Sc (Hons) |
| స్టూడియో | : విజయా- వాహిని- వీనస్ |


కె.వి.రెడ్డి


పెండ్యాల నాగేశ్వరరావు


పింగళి నాగేంద్రరావు


ఘంటసాల


సుశీల


మాధవపెద్ది సత్యం


స్వర్ణలత


వసంత


ఎస్.వరలక్ష్మి

